# ఆంధ్రకేసరి కథ

చాలకాలం ఆంధ్ర రాష్ట్ర అవతరణ కోసం ప్రకాశం ఎంతో పాటు పడ్డాడు. 1953లో ఆ కార్యక్రమం ఫలించింది. అక్టోబర్ 1వ తేదీన నవ్యాంధ్ర ప్రభుత్వానికి ఆంధ్రకేసరిని ముఖ్యమంత్రిగా ఎన్నుకున్నారు. కర్నూలు రాజధానిగా ఏర్పరిచారు.



రాజధాని విషయంలో ప్రతిపక్షాల వారు చాలా ఆందోళన చేశారు.




ఒక ప్రక్క ప్రతిపక్షాల వారు తలపెట్టిన ఉద్యమాలను ఎదుర్కొంటూ విశాలాంధ్ర కోసం ప్రకాశం ప్రభుత్వం కృషి చేసింది. ప్రకాశం ప్రభుత్వంలో నాగార్జున సాగర్ ప్రాజెక్ట్, వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వంటివి ఎన్నో ప్రారంభమయ్యాయి. కానీ ప్రకాశం మంత్రి వర్గంలో ముఠా కలహాలు బయటపడ్డాయి.



మద్యపాన నిషేధము గురించిన నివేదిక పై ఒక్క ఓటులో ప్రకాశం ప్రభుత్వం ఓడిపోయింది. 1955 ఫిబ్రవరి శాసనసభ ఎన్నికలలో 88 ఏళ్ళ ప్రకాశమే ఘనవిజయం సాధించాడు.




1955 నవంబర్ 1వ తారీఖున విశాలాంధ్ర అవతరించింది. చిరకాలంగా తాను కన్న కలలు నిజమయ్యాయి. ఆంధ్రకేసరి ఆనందించాడు.



1957లో ప్రకాశం ఆరోగ్యం చెడింది. హైదరాబాద్‌లో ఉస్మానియా ఆసుపత్రిలో చేర్చారు. జూన్ 20 తేదీ ఆంధ్రకేసరి కన్నుమూశాడు. ఆ వార్త దేశం అంతటినీ దుఃఖ సముద్రంలో ముంచివేసింది. నలుమూలల నుంచి ప్రజలు హైదరాబాద్ వచ్చారు.

కన్నీటితో లక్ష ప్రజలు ఆ నాయకునికి శ్రద్ధాంజలి అర్పిస్తున్నారు.



అయిపోయింది.

# ఆంధ్రప్రదేశ్

ప్రధాన సంపాదకులు

శ్రీ రాజ్యం సిన్హా

సంపాదకులు

యస్. వి. గోపాలశాస్త్రి

సంపుటి : 19; సంచిక : 10 ఆగస్టు, 1975

శ్రావణ—భాద్రపద, 1897

శాతవాహనుల వంశాన బుట్టినవాడు
కాకతీయుల పోతుగడ్డ మెట్టినవాడు
పల్లెలోనే కాదు ఢిల్లీలో సైతమ్ము
పెద్దగద్దెల నేలి పేరుకెక్కినవాడు
ఎవడయ్యా ఎవడు వాడు?
ఇంకెవడయ్యా తెలుగు వాడు!

—సి. నా. రె.

మొదటి కవరు పేజీ : మన ప్రియతమ నేత శ్రీమతి ఇందిరా గాంధీ

రెండవ కవరు పేజీ : ప్రకాశం కథ (చిత్రాల్లో)

మూడవ కవరు పేజీ : నెహూర్రూ జూలాజికల్ పార్కులో రైలు ప్రయాణం!
(ఫొటో : శ్రీధర్స్ ఫొటోసర్వీస్)

చివరి కవరు పేజీ : స్వాతంత్ర్యం వచ్చింది.

మధ్య పేజీల్లో : దక్షిణ మధ్య రైల్వేవారి నవరత్నాలు
(ప్రత్యేక వ్యాసం : బొమ్మల చయనిక)

సాలు చందా : ఆరు రూపాయలు

వెల: 50 పైసలు

రిజిస్టరు నెం: హెచ్/హెచ్. డి. 81

## ఈ సంచికలో...

పేజీ





## స్వాతంత్ర్యదినోత్సవ ప్రత్యేక సంచిక

# "ఆంధ్రప్రదేశ్" పత్రికకు

# ముఖ్యమంత్రి సందేశం

భారతదేశ చరిత్రలో ఆగస్టు నెలకు ఒక ప్రత్యేక స్థానం వుంది. ఈ నెల మన స్వాతంత్ర్య సమరానికీ, స్వాతంత్ర్య లబ్ధికీ, స్వాతంత్ర్యానంతర అభ్యుదయానికీ అంకితమైంది.

"ఆంధ్రప్రదేశ్" ఆగస్టు సంచిక ప్రత్యేక సంచికగా వెలువరించడం ఏటేటా ఆచారమే అయినప్పటికీ యీ యేడు దీనికి ప్రత్యేక ప్రాధాన్యం వుంది. దేశంలో అభ్యుదయ శక్తులకూ, వ్యతిరేకశక్తులకూ జరుగుతున్న సంఘర్షణలో వ్యతిరేకుల చర్యలవల్ల పరిస్థితి చేయిదాటి పోతున్నది. గాంధీజీ, నెహ్రూ వంటి మహానాయకులు కలలుగన్న నవభారత దేశ నిర్మాణంలో జాతి నిమగ్నమై వున్న సమయంలో విచ్ఛిన్నకరశక్తులు వీరవిహారం చేయడం మొదలు పెట్టాయి. వీటిని అదుపులో పెట్టే చర్యలు తీసుకోవడం అవసరం.

జాతీయ, అంతర్జాతీయ రంగాలలో అనేకమైన సవాళ్లను ఎదుర్కోవలసిన తరుణంలో జాతి అంతా ఐక్యతను ప్రదర్శించి, చరమలక్ష్యమైన సోషలిస్టు సమాజ స్థాపనకు కృషి చేయడం కర్తవ్యం. ఈ కృషిలో ఆంధ్రప్రదేశ్ ప్రజలు ముందంజవేసి మన జాతీయ నాయకత్వానికి పూర్తి మద్దతు ప్రకటించి దేశాభ్యుదయ మార్గంలో మార్గదర్శకులు కావాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

(సం) జలగం వెంగళరావు

# దేశంలో అత్యవసర పరిస్థితి
# ప్రధాని ప్రకటన

దేశ సుస్థిరతకు ఏర్పడ్డ ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీఅహమ్మద్ అత్యవసర పరిస్థితిని ప్రకటించిన వెంటనే జూన్ 26 వ తేదీ ఉదయం దేశ ప్రజల నుద్దేశించి శ్రీమతి ఇందిరాగాంధీ రేడియోలో ప్రసంగించారు.

ప్రధాని ప్రసంగం పూర్తి పాఠం.

"నేను భారత దేశంలోని సామాన్య స్త్రీ పురుషుల ప్రయోజనానికి కొన్ని అభ్యుదయ చర్యలను ప్రవేశపెట్టడం ప్రారంభించినప్పటి నుండి దేశ వ్యాప్తంగా తీవ్రమైన కుట్ర జరుగుతూ వుండటం మీ అందరికీ తెల్సిందే. ప్రజాస్వామ్యం పేరిట ప్రజాస్వామ్యాన్ని పని చేయకుండా చేయటానికి కృషి జరుగుతున్నది. ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాలను పనిచేయనివ్వడం లేదు. ఒక్కొక్కసారి సభ్యుల చేత రాజీనామా చేయించడానికి, స్వయంగా ఎన్నుకోబడిన శాసన సభలను రద్దు చేయించడానికి బలాన్ని వుపయోగిస్తున్నారు. వాతావరణం ఆందోళనలతో నిండిపోయింది. అవి దౌర్జన్య సంఘటనలకు దారి తీస్తున్నాయి. నా మంత్రివర్గ సహచరుడు శ్రీ ఎల్. ఎన్. మిశ్రా ఘోరంగా హత్య చేయబడినప్పుడు యావత్తు దేశం దిగ్భ్రాంతి చెందింది. భారత ప్రధాన న్యాయమూర్తిపై జరిగిన దాడిని కూడా తీవ్రంగా గర్హిస్తున్నాం.

"కొంతమంది వ్యక్తులు మన సాయుధ బలాలను తిరుగుబాటు జరపమని, మన పోలీసులను తిరుగబడమని రెచ్చగొడుతున్నారు. మన రక్షణ బలాలు, పోలీసులు క్రమశిక్షణ, గాఢమైన దేశభక్తి కలవారు అందువల్ల వారు ఈ కవ్వింపులకు లొంగరనేది నిజం. అయినా ఈ అంశం ఈ కవ్వింపు తీవ్రతను తగ్గించదు. విచ్ఛిన్న శక్తులు పూర్తి స్థాయిలో విజృంభిస్తున్నాయి. మతాభిమానాలను రెచ్చగొట్టడం జరుగుతున్నది. ఇది మన సమైక్యతకు ప్రమాదాన్ని తెచ్చిపెడుతున్నది.

" నా మీద అన్ని రకాల అసత్య ఆరోపణలు చేస్తున్నారు. భారత ప్రజలు నన్ను బాల్యంనుండి ఎరుగుదురు. నా జీవితం అంతా మన ప్రజల సేవలోనే గడిచింది. ఇది నా స్వంత విషయం కాదు. నేను ప్రధానిగా ఉన్నా లేకపోయినా అదేమంత ముఖ్యం కాదు. కాని ప్రధాని పదవి ముఖ్యమైనది. దానికి చెరుపు చేయడానికి కావాలని రాజకీయమైన ప్రయత్నం జరుగుతున్నది. అది ప్రజాస్వామ్యానికి కాని దేశానికి కాని శ్రేయస్కరం కాదు.

" ఈ పరిణామాల పట్ల మేము దీర్ఘకాలం ఎంతో ఓర్పు చూపాం. ఇప్పుడు మేము మామూలుగా పని చేయకుండా చూడటానికి దేశమంతటా శాంతిభద్రతలను సవాలు చేసే కొత్త కార్యక్రమాలను చేపట్టారని తెలుసుకున్నాం. దేశ సుస్థిరతకు ప్రమాదం వాటిల్లనున్నప్పుడు ఏ ప్రభుత్వమైనా ఎలా చూస్తూ వూరుకోగలదు? కొద్ది మంది చేష్టలవల్ల అత్యధిక సంఖ్యాకుల హక్కులకు భంగం వాటిల్లుతున్నది. దేశంలో గట్టిగా వ్యవహరించడానికి జాతీయ ప్రభుత్వం యొక్క శక్తి సామర్థ్యాలను సన్నగిల్లజేసే ఎటువంటి పరిస్థితిఅయినా బైటినుండి వచ్చే ప్రమాదాలను ప్రోత్సహించి తీరుతుంది. సమైక్యతను సుస్థిరతను కాపాడటం మన కర్తవ్యం. దేశ సమైక్యతను కాపాడాలంటే గట్టి చర్య తీసుకోవాల్సి వుంది.

"అంతరంగిక సుస్థిరతకు ఏర్పడ్డ ప్రమాదం ఉత్పత్తిపైన, ఆర్థికాభివృద్ధి అవకాశాలపైన కూడా దెబ్బ తీస్తుంది. గడచిన కొద్ది మాసాలలో మేము పట్టుదలగా తీసుకున్న చర్యలు చాలవరకు ధరల పెరుగుదలను అదుపులో పెట్టగలిగినవి. ఆర్థిక వ్యవస్థను పటిష్టం చేయడానికి, పేదలు, అథోగతిలో వున్నవారు, నిర్ణీత ఆదాయాలు కలవారు మున్నగు వివిధ వర్గాల ఇబ్బందులను తొలగించడానికి మేముమరికొన్ని చర్యలనుగురించి శ్రద్ధగా ఆలోచిస్తున్నాము. వాటిని నేను త్వరలోనే ప్రకటిస్తాను.

" కొత్త అత్యవసర పరిస్థితి ప్రకటన చట్టానికి కట్టుబడి వుండే పౌరుల హక్కులకు ఏ మాత్రం భంగం కలిగించదని హామీ ఇస్తున్నాను దేశంలోని పరిస్థితులు త్వరితగతిని మెరుగుపడి ఈ అత్యవసర పరిస్థితిని సాధ్యమైనంత త్వరలో రద్దు చేయడానికి వీలు కలిగించగలవని విశ్వసిస్తున్నాను.

దేశంలోని అన్ని ప్రాంతాలనుండి అన్ని వర్గాల ప్రజల వద్ద నుండి నా పట్ల సుహృద్భావాన్ని చాటుతూ వచ్చిన సందేశాలు నన్ను ఆనందంతో నింపివేశాయి.

" ఇకముందు కూడా మీరు నాతో సహకరించాలని నాయందు విశ్వాసాన్ని వుంచాలని మిమ్మల్ని అర్థిస్తున్నాను. "

## అత్యవసర పరిస్థితి ప్రకటన వల్ల పౌర జీవితానికి భంగం లేదు



# పేద వర్గాల ఆర్థికాభ్యున్నతికి ప్రధాన మంత్రి ఆర్థిక కార్యక్రమం

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ జూలై 1వ తేదీ రాత్రి దేశప్రజలను ఉద్దేశించి ఆకాశవాణి ద్వారాచేసిన ప్రసంగంలో ప్రభుత్వం వెను వెంటనే చేపట్టుతున్న 20అంశాల నూతన ఆర్థిక కార్యక్రమాన్ని గూర్చి పేర్కొన్నారు. ఆప్రసంగంలోని కొన్ని భాగాలు :

"ప్రభుత్వం అమలు పరచనున్న కొన్ని ఆర్థిక కార్యక్రమాలను గూర్చి యీనాడు మీతో ప్రస్తావిస్తాను. వీటిలో కొన్ని కొత్తవి, మిగతావి లోగడ మొదలెట్టినవే అయినా యిప్పుడు మరింత దృఢదీక్షతో శక్తివంతంగా అమలు పరచవలసినట్టివి.

ఆర్థిక కార్యక్రమాలను అమలు జరిపేందుకు ఆత్యయికపరిస్థితి మనకు కొత్త అవకాశాలు కల్పించింది.

మనం ఎదుర్కొంటున్న సమస్యలన్నిటిలోను ముఖ్యంగా చెప్పుకోవలసినది ధరల సమస్య. గత అయిదు రోజులుగా అనేక వస్తువుల ధరల తగ్గుముఖంపట్టిన ధోరణి కనిపిస్తున్నది. ఈ ధోరణి యిలా కొనసాగేట్టు చూడాలి. ఇందుకుగాను ఉత్పత్తిని పెంచడానికి సేకరణను ఉద్ధృతం చేయడానికి అత్యవసర వస్తువుల పంపిణీని క్రమబద్ధం చేయడానికి ప్రభుత్వం అనేక చర్యలు తీసుకుంటుంది.

సరుకుల నిలువలనూ, ధరలనూ తెలియజేసే పట్టికలను షాపులలో ప్రదర్శించ వలసినదిగా వ్యాపారస్తులకు అదేశించమని రాష్ట్ర ప్రభుత్వాలను యింతకు ముందే కోరడం జరిగినది. సరుకులను దాచిపెట్టిన వ్యాపారస్తులపైనా, యీనిబంధనలను అతిక్రమించిన వారిపైనా కఠినచర్యలు తీసుకోవడం జరుగుతుంది.

భూ సంస్కరణలు

మన జనాభాలో ఎక్కువ మంది గ్రామీణప్రాంతాల్లో నివసిస్తున్నారు. ఇనుమడించిన ఉత్సాహంతో మనం భూసంస్కరణల చట్టాన్ని అమలు జరిపి, భూమిలేని పేదలకు మిగులు భూమిని పంపిణీ చేయాలి. భూములకు సంబంధించిన రికార్డుల్ని పూర్తి చేయడానికి స్థానిక ప్రజల సహాయం మనకు కావాలి. గిరిజనులు తమ భూమిని కోల్పోకుండా చూసేందుకు ప్రత్యేకంగా జాగ్రత్తవహించడం జరుగుతుంది.

గ్రామీణ ప్రాంతాలలో యిళ్ళస్థలాలు యిచ్చే కార్యక్రమాన్ని బాగా విస్తృతపరచడం జరుగుతుంది. భూఖామందులకు సంబంధించిన యిళ్ళ స్థలాలలో ఒక నిర్ణీత కాలం నుంచి వుంటున్న భూమి లేని కూలీలకు ఆ స్థలాలపై యాజమాన్యహక్కు కల్పించడానికి చట్టాలు రూపొందించబడతాయి. భూఖామందులు వారిని బలవంతంగా ఖాళీ చేయించే ప్రయత్నాలు చేస్తే ప్రభుత్వం అట్టి వారిపై కఠినంగా చర్యలు తీసుకుంటుంది.

వెట్టి చాకిరి చేయించడం అమానుషం. దీనిని నిర్మూలించాలి. ఇటువంటి వెట్టిచాకిరి చేయించుకోడానికి సంబంధించిన అన్నిరకాల ఒప్పందాలూ, తదితర ఏర్పాట్లూ చట్టవిరుద్ధమైనవిగా ప్రకటించడం జరుగుతుంది.

**గ్రామీణుల ఋణ విముక్తి**

గ్రామీణుల ఋణవిముక్తికి అంచెలంచెలుగా చర్యలు తీసుకోవాలని మేము అనుకుంటున్నాం. భూమి లేని రైతుకూలీలకు గ్రామీణ చేతిపనుల కళాకారులకు, రెండు హెక్టార్లకన్న తక్కువ భూవసతి గల చిన్నతరహా, మధ్యతరహా రైతులకు సంస్థాగత ఋణ సహాయాన్ని ప్రత్యమ్నాయంగా కల్పించడానికి సంబంధించి కొత్త పథకాలను రూపొందించడంతో పాటు, అటువంటి ప్రజల వద్దనుంచి ఋణాలను వసూలు చేసుకొనేందుకు వేసే దావాలమీదా, డిక్రీల అమళ్ళపైనా మారిటోరియం విధించబడుతుంది. సహకార సంఘాలు, వాణిజ్య బ్యాంకులు, ప్రభుత్వమూ యిచ్చిన ఋణాలకు యిది వర్తించదు.

సమాజంలో ఎక్కువగా పీడింపబడుతున్న వర్గం వ్యవసాయ కూలీలు. వ్యవసాయ కూలీల కనీస వేతనాలకు సంబంధించి ప్రస్తుతం అమల్లోవున్న చట్టాల్ని పునఃపరిశీలించి, అవసరమైతే యీ కనీసవేతనాలను తగువిధంగా ఎక్కువ చేసేందుకు చర్యలు తీసుకోవడం జరుగుతుంది.

ఉత్పత్తిని పెంచడానికి మనం అన్ని విధాల కృషి చేయాలి. వ్యవసాయ, పారిశ్రామికోత్పత్తులు ఎక్కువ చేయడంలో నీరు, విద్యుచ్ఛక్తి ప్రముఖపాత్ర వహిస్తాయి. కనీసం 50 లక్షల హెక్టార్ల భూమికి అదనంగా సాగు నీటిసౌకర్యం కల్పించడానికి చర్యలు తీసుకోవడం జరుగుతుంది. భూగర్భజలాలను వెలికితీసి వినియోగించడానికి వెంటనే ప్రయత్నాలు జరుగుతాయి. సాగు నీటి సౌకర్యం కల్పించడానికి, మంచినీటి సౌకర్యం ముఖ్యంగా కరువు ప్రాంతాల్లో కల్పించడానికి ప్రయత్నం జరుగుతుంది; యింకా భూగర్భజలాల సర్వేలు చేపట్టడం జరుగుతుంది.

విద్యుచ్ఛక్తి పరిస్థితి కొంతవరకు మెరుగైంది. మరో 2600 మెగావాట్ల విద్యుదుత్పాదనకు చర్యలు తీసుకోవడం జరుగుతుంది. విద్యుచ్ఛక్తిప్రాజెక్టులు అమలుపరచడానికి తగినన్ని నిధులు కల్పించబడుతున్నాయి. దీర్ఘకాలిక అవసరాలను దృష్టిలో పెట్టుకొని సూపర్ థర్మల్ కేంద్రాలను కేంద్రప్రభుత్వం ఆధ్వర్యంలోనే నెలకొల్పే ప్రయత్నాలు సాగుతున్నాయి. రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలులు మరింత చురుగ్గా పనిచేసేందుకు చర్యలు తీసుకోబడతాయి.

**చేనేత పరిశ్రమ**

వ్యవసాయం తరువాత ఎక్కువ మంది పనిచేస్తున్న పరిశ్రమ చేనేతపరిశ్రమ. చేనేత పనివారికి తమ వృత్తికి అవసరమయ్యే వస్తువులను సరసమైన ధరలకు అందించడం జరుగుతుంది. చేనేత విషయాలను చూసేందుకు ప్రత్యేకంగా ఒక చేనేత అభివృద్ధి కమీషనర్‌ను నియమిస్తారు. చేనేత పనివారికి మరింత రక్షణలు కల్పించే ఉద్దేశ్యంతో చేనేత మగ్గాలకు కొన్ని రకాల వుత్పత్తులు కేటాయింపు చేసే విధానాన్ని తగు విధంగా సవరించడం జరుగుతోంది.

మిల్లువస్త్రాలకు సంబంధించి దోవతులు, చీరెలు, బట్టల నాణ్యత పెంచేలా చేయడానికి, గ్రామీణ ప్రాంతాల్లోనూ, పట్టణప్రాంతాల్లోనూ ఎక్కువ కేంద్రాల ద్వారా అమ్మకం జరగడానికి వీలుగా కంట్రోలు బట్టల పథకం మెరుగుపరచడం జరుగుతుంది.

**పట్టణ ఆస్తులపై సీలింగు**

పట్టణప్రాంతాల్లో స్థలాల వ్యాపారాలవల్లా, పట్టణ ఆస్తులు ఒకేచోట కేంద్రీకరింపబడడంవల్లా బాగా అసమానతలు ఏర్పడుతున్నాయి. పట్టణాభివృద్ధికి యివి ఎంతగానో ప్రతిబంధకాలవుతున్నాయి ఖాళీస్థలాల యాజమాన్యంపైనా, అవసరానికి మించిన స్థలాన్ని సేకరించడంపైనా, కొత్తగా కట్టే నివాస గృహాలలో నిర్మాణస్థల పరిమితిపైనా, సీలింగు విధిస్తూనూ, పట్టణప్రాంతాల స్థలాలనూ, పట్టణాలలో కలవనున్న స్థలాలనూ, సమాజపరం చేస్తూనూ శాసనంచేయడానికి చర్యలు తీసుకోవడం జరుగుతున్నది.

పన్నుల ఎగవేత నేరం. ఆవిధంగా ఎగవేతవల్ల మిగిలే నల్లధనం చాలావరకు విలాసాలకు ఖర్చవుతున్నది. పట్టణ ఆస్తుల విలువను బాగా తగ్గించి ప్రకటించడం జరుగుతున్నది. ఆస్తి విలువను లెక్కగట్టడానికి వెంటనే ప్రత్యేక అధికారి బృందాలను ఏర్పాటు చేయడం జరుగుతుంది, నేరం చేసినవారిపై కఠిన చర్యలు తీసుకోబడుతాయి. అక్కడికక్కడే విచారణ జరిపి శిక్షలు విధించే ఆలోచన వుంది.


12–3

స్మగ్లర్లపై దాడిని తీవ్రం చేయడం జరుగుతుంది. సాంకేతిక కారణాలపై వారు విడుదల కావడంతో యీ ప్రయత్నాలకు కొంత అవరోధం ఏర్పడింది. స్మగ్లర్ల ఆస్తులు వారిపేరుతో వున్నా, యితరులపేరుతో వున్నా వాటిని జప్తు చేయడం జరుగుతుంది.

లైసెన్సింగ్ పద్ధతులవల్ల ఆలస్యం జరిగి కొత్త పెట్టుబడులకు అవరోధం ఏర్పడుతోంది. వీటిని సులభం చేయడం జరుగుతుంది. దిగుమతుల అవసరంలేని, ప్రభుత్వ సహాయం అక్కరలేని పరిశ్రమల పెట్టుబడి పరిమితిని పెంచడం జరుగుతుంది.

ఇక్కడ ఒక విషయం చెప్పాలి. లైసెన్సులను దుర్వినియోగపరచడం జరుగుతున్నది. దిగుమతి ఎగుమతి నిబంధనలు సవరించబడుతున్నాయి. ఈ కేసుల విచారణలు త్వరగా జరుగుతాయి. నిబంధనలను అతిక్రమించిన వారి వస్తువులను జప్తు చేయడంతో సహా కఠిన శిక్షలు విధించ బడుతాయి.

పరిశ్రమల్లో కార్మిక ప్రాతినిధ్యం

పరిశ్రమల్లో కార్మికుల ప్రాతినిధ్యానికి సంబంధించిన పథకాలు—ముఖ్యంగా ఉత్పత్తి ప్రక్రియ స్థాయిలో ఉత్పత్తి కార్యక్రమాలలో ప్రాతినిధ్యానికి సంబంధించిన పథకాలు—ప్రవేశపెట్టబడతాయి.

గడచిన కొన్ని నెలలుగా రైల్వేల ద్వారా ఆహారధాన్యాలు, బొగ్గు, ఉక్కు, సిమ్మెంటుల రవాణా మెరుగ్గా వుంది. ఆహారధాన్యాలను ట్రక్కులద్వారా రవాణా చేయడంపై వున్న నిర్బంధాలు కూడా తొలగించబడతాయి. ఇందుకుగాను జాతీయ పర్మిట్ల విధానాన్ని ప్రవేశపెడుతున్నాము.

నిర్ణీత ఆదాయాలుగల ప్రజలు గత కొన్నేళ్ళుగా చాలా యిబ్బందులకు గురి అవుతున్నారు. వీరికి తక్షణ సహాయం అవసరం. ఆదాయపు పన్ను మినహాయింపుకు గల పరిమితిని 6,000 రూపాయల నుంచి 8,000 రూపాయలకు పెంచడం జరుగుతుంది.

విద్యార్థులకు సౌకర్యాలు

తమ స్వస్థలాలు విడిచి యితర చోట్ల ఉన్నతవిద్య అభ్యసించే బీద విద్యార్థులు చాలా యిబ్బందులకు గురి అవుతున్నారు. వీరికి సహాయపడేందుకు గాను వారువుండే అన్ని హాస్టళ్ళకు, అనుమతించిన వసతి గృహాలకు నిత్యావసర వస్తువులు కంట్రోలు ధరలకు సరఫరా చేయబడతాయి.

విద్యారంగంలో తీసుకోనున్న మరొక ముఖ్యమైన చర్య పాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయాల విద్యార్థులందరికి సరసమైన ధరలకు పాఠ్యపుస్తకాలు, స్టేషనరీ లభించేట్టు చూడడం, ధరలను ఖచ్చితంగా అదుపుచేయడం జరుగుతుంది. పుస్తకాల బ్యాంకులు ఏర్పాటు చేయబడతాయి.

చదువుకున్న యువకులకు ఉద్యోగావకాశాలను మెరుగుపరచేందుకు మన ఆర్థిక రంగంలోని సువ్యవస్థితమైన విభాగాల్లో ఒక నిర్ణీతకాలంపాటు ఎక్కువమంది అప్రెంటిస్‌లను యాజమాన్యం వారు స్వీకరించే విధంగా అప్రెంటిస్‌షిప్ చట్టాన్ని మార్పుచేయడం జరుగుతుంది. అప్రెంటిస్‌లుగా తీసుకొనేటప్పుడు షెడ్యూలు కులాలు, గిరిజనులు, అల్పసంఖ్యాక వర్గాలవారు, వికలాంగుల విషయంలో ప్రత్యేక శ్రద్ధవహించడం జరుగుతుంది.

రానున్న వారాల్లో చేపట్టనున్న యీ కొత్త కార్యక్రమంలోని వివిధ అంశాలను సంక్షిప్తంగా మాత్రమే నేను పేర్కొన్నాను. ఇతర విషయాలు పరిశీలనలో వున్నాయి. ఇంకా మరికొన్ని చర్యలను ముందు ముందు ప్రకటించడం జరుగుతుంది. ఇవన్నీ కలిపి దేశ ఆర్థిక స్వరూపాన్నే మార్చివేయగలవనడంలో నాకు ఎలాంటి సందేహమూ లేదు. మనమంతా మన నిస్సహాయతా దోరణిని వదిలించుకోవాలి. ఈ నాడు అత్యవసరంగా మనకు కావలసినది అదే."



# ప్రధాని 20 అంశాల ఆర్థిక కార్యక్రమానికి

## ముఖ్యమంత్రి మద్దతు

ప్రధాన మంత్రి ప్రకటించిన 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమానికి మన ముఖ్యమంత్రి హర్షం ప్రకటించారు. కార్యక్రమాన్ని పటిష్టంగాను, సత్వరంగాను అమలు జరపడాన్ని గూర్చి చర్చించ డానికి జూలై 2వ తేదీన ఏర్పాటు చేయబడిన ప్రభుత్వ కార్యదర్శుల, సీనియరు అధికారుల అత్యవసర సమావేశానికి ముఖ్యమంత్రి అధ్యక్షత వహించారు.

అత్యవసర వస్తువుల సరఫరాను క్రమబద్ధం చేసే కంట్రోలు ఉత్తర్వులను అమలు జరప డానికి కఠినమైన ఆదేశాలు జారీ చేస్తున్నారు. కొన్ని ప్రాంతాలలో పెద్ద రైతులు తమ అవసరాలకు మించిన భారీ నిల్వలను ఉంచుతున్నారు. జూలై ఆఖరునాటికి తమ మిగులు నిల్వలను విడుదల చేయాలని వారిని కోరాలని నిర్ణయించబడింది. 1975 జూలై 31 నాటికి మిగులు నిల్వగల రైతులు తమ నిల్వల వివరాలను ప్రకటించాలి. మిగులు ధాన్యాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుంది.

భూ కమతాల పరిమితి చట్టం అమలు అప్పుడే ప్రారంభమై త్వరితగతిని కొనసాగుతున్నది. దానిని మరింత పటిష్టంగా అమలు జరుపుతారు. హరిజనులు, ఇతర బలహీనవర్గాల వారికి ఇండ్ల స్థలాలు పంపిణీ చేసే కార్యక్రమాన్ని రాష్ట్ర ప్రభుత్వం యిప్పటికే అమలు జరుపుతున్నది. ఇందు కొరకు బడ్జెటు కేటాయింపులను యీ సంవత్సరం రూ. 2.5 కోట్లకు పెంచారు. కేంద్రం నుండి అదనపు సహాయం లభించే పక్షంలో యీ కార్యక్రమాన్ని మరింత పెద్ద ఎత్తున అమలు జరుపుతారు.

ప్రధాని ప్రకటించిన గ్రామీణ ఋణ విముక్తి ఏర్పాట్లు హర్షించ దగినవి. బలహీనవర్గాలకు అనుకూలంగా ప్రయివేటు పరపతి స్థానంలో సంస్థాగత పరపతి పద్ధతిని ఏర్పాటు చేస్తున్నందుకు రాష్ట్ర ప్రభుత్వం సంతోషిస్తున్నది.

అదనపు ప్రాంతాలకు నీటిపారుదల సౌకర్యం కల్పించడానికి అమలు జరిపే కార్యక్రమాలకు రాష్ట్ర ప్రభుత్వం పూర్తి సహాయం అందజేయడానికి సిద్ధంగా ఉంది. ఇటువంటి కార్యక్రమాలను అమలు జరపడానికి ఆంధ్రప్రదేశ్‌లో అపారమైన అవకాశాలు ఉన్నాయి. నాగార్జునసాగర్, పోచం పాడు, వంశధార, తుంగభద్ర ఎగువ కాలువ ప్రాజెక్టులు మొదలైన వాటి నిర్మాణం త్వరితగతిని

కొనసాగించడం ద్వారాను, కమాండు ఏరియా అభివృద్ధి పథకాన్ని సమగ్రంగా అమలు జరపడం ద్వారాను, ఎక్కువ భూమికి నీటిపారుదల సౌకర్యం కల్పించవచ్చు. భూగర్భ జలాల వినియోగం గూర్చి కూడా ప్రభుత్వం పథకాలను అమలు జరుపుతున్నది. విద్యుచ్ఛక్తి కార్యక్రమాలను త్వరిత గతిని అమలు జరపడంలో వెంటనే పాల్గొనడానికి రాష్ట్ర ప్రభుత్వం సిద్ధంగా ఉంది. ఎక్కువ మొత్తాలను కేటాయించడం ద్వారా శ్రీశైలం, నాగార్జునసాగర్ విద్యుచ్ఛక్తి ఉత్పాదక పథకాలను త్వరిత గతిని అమలు జరపవచ్చు. రామగుండం, కొత్తగూడెంలలో సూపర్ థర్మల్ స్టేషనులను ఏర్పాటు చేయడానికి సంబంధించిన ప్రతిపాదనలను కేంద్రానికి యింతకుముందే పంపడం జరిగింది.

## చేనేత పారిశ్రామికులు

చేనేత రంగానికి ప్రయోజనం కలిగేవిధంగా తగురీతిలో రిజర్వేషనులను క్రమబద్ధం చేయడాన్ని హర్షిస్తూ రాష్ట్రంలో చేనేత పరిశ్రమ అభివృద్ధికి కొత్త అభివృద్ధి పథకాలను రాష్ట్ర ప్రభుత్వం రూపొందిస్తున్నది. చేనేత వస్త్రాల కమీషనర్ కార్యాలయాన్ని హైదరాబాద్‌లో స్థాపించే విషయమై భారత ప్రభుత్వాన్ని అర్థించాలని సూచన చేయబడింది కంట్రోలు వస్త్రాల తయారీ, పంపకం వ్యవహారాలను సాఫీ చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం కూడా పూర్తిగా పాల్గొని సహకరిస్తుంది.

పట్టణ ఆస్తులపై గరిష్ట పరిమితి విధింపు చట్టం చేసేలోగా ముందుచర్యగా, పట్టణాలలోని ఖాళీ భూములను యితరులపరం చేయడాన్ని నిషేధిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1972 లోనే ఒక శాసనం చేసింది.

పరిశ్రమల్లో కార్మికుల ప్రాతినిధ్యానికి సంబంధించి ఒక పబ్లిక్ రంగం కంపెనీ బోర్డులో కార్మికుల ప్రతినిధికి ప్రాతినిధ్యం కల్పించి రాష్ట్ర ప్రభుత్వం అప్పుడే యీ కృషికి శ్రీకారం చుట్టింది అప్రంటిస్ శిక్షణకు సంబంధించిన నూతన పథకం తాలూకు వివరాలను గూర్చి రాష్ట్రప్రభుత్వం ఎదురుచూస్తున్నది.

విద్యార్థుల వసతి గృహాలకు కొన్ని వస్తువులను యిదివరకే కంట్రోలు ధరలకు సరఫరా చేస్తున్నారు. ఈ ఏర్పాట్లను యింకా విస్తరింప చేస్తారు. పాఠ్యపుస్తకాల జాతీయకరణ ద్వారా పుస్తకాలను సరసమైన ధరలకు పంపిణీ చేయడం జరుగుతున్నది. కేంద్ర పథకానికి సంబంధించిన వివరాలకొరకు వేచివున్నారు.

అత్యవసరంకాని ప్రభుత్వ ఖర్చులలో ఖచ్చితమైన పొదుపును పాటించడానికి ప్రభుత్వం నిశ్చయించింది ఆర్థిక కార్యక్రమాలను పటిష్టంగాను, త్వరితంగాను అమలు జరపాలని కోరుతూ అన్ని శాఖాధిపతులకు, జిల్లా కలెక్టర్లకు ముఖ్యమంత్రి లేఖలను వ్రాస్తున్నారు.

---

## ప్రధానికి ప్రజల మద్దతు

భారతజాతి సమగ్రతను సుస్థిరపరచడానికీ, ప్రజల పరిస్థితులను మెరుగుపరచడానికీ ప్రధానమంత్రి చేస్తున్నకృషిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమూ ప్రజలూ సంపూర్ణంగా బలపరుస్తున్నారు.

ప్రధానమంత్రి చెప్పినట్లు అత్యవసర పరిస్థితి ప్రకటన పౌరుల హక్కులను ఏ విధంగానూ భంగపరచదు.

ప్రశాంతంగా వుండవలసిందని ఆంధ్రప్రదేశ్ ప్రజలకు నేను విజ్ఞప్తి చేస్తున్నాను దేశ అంతర్భద్రతా రక్షణకూ, జాతి సమగ్రతా రక్షణకూ ఉద్దేశించి ప్రధానమంత్రి తీసుకుంటున్న, యిక ముందు తీసుకోబోయే చర్యలకు వారు పూర్తి మద్దతు ప్రకటిస్తారని నేను ధృఢంగా విశ్వసిస్తున్నాను.

జలగం వెంగళరావు

ముఖ్య మంత్రి

# తెలంగాణాలో స్వాతంత్ర్యోద్యమం, గ్రంథాలయోద్యమం వహించిన పాత్ర

శ్రీ కోదాటి నారాయణరావు

వాస్తవం చెప్పాలంటే తెలంగాణాలో స్వాతంత్ర్యోద్యమానికేకాదు, వికాసానికే బీజారోపణము గ్రంథాలయ స్థాపనతో ఆరంభ మయింది. భాషా పరమయిన చైతన్యం కల్గించి తద్వారా ఆత్మ గౌరవానికి నిజాం రాష్ట్రములోని ఆంధ్రులను పురికొల్పవలెననే ఉద్దేశంతో ఆంధ్ర భాషా ఉద్యమం ఆరంభించారు. స్వర్గీయులు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావు, రాజా నాయని వెంకటరంగారావు ప్రభృతులు దీనికి కాణాచిగా హైదరాబాదు పట్టణాన్ని చేయవలెననేదే వారి సంకల్పము. అయితే ఉద్యమం కేవలం తెలంగాణాకు మటుకే ఉద్దేశింపబడలేదు. తెలంగాణాలో హెచ్చుగా ఈ ప్రచారం అవసరమయినప్పటికీ తదితర ఆంధ్రప్రాంతంలో గూడ కుడి ఎడమగా ఈ అవసరం ఉంటూనే వున్నది. ఈ ఉద్యమానికి ప్రధానాంగాలుగా గ్రంథ ప్రచురణ, గ్రంథాలయాలు రూపొందించారు. విజ్ఞానం అందించడానికి ఈ రెంటికన్న కావలసిన దేమున్నది? ఎంతో దూరదృష్టితో చేసిన ఈ రెండు ఆలోచనలకు ప్రతిరూపమే విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి, శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము. ఈ రెంటికి కార్యస్థానముగా హైదరాబాదు నగరాన్నే నిర్ణయించుకొన్నారు. ముద్రణా సౌకర్యాలలోపం వల్ల విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి కార్యస్థానం చెన్నపట్టణానికి తరలించినప్పటికీ శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయం భాగ్యనగరంలోనే వుండి తెలంగాణాలో ప్రజాచైతన్యానికి శ్రీకారం చుట్టింది.

## కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం

1901 లో శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయం స్థాపించడం వల్ల నెలకొన్న ఆంధ్ర భాషా వికాసోద్యమం తెలంగాణాలో బాగా వేళ్ళు పోసికొన్నది. 1902 లో హనుమకొండలో రాజరాజ నరేంద్ర ఆంధ్ర భాషానిలయం స్థాపన జరిగింది. తరువాత 1, 2 సంవత్సరాలకే ఓరుగల్లులో శబ్దానుశాసన ఆంధ్ర భాషా నిలయాన్ని నెలకొల్పారు. ఖమ్మంలో అదే రోజులలో సరస్వతీ ఆంధ్ర భాషా నిలయాన్ని అక్కడి యువకులు స్థాపించుకొన్నారు. చివరకు ఎర్రుపాలెంవంటి మారుమూల గ్రామంలోకూడా ఉస్మానియా ఆంధ్ర భాషా నిలయం వంటి సంస్థని నెలకొల్పారు. ఈ విధంగా ఆంధ్రభాషా నిలయోద్యమం ఒక దశాబ్దంలో విద్యావంతులయిన యువకుల్లోనే కాకుండా స్థానికులయిన అంతగా చదువురాని యువకుల్లోనూ కదలికను తెచ్చింది. దీనికితోడు భారతదేశంలో దేశభక్తిని ప్రజ్వలింపచేసిన "వందేమాతరం" విజృంభణ చాలా సహాయపడింది. ఈ ఫలితంగా నిజాం రాష్ట్రాంధ్రుల్లో తాము ఆంధ్రులమన్న భావన మొలకెత్తింది. అనేకమంది యువకులు ఆ రోజుల్లో స్వదేశీ దీక్షను తీసుకొన్నారు. అంతకన్నా చేయగలిగిందేముంది? ఆకాలంలో 1914 లో విజయవాడలో జరిగిన ప్రథమాంధ్రదేశ గ్రంథాలయ సభకు తెలంగాణా ప్రతినిధులు కూడా వెళ్ళారు. ఈ విధముగా విశాలాంధ్ర భావనకు గ్రంథాలయోద్యమం ఆనాడే ప్రాతిపదికను సృష్టించిందని చెప్పవచ్చు.

## రాజకీయ చైతన్యం

ఇంతలో "హోమ్ రూల్ లీగ్" ఆందోళన ప్రారంభమైంది. ఈ చైతన్యము నిజాం రాష్ట్రంలోకూడా ప్రవేశించింది. అయితే చేయగలిగిన కార్యమేమిటి అన్న ప్రశ్న వుండనే వున్నది. ఆంధ్రుల మనస్తత్వానికి సహజంగా ఇదిదే గ్రంథాలయోద్యమం వెంటనే స్ఫురించింది. గ్రంథాలయాల స్థాపన తిరిగి విజృంభించింది. స్థాపించిన గ్రంథాలయాలు ఆంధ్రభాషానిలయాలు కావు. గ్రంథ నిలయాలు. అంటే, గ్రంథాలయోద్యమ ప్రభావంవల్ల పూర్వపు భాషానిలయమనే పేరు మారిపోయి గ్రంథనిలయమనే పేరుపెట్టడం ఆరంభమయింది. 1916 తరువాత స్థాపించిన గ్రంథాలయాలను గ్రంథనిలయాలనే పేరుతోనే వ్యవహరింపసాగారు. ఈ గ్రంథ నిలయాల ప్రభావమే నిజాం రాష్ట్ర ఆంధ్రుల్లో రాజకీయ జాగృతికి ప్రథమ సోపానమని చెప్పవచ్చు.

1919 లో గాంధీజీ రాజకీయ రంగంలోనికి ప్రవేశించారు. ఆ ఉద్యమ ప్రభావం నిజాం రాష్ట్రములో ఎంత వారించినా పడక తప్పలేదు. ప్రత్యక్షంగా సహాయ నిరాకరణోద్యమం జరుగక పోయినా ఖిలాపత్ ఉద్యమంవంటి ఉద్యమాలు హైదరాబాదులోనే గాక మహబూబునగరం మొదలయిన తెలంగాణా జిల్లాలలో కూడా

ప్రజలను మేల్కొల్పినవి. ఏదో ఒక పేరుతో బైటి రాజకీయ నాయకులను రప్పించనారంభించారు. ఒకానొక సభలో ఆంధ్రభాష ఆత్మగౌరవానికి తీవ్రఘాతం తగులగా 1922లో ఆంధ్రోద్యమం తల ఎత్తింది. దానికి ప్రధాన అంగంగా గ్రంథాలయ స్థాపనయే ప్రారంభమయింది. తెలంగాణా అంతటా తామరతంపరగా గ్రంథాలయాలు వెలసినవి. మధిరలో ఆంధ్రజన కేంద్ర సంఘ సమావేశముతోపాటు నిజాం రాష్ట్ర ఆంధ్ర ప్రథమ గ్రంథాలయ మహాసభ కూడా జరిగింది. దీనికి కీ. శే. పింగళి వెంకట్రామరెడ్డి గారు అధ్యక్షత వహించారు.

## రాజకీయ విప్లవ కేంద్రాలు

నిరాడంబరంగా నివురుగప్పిన నిప్పువోలె గ్రంథాలయాలు పనిచేస్తున్నా, వీటి సభలకు ప్రభు భక్తి పరాయణులను అధ్యక్షులుగా పెడుతూవున్నా ఈ ఉద్యమంలోనున్న విప్లవ స్వభావాన్ని పరిపాలనలోనున్న ఆంగ్లేయ అధికారులు పసిగట్టారనే చెప్పవచ్చు. ఇవి రాజకీయ విప్లవ కేంద్రాలని స్పష్టంగా నిర్వచించారు. ఆంధ్ర అనేశబ్దము జాతి పరమైన చైతన్యాన్ని కలుగ చేసి నిజాం రాష్ట్ర విచ్ఛిన్నతకు దారి తీయగలదని వారు జోస్యం చెప్పారు. ఆనాడు మనమేమి సమాధానాలు చెప్పినప్పటికీ వారిఊహయే నిజమైనదని చరిత్ర ఋజువుచేసింది. 1925 ప్రాంతాలలో కాబోలు సూర్యాపేటలో జరగవలసిన సభలను, ముఖ్యంగా గ్రంథాలయ సభలను రాజకీయ పరిమాణాలుకలుగ చేయగలవనే అభిప్రాయంతో ప్రభుత్వం నిషేధించింది. ప్రభుత్వమువారి అభిప్రాయము సరియైనదికాదని ప్రజల పక్షాన హైకోర్టులో వ్యాజ్యంవేయడం జరిగింది. చిత్రమేమిటంటే అంత నిరంకుశపాలనలో మతపాక్షికత తాండవిస్తూవున్న రోజుల్లో ప్రజలు వ్యాజ్యం వేశారంటే ఆనాటి న్యాయపీఠం ఔన్నత్యాన్ని ఊహించుకోవచ్చు. ఈ తీర్పు తరువాత 1927 ప్రాంతాలలో సూర్యాపేటలో చాల పెద్ద స్థాయిలో అనేక రకాల సభలు జరిగాయి. ఆంధ్రజన సంఘ సమావేశం, ద్వితీయ గ్రంథాలయ మహాసభ స్థానిక సంస్థల వార్షికోత్సవాలతోపాటు. యువజన మహాసభ, సంఘసంస్కరణ మహాసభ, మహిళాసభ మొదలైన మహాసభలుకూడా జరిగినవి. ఈ సభలు తెలంగాణాలో చాలా చైతన్యాన్ని తీసికొని వచ్చినవి. ఈ సభలకు కొద్దికాలం పూర్వమే కృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయం రజతోత్సవము కీ. శే. కావ్య కంఠగణపతిశాస్త్రి గారి అధ్యక్షతన జరిగింది. ఈ సమయంలోనే కీ. శే. కృష్ణస్వామి ముదిరాజు గారు యువకులనందరినీ చేరదీసి ఆంధ్ర సేవాదళాన్ని స్థాపించి రజతోత్సవాలకు ఎంతోసాయపడ్డారు. సూర్యాపేట సభల తర్వాత నల్లగొండ జిల్లాలో తిప్పర్తి, మిర్యాలగూడెం మొదలైన అనేక చోట్ల సభలు జరిగినవి. తెలంగాణాలో మారుమూల పల్లెటూళ్లలోను గ్రంథాలయాలు స్థాపించుకోవటం ఆరంభించారు. వార్షికోత్సవాలు జరగజొచ్చినవి. రాజకీయ చైతన్యం హెచ్చజొచ్చింది. ఇదంతా ప్రభుత్వానికి కన్నెర్ర కలుగచేసింది. హైకోర్టు తీర్పుకు ప్రతిగా "గష్తీ నిషానీ 53" అనే ప్రభుత్వ నిరంకుశాజ్ఞను జారీచేశారు. దీనివల్ల ప్రజల ప్రాథమిక స్వత్వాలలో ఒకటైన సమావేశ స్వాతంత్ర్యము పూర్తిగా అరికట్టబడింది. గ్రంథాలయాలపైన ప్రభుత్వము "నిగరాని" హెచ్చింది. అనేకచోట్ల కార్యకర్తలపై గ్రంథాలయాలను మూసి వేయడానికి ఒత్తిడి తేవడం జరిగింది. లాంఛనాలు పాటించకుండానే గ్రంథాలయాలు అక్రమంగా రద్దుచేసిన సన్నివేశాలు కోకొల్లలు.

## ముసుగులతో ముందంజ

ఈ పరిస్థితుల్లో గ్రంథాలయోద్యమం అధికారులతో మొరబెట్టుకుంటూ, ఇది కేవలం విద్యా ఉద్యమమని చాటుకుంటూ ప్రభుభక్తి పరాయణులను ఆహ్వానిస్తూ అనేకముసుగులతో ప్రజలలో చైతన్యాన్ని కలిగిస్తూ ముందుకు సాగింది. గ్రామ గ్రామాన గ్రంథాలయాలు నెలకొన్నవి. ఆంధ్రోద్యమప్రచారకులుగా తమ పూర్తి సమయాన్నిచ్చి పనిచేసిన శ్రీఉన్నవ వెంకట్రామయ్య, శ్రీ మంత్రిప్రగడ వెంకటేశ్వర రావుగారలు తమపర్యటనల్లో ఈ గ్రంథాలయ కార్యకర్తలకు ఉత్సాహం కలిగిస్తూ ఉత్తేజపరిచారు. ఇంతలో 1930లో ఉప్పు సత్యాగ్రహం వచ్చింది. అనేక మంది యువకులు ఈ ఉద్యమంలో పాల్గొనడానికి పరిసర ప్రాంతాలకు వెళ్ళారు. కొందరా ఉద్యమాలలో పాల్గొని అక్కడనే కారాగార శిక్షలనుభవించారు. తరువాత తెలంగాణాకు తిరిగివచ్చిన తరువాత క్రొత్తరాజకీయ ఆలోచనలు ఆరంభమయినవి. ఆంధ్రోద్యమంలో మార్పువచ్చింది. గ్రంథాలయోద్యమకార్య పద్ధతుల్లో పరివర్తన రాసాగింది. రాజకీయ చైత్యనం తీసుకు రావడానికి గ్రంథాలయాలు ప్రధానముగా పని చేయనారంభించాయి. దేశంలో తెలంగాణా అంతటా పనిచేస్తున్న గ్రంథాలయాలను సమీకరించి ఒక్క త్రాటిపై నడపలెననే ప్రయత్నాలు ఒకటి రెండు సార్లు జరిగినవి. కాని అంతగా ఫలించలేదు. 1937 లో రాష్ట్రములలో స్వయం పరిపాలన చాలావరకు సిద్ధించింది. నైజాం రాజ్య పరిసర ప్రాంతాలలో కాంగ్రెస్ అధికారంలోకి వచ్చింది. ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగా నైనా ఇది స్వదేశ సంస్థాన ప్రజలలో ముఖ్యంగా నిజాం రాష్ట్రవాసుల్లో ఆత్మవిశ్వాసాన్ని కలుగచేసింది. సంస్థానాలలో ప్రజా ఉద్యమాలు ఆరంభమయినాయి, నైజాంలో గూడ "స్టేట్ కాంగ్రెస్" నెలకొల్పవలెననే ప్రయత్నం జరిగింది. ప్రభుత్వము ఈ సంస్థ నెలకొనక పూర్వమే నిషేధించి భ్రూణహత్యను చేసింది. ఈ దుశ్శాసనాన్ని ఉల్లంఘిస్తూ మొదటిసారిగా నిజాంరాష్ట్రములో శాసనోల్లంఘన జరిగింది. ఈ ఉద్యమం జరుగుతూండగానే ఆర్యసమాజం సత్యాగ్రహ ఉద్యమం, హిందూ పౌరసత్వ సంఘ సత్యాగ్రహం మొదలైనవి. గాంధీజీ ఆజ్ఞానుసారం స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహ ఉద్యమం ఉపసంహారణ జరిగింది.

## రాజకీయ సాహిత్యం

ప్రభుత్వముపై తిరగబడి బాధలననుభవించడానికి అలవాటు పడిన తర్వాత ప్రజల్లోగల భయం తొలగిపోయింది. పూర్వం మోస్తరు గ్రంథాలయోద్యమం రాజభక్తి పరాయణత ముసుగువేసికొని ప్రజాచైతన్యాన్ని ప్రచారం చేయడం మార్చి బాహాటంగా రాజకీయ ప్రచారం చేయసాగింది. ఈ రోజుల్లో తెలంగాణా రాజకీయ ఉద్యమంలో మార్పు వచ్చింది. రాజకీయ పక్షాలు ఏర్పడి బహిరంగంగా

(తరువాయి 13 వ పేజీలో)

# స్వాతంత్ర్య సమరంలో తెలుగువారి సముచిత పాత్ర

డాక్టర్ పి. తిరుమలరావు

1947వ సంవత్సరం, ఆగస్టు 15వ తేదీన మనకు స్వాతంత్ర్యం లభించింది. మనదేశం ప్రపంచంలోకెల్లా పెద్దదయిన ప్రజాస్వామ్యసంస్థగా ఉదయించి, రూపురేఖలుదిద్దుకొని మానవజాతి భావి జీవిత విధానానికే పునాదిగా నేటికీ పేరు పొందినదనటంలో సందేహం లేదు. గాంధీజీ మన యీ జీవిత విధానానికి మార్గదర్శి. ప్రజాబాహుళ్యపు మానసిక చైతన్యంలో, ప్రజాసామాన్యపు బుద్ధివికాసపు పటుత్వంలో దృఢనమ్మకంతో, పండిత జవహర్‌లాల్ నెహ్రూ యీ ప్రజాస్వామ్యానికి శిల్పి. తరువాత మన ఆశయాలను ప్రజాబాహుళ్యానికి, ఆర్థిక వనరుల ద్వారా సోషలిస్టు సమాజ నిర్మాణానికి మన నాయకులంతా తోడ్పడి, మన స్వాతంత్ర్యానికి నిజమయిన రూపకల్పన చేస్తున్నారు. ఆ స్వాతంత్ర్య యజ్ఞంలో, ఆంధ్రుల పాత్రను గూర్చి గర్వంగా చెప్పుకోవచ్చు.

1947వ సంవత్సరంలో సిద్ధించిన స్వాతంత్ర్యానికి పునాదులు 1857 సిపాయి తిరుగుబాటు మొదలని చెప్పవచ్చు. అది మన ప్రథమ స్వాతంత్ర్యసమర సన్నాహమనీ, గొప్ప ప్రయత్నమనీ చరిత్రకారులు నిరూపించారు. అందుచేత 1857 మొదలు 1947 వరకు మన చరిత్రను సింహావలోకనం చేసుకోవటంలో ఎంతైనా ఆనందం, ఆత్మవికాసానికి అవకాశంవుంది.

1857లో జరిగిన సిపాయి తిరుగుబాటు అని చెప్పబడే మన స్వతంత్రసమరానికి పడికట్టురాళ్ళుగా పనిచేసినవారు నానాసాహెబ్, తాంతియాతోపే, కున్వార్‌సింగ్, ఝాన్సీలక్ష్మీబాయి, బీగమ్ ఆఫ్ ఔధ్ మొదలైన మహానాయకులు. వారు జరిపిన విప్లవప్రభావం దక్షిణాపథంలోనూ, ఆంధ్రదేశంలోనూకూడా సంచలనంకలిగించింది ఆ విప్లవసమయంలో, గోదావరితీరాన, పాపికొండల సమీపాన, కొరటూరుగ్రామ మునసబు, కారుకొండ సుబ్బారెడ్డి విప్లవకారులతో వుత్తరప్రత్యుత్తరములు జరిపి, కొండకోయరాజుల సహాయంతో తిరుగుబాటు లేవదీశాడు. ఆయన నానాసాహెబ్ గోదావరితీరానికి వస్తున్నాడనే వుత్సాహంతో యీ సాహసకార్యం చేశానని ధైర్యంగా వాఙ్మూలం యిచ్చాడు. సుబ్బారెడ్డితోపాటు మరి ఏడుగురిని ముద్దాయిలుగా చేర్చి ఉరిశిక్ష విధించారు. ఇది దాదాపు నూటపది ఏళ్ళనాటి చరిత్ర.

## "వందేమాతరం"

తరువాత 1904–5 సంవత్సరములలో "వందేమాతరం" నినాదంతో బెంగాలులో విప్లవచర్యలకు అరవిందఘోష్ మొదలైనవారు పూనుకున్నారు. ఆ సందర్భంగా ఆంధ్రదేశంలో కూడా, ఆ నినాదాలు, లేవదీసి బ్రిటీషవారి ఆగ్రహమునకు పాలైనవారిలో ముఖ్యులు ముట్నూరు కృష్ణారావుగారు, (కృష్ణాపత్రిక సంపాదకులు), బోడి నారాయణరావుగారు హరిసర్వోత్తమరావుగారు, గజవల్లి రామచంద్రరావు, ఉన్నవ భానుమూర్తిగారు, కాలేజీచదువులు వదిలేశారు. ఆ కాలంలోనే వీరంతా బెంగాలు నుండి వచ్చే 'యుగాంతర్' (జుగంతర్) అనే విప్లవపత్రికను ప్రచారంలోకి తీసుకువచ్చారు.

ఆంధ్రజిల్లాలలో అంటే కోస్తా, రాయలసీమ జిల్లాలలో తరువాత గాంధీగారి సహాయ నిరాకరణోద్యమం, తీవ్రరూపం దాల్చిన తరువాత "వందేమాతరం" అనటంలో అంత పట్టింపు లేకుండా పోయింది. కాని అదే నినాదం, హైదరాబాదు నిజాంపాలనక్రింద రాజద్రోహ చర్యగా పరిగణింపబడి ప్రస్తుత తెలంగాణా రాజకీయ నాయకులు విద్యార్థులుగా వున్న సమయంలో యీ సీమను విడిచి యితర రాష్ట్రాలలో తమ ఉన్నత విద్యను అభ్యసించవలసి వచ్చింది. అలా నినాదములు లేవదీసి తీవ్రచర్యకు తెలంగాణాలో గురిఅయిన వారిలో "వందేమాతరం రామచంద్రరావు" గారు ఒకరు. ఈ పేరును ఆనాటి, తదుపరి, రాజకీయ పరిస్థితులపై "వందేమాతరం" తరంనాటి ప్రభావాన్ని తెలుపటానికి మాత్రమే వుదహరించబడింది.

## దర్శి చెంచయ్య

మొదటి ప్రపంచసంగ్రామం జరుగుతున్న సమయంలో అమెరికాలో 'గదర్' పార్టీ ప్రాబల్యంలో జపానువారి 'కామగటమారు' అనే ఓడలో ఆయుధాలను తరలించి హిందూదేశంలో విప్లవం సాధించటానికి తీసుకువస్తోంటే రంగూనులో ఆ ధ్రువలైన, దర్శి చంచయ్య గార్ని పట్టుకుని బందీచేశారు. ఆరటపల్లి నారాయణరావుగారు మొదలైన రంగూను ఆంధ్ర నాయకులకుకూడా ఇందులో ముఖ్యమైన పాత్రవున్నది. తరువాత చెంచయ్యగారు సామ్యవాద పక్షంలో చాలాకాలం పనిచేసి, సంఘ సంస్కర్తలుగా పేరొంది, ఇటీవలనే మద్రాసులో మరణించారు. దర్శి చెంచయ్యగారు, వారి సతీమణి సుభద్రమ్మగారు చిరస్మరణీయులు

1914–15 నాటికి ఐర్లండులో జరిగిన హోమ్‌రూల్ వుద్యమానికి (Home Rule) ప్రతిధ్వనితో, అక్కడనుండి వచ్చిన డాక్టరు కజిన్స్, వారి సతీమణి ఆంధ్ర దేశంలో స్త్రీల హక్కుల గురించి, అప్పటి రాజకీయ ఖైదీల గురించి, చాలా ప్రచారంచేసి నూతన రాజకీయ సాంఘిక చైతన్యాన్ని కలుగజేశారు అప్పుడు

అనిబిసెంటు, తిలక్ మొదలైన వారి ప్రచారానికి గురిఅయి, భీమవరపు వాస్తవ్యులు, పశ్చిమగోదావరిజిల్లా నాయకులు, దండు నారాయణరాజుగారు, తమ న్యాయవాదవృత్తిని మానివేసి రాజకీయాలలో ప్రవేశించారు.

1919-20 నాటికి గాంధీగారి వుద్యమ ప్రభావం బాగావచ్చింది. అయినా మొదటిసారిగా గాంధీగారు విజయవాడ వచ్చినప్పుడు, వారికి స్టేషనులో స్వాగతం ఇచ్చింది అయిదారుగురు మాత్రమే అనటం ఆశ్చర్యకరం. ఆ రోజున గాంధీగారికి, శ్రీయుతులు డాక్టరు పట్టాభి సీతారామయ్య, కొండ వెంకటప్పయ్య, అయ్యగారి వెంకటరమణయ్య, బారిష్టరు వెంకటేశ్వరరావుగారు, డాక్టరు శృంగారకవి పాపారావుగార్లు మాత్రమే వున్నారు. అప్పుడు వాడు బారిష్టరు వెంకటేశ్వరరావుగారి యింటిలో బసచేశారు.

## త్రివిధ నిరాకరణోద్యమం

1921లో త్రివిధ నిరాకరణోద్యమం గాంధీగారు సాగించారు. విదేశీవస్త్ర బహిష్కరణ, కోర్టులు, విద్యాలయాలు బహిష్కరణలు, పన్నుల నిరాకరణ జరపాలని ఆదేశించారు. అప్పుడు బయటకు వచ్చిన వారిలో, ప్రకాశంపంతులుగారు, సాంబమూర్తిగారు కళా వెంకట్రావుగారు, డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు, మద్దూరి అన్నపూర్ణయ్యగారు ముఖ్యులు. అనేకమంది లాయర్లు, డాక్టర్లు ప్రాక్టీసు మానివేసి, ప్రజాబాహుళ్యంలో ఖద్దరు ధారణ, రాట్నం వడకటం ప్రారంభించారు. "నూలు వడికే విధము తెలియండీ" మొదలైన అనేక జాతీయగీతాలు ప్రచారంలోకి వచ్చినయి. పన్నులు ఇవ్వకూడదనే వుద్యమం గుజరాతులో జరిగినంత తీవ్రంగా గుంటూరు జిల్లా పల్నాడులో, కొండవెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగార్ల నాయకత్వంలో జరిగింది. అదే సమయంలో భీమవరంలో అంత కట్టుదిట్టంగాను పన్నుల నిరాకరణోద్యమం జరిపిన సందర్భంగా, అడివి బాపిరాజు, ముష్టి సుబ్రహ్మణ్యం, వేమూరి రామకృష్ణరావు (నేషనల్ కాలేజి ప్రిన్సిపాలుగా, బందరులో చేశారు) సత్యవాడ సోమేశ్వరరావు, అయ్యగారి లక్ష్మీనరశింహం, ఇతరులతోసహా మొత్తం ఏడు మందిని అరెస్టు చేశారు.

## అల్లూరి సీతారామరాజు

1923 కాకినాడ కాంగ్రెసు నాటికి రంపచోడవరం ఏజెన్సీలో శ్రీ అల్లూరి సీతారామరాజు తిరుగుబాటు తీవ్రంగా జరుగుతోంది. రహస్యంగా వచ్చి ఆయన కాంగ్రెసు నాయకులను కలుసుకు వెళ్ళారని వదంతి. వీరు పశ్చిమజిల్లా వాస్తవ్యులు. తరువాత బ్రిటీషు వారి గుండ్లకు గురిఅయి అమరజీవులయ్యారు. వీరితో మల్లుదొర మొదలయిన కోయదొరలు చాలామంది చాలాకాలం కారాగార గృహ శిక్ష అనుభవించారు

1925-26 లో జరిగిన నాగపూరు జెండా సత్యాగ్రహంలో చాలామంది ఆంధ్రులు పాల్గొన్నారు. అందులో ముఖ్యులు పశ్చిమ గోదావరిజిల్లా వాస్తవ్యులు, సత్తిరాజు రామమూర్తి, రెబ్బాప్రగడ మందేశ్వరశర్మ, ఈడూరి సత్యనారాయణ, నిడమర్తి ఉమామహేశ్వరరావుగార్లు. వీరంతా నాగపూరు జైలులో చాలా అగచాట్లు పడినారు. ఇంకా అప్పటికి త్రివర్ణ పతాకానికి, అర్థం చెప్పటంలో, ఎరుపురంగు హిందువులకు, పచ్చరంగు మహమ్మదీయులకు, తెలుపు ఇతరమతములకు అనే వర్ణింపబడేది. కాంగ్రెసు జండాను సృష్టించినది తెలుగువారే. నిరాకరణోద్యమం లేనప్పుడు, నిర్మాణ కార్యక్రమాలలో ఖద్దరు ధారణ హిందీ నేరుకోవటంలో ఆంధ్రులది ముందంజ అనే చెప్పాలి.

1927 లో దండు నారాయణరాజుగారు, బ్రిటీషువారు రూపాయికి మూడు అణాలు భూమిశిస్తు పెంచినప్పుడు, రాష్ట్రవ్యాప్తంగా "రిసెటిల్‌మెంటు" సమస్యమీద ఈ పన్నులను ప్రతిఘటిస్తూ పెద్ద ఉద్యమాన్ని నడిపారు. ఇంతలోకే గాంధీగారి సహాయ నిరాకరణోద్యమం వచ్చి మిగతా వుద్యమాలను వెనక్కి నెట్టింది.

## దండియాత్ర

1930 దండి యాత్రతో గాంధీగారు ఉప్పు సత్యాగ్రహం మొదలు పెట్టినప్పుడు లక్షలాది ఆంధ్రులు అందులో పాల్గొని, 1933 వరకు నడిపారు అప్పుడే మద్రాసులో శ్రీమతి దుర్గాబాయిగారు, స్త్రీలు ఎంత సాహసము చేయగలరో తమ నాయకత్వంలో ప్రదర్శించారు. ఇక ప్రకాశం పంతులుగారు, కాశీనాధుని నాగేశ్వరరావుగారు, పట్టాభి, సాంబమూర్తి ప్రభృతులగూర్చి వేరే చెప్పనక్కరలేదు 1930 లో ఏలూరులో కాల్పులు జరిగి ఒకరు మరణించారు. 31, 32, 33 నాటికి రౌండుటేబిలు సమావేశం గాంధీ ఇర్విన్ ఒడంబడిక మొదలయినవి రాజకీయ పరిణామాలకు తదుపరి ప్రశాంతతకు తోడ్పడినాయి.

1931-32 కరాచీ కాంగ్రెసునాటికి, భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవులను, గాంధీగారుకూడా చెప్పినా వినకుండా బ్రిటీషువారు వురితీశారు. వారి అనుయాయులు సహచరులు, చాలామంది ఆంధ్రలోని చెరసాలలో వుండి యువతరంవారిని దౌర్జన్యపూరితమయిన విప్లవమార్గం త్రొక్కవలెనని ప్రోత్సాహించేశారు. అప్పుడు జైళ్ళలో నున్న విప్లవవాదులు, విజయకుమార్‌సిన్హా, శివవర్మ, జయదేవ్ కపూర్, కమలనాథ్ తివారీ, కుందన్‌లాల్, బట్టుకేశ్వరదత్తు డాక్టర్ గయాప్రసాద్, మహావీర్‌సింగ్ మొదలయినవారు. మద్రాసు రాష్ట్రంలోవున్న అన్ని జైళ్ళలోను వారిని విడదీసి వుంచారు. అందుచేత ఏజైలులు వెళ్ళినా, యువకులందరికీ వారివుద్బోధవుండేది. వారి తీవ్రవాదదృక్పథం, కాకినాడ బాంబుకేసు, మద్రాసు కుట్ర కేసు యువతరం వారిని పురికొల్పాయి. కాకినాడ బాంబుకేసుకు ముఖ్యులు శ్రీ ప్రతివాద భయంకర వెంకటాచారిగారు. మద్రాసు కుట్రకేసులో ముఖ్యులు, రామానంద చౌదరీ, భూపతిరాజు బాపిరాజు, చుండి జగన్నాధం, దువ్వూరి రామిరెడ్డి మొత్తం ఇరవయిమంది వీరితో ముకుందలాల్ సర్కారీకూడా వున్నారు. వీరందరికీ ఒకటి మొదలు నాలుగు సంవత్సరాలవరకు శిక్షవిధించారు. 9 నెలలు రిమాండులో వుండి విచారించబడారు. కాకినాడ బాంబు కేసులో శ్రీ భయంకరాచారికి ద్వీపాంతర వాస శిక్ష వేశారు. క్రమక్రమంగా యువతరం వారంతా కాంగ్రెసులో వుండకుండా, తీవ్రవాదులైన కమ్యూనిస్టులుగాను, కాంగ్రెసులో వుండి జయప్రకాష్‌నారాయణ్

మొదలైన సోషలిస్టుల సిద్ధాంతాలలోకి ఆకర్షించ బడ్డారు. మొదటి ప్రపంచ యుద్ధంలో పనిచేసి రష్యా వెళ్లి 'లెనిన్' సైన్యాలతో పనిచేసి వచ్చిన వారిలో ఏకైక ఆంధ్రులు శ్రీ అన్నాప్రగడ కామేశ్వరరావుగారు గుంటూరు వాస్తవ్యులు.

## "ఆంధ్రా సర్క్యులర్"

1940 వరకు హరిజన వుద్యమంలోను తదితర నిర్మాణాత్మక కార్యక్రమాలలోను ఆంధ్రులు ఎవరికీ తీసిపోలేదు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలోను, 1942 వుద్యమంలోను ఆంధ్రులు ముందంజ వేశారు. 1942 వుద్యమానికి ప్రాతిపదిక అయినఆంధ్రా సర్క్యులర్ పంపిన ఖ్యాతి శ్రీ కళా వెంకటరావుగారికి దక్కింది. 1942 ఆగస్టు వుద్యమంలో వేలాది విద్యార్థులు యువకులు, పెద్దలు పాల్గొని జాతి విముక్తికి తోడ్పడినారు. ఆగస్టు 16 వ తేదీన దేశవ్యాప్తంగా ప్రతి సంవత్సరం భారత జాతి జరుపుకునే స్వాతంత్ర్యోత్సవంలో ఆంధ్రులు తమ పాత్రను సగర్వంగా మననం చేసుకొంటూ పాల్గొన వచ్చు

---

# తెలంగాణలో స్వాతంత్ర్యోద్యమం

( 10 వ పేజీ తరువాయి )

పని చేయసాగినవి ప్రతి రాజకీయ పక్షం కూడ గ్రంథాలయాల్లో తమసాహిత్యాన్ని పెట్టడానికి ప్రయత్నం చేసింది. పాఠకులు ఆసక్తితో రాజకీయ గ్రంథాలు చదువజొచ్చారు. 1942 లో కమ్యూనిస్టు పార్టీ రెండవ ప్రపంచ యుద్ధాన్ని ప్రజాయుద్ధమని నిర్వచించి దానికను గుణ్యంగా కార్యక్రమాన్ని సృష్టించింది. ఈ పార్టీకూడా గ్రంథాలయ ఉద్యమాన్ని ప్రధాన కార్యక్రమంగాకాకపోయినా. ఒక ముఖ్య కార్య క్రమంగానే రూపొందించింది. పూర్వంనుండి ఆంధ్రోద్యమానికి పట్టుకొమ్మగావున్న పెద్దలు మితవాదులని వ్యవహరింప బడసాగారు. కమ్యూనిస్టుపార్టీతో ఏకీభవించక కాంగ్రెస్‌లోని తీవ్రవాదులు ఆంధ్ర జాతీయ పక్షమనే పార్టీని నెలకొల్పుకున్నారు. ఈ మూడు పార్టీల సంఘర్షణలలో ప్రజలలో ఎంతోరాజకీయ చైతన్యం కలిగింది. ఎంతో నూతన సాహిత్యం ముఖ్యంగా రాజకీయ సాహిత్యం గ్రంథాలయాల నలంకరించింది ప్రభుత్వము నిషేధించినా లెక్కచేయక గ్రంథాలయ వార్షికోత్సవాలు జరుపుకోసాగారు. ప్రభుత్వము నిర్బంధిస్తే జైలుకు పోయిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. ఈ విధంగా గ్రంథాలయోద్యమం ప్రజల ప్రాథమిక హక్కు రక్షణకు ప్రత్యక్షంగాను, రాజకీయ ఉద్యమానికి పరోక్షంగాను సహాయం చేసింది.

## 'విశాలాంధ్ర' నినాదం

1944 లో మొదటిసారిగా యావదాంధ్ర దేశంలోని గ్రంథాలయాలు ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభఆధ్వర్యంలోతెలంగాణాలోని సింగరేణి కాలరీస్‌లో 25 వ ఆంధ్ర మహాసభను జరుపుకొన్నవి. పూర్తిగా ప్రభుత్వ శాసనానికి విరుద్ధంగా జరిగినవి. దీనికి సర్కారు, రాయలసీమ, తెలంగాణాల నుండి ప్రతినిధులు వచ్చారు. అన్ని రాజకీయ పక్షాల నాయకులు పాల్గొన్నారు. ఇక్కడనే మొదటిసారిగా "విశాలాంధ్ర" నినాదం ఇవ్వడం జరిగింది. కీ. శే. బూర్గుల రామకృష్ణారావుగారు అధ్యక్షత వహించారు. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ప్రారంభించారు. ఆంధ్ర గ్రంథాలయ సభ తెలంగాణా కార్యాలయాన్ని ఖమ్మంలో పెట్టడం జరిగింది తెలంగాణా పక్షాన ఈ రచయిత సహాయ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. గ్రంథాలయాల ఇబ్బందులను విచారించి తోడ్పడేందుకు ఖమ్మంలో శ్రీ కామరాజు సత్యనారాయణరావు పూనుకొన్నారు. పెద్ద ఎత్తున గ్రంథాలయోద్యమం వెల్లువగా ఉబికింది అనేక వార్షికోత్సవాలు జరగడమేగాకుండా విశాలాంధ్ర భావానికు అనుగుణ్యంగా కార్యక్రమాలు ఏర్పాటు చేయడం మొదలెట్టారు రాజకీయోద్యమం కూడా పక్క పక్కనే విజృంభించసాగింది. ఈ రెండు రంగాల్లోను కృషి పరస్పరావలంబనతో ప్రగతి పథంలో నడువసాగింది 1946 లో ఆలంపూరు వద్ద గల క్యాతూరులో కీ శే. సురవరం ప్రతాపరెడ్డిగారి పూనికపైని గడియారం రామకృష్ణశర్మగారి కృషితో 26 వ ఆంధ్ర మహాసభ జరిగింది. దీనికిగూడ ఆంధ్ర దేశంలోని పలుప్రాంతాల నుండి నాయకులు, కార్యకర్తలు విచ్చేశారు. కీ. శే. రాజా వెంకట్రామారెడ్డిగారు అధ్యక్షత వహించారు. ఆంధ్ర పితామహులు ప్రారంభకులు. ఈ మహాసభ జరిగిన కొద్ది కాలానికే రాజకీయ ఆందోళన ఉవ్వెత్తుగా లేచింది. గ్రంథాలయ కార్యకర్తలు ఆ మహాయజ్ఞములో తమను తాము సమిధలుగా అర్పణ చేసికొన్నారు ప్రజాఉద్యమం ఎట్టకేలకు గెలిచింది. తర్వాతకూడా 27 వ మహాసభ సూర్యాపేటలో జరిగింది ఈమహాసభలోనే భావనా మాత్రంగా వున్న విశాలాంధ్రకు స్థూలమైన రూపకల్పన జరిగింది. విశాలాంధ్ర మహాసభ స్థాపన దీని పర్యవసానమే. 29 వ ఆంధ్ర మహాసభ జనగాంలో జరిగే నాటికి జిల్లాకలెక్టరుగా ఉన్న శ్రీ పప్పు వెంకటేశ్వరరావు గారు తమ స్వాగతోపన్యాసములో విశాలాంధ్ర త్వరలో ఏర్పడగలదని తమ ఆశాభావాన్ని స్పష్టంగా వెలిబుచ్చారు. విశాలాంధ్రకు కృషి తీవ్రతరమైంది. అనేక అవరోధాలను ఎదుర్కొన్నప్పటికీ 30 వ మహాసభ ఖమ్మంలో జరిగేనాటికే విశాలాంధ్ర అవతరణ జరగనే జరిగింది.

ఈ విధంగా నిజాం ప్రభుత్వనిరంకుశ పరిపాలన నుండి తెలంగాణాను విడిపించి ప్రజాస్వామ్య వ్యవస్థ నెలకొల్పుటతో పాటు విశాలాంధ్ర స్థాపన వరకు విశ్రమించకుండా దీక్షతో గ్రంథాలయోద్యమ కృషి కొనసాగింది

# మన శాసన సభ పనిచేసే తీరు

శ్రీ వి. సుబ్బరామ శర్మ



( గత సంచిక తరువాయి )

శాసన సభల ముఖ్య కార్యక్రమాల్లో రెండోది ఆర్థిక కార్యక్రమం. రాష్ట్ర ప్రభుత్వం చేసే ఖర్చు అంతా శాసన సభచేత ఆమోదింపబడాలి. ప్రభుత్వ నిధులమీద శాసన సభకే అధికారం వున్నది. ప్రతి సంవత్సరం కార్యనిర్వాహక ప్రభుత్వం గ్రాంట్ల కోసం వివిధ డిమాండ్లను శాసన సభకు సమర్పిస్తుంది. డిమాండ్ల పైన ఓటు చేయటంద్వారా శాసన సభ ఆ అధికారాన్ని వినియోగిస్తుంది. రాజ్యాంగం ప్రకారం ప్రతి ఆర్థిక సంవత్సరానికి సంబంధించి అంచనా వేయబడ్డ రాష్ట్ర ఆదాయ వ్యయాల వివరణను శాసన మండలికి సమర్పించాలి. రాజ్యాంగంలో సాలీనా ఆర్థిక వివరణగా పేర్కొన్నదానిని మనం బడ్జెట్ అంటున్నాం.

## ఆర్థిక కార్యక్రమం

ఫిబ్రవరి ఆఖరులోను, మార్చి నెల ప్రారంభమున రాబోయే సంవత్సరానికి చెందిన బడ్జెటును రాష్ట్ర ఆర్థికమంత్రి శాసన సభలో ప్రవేశపెట్టటంద్వారా ఆర్థిక కార్యక్రమం ప్రారంభమవుతుంది. ప్రభుత్వం ఏ ఏ పన్నులు వేయదలచింది. ఎంత అప్పులు చేయ తలపెట్టింది, వర్తక వ్యాపారాలు మొదలైన వాటినుండి ఎంత ఆదాయం సంపాదించాలనుకున్నది. ఏ ఏ పద్దులపైన ఎంత మొత్తం ఖర్చు పెట్టదలచింది, ఈ బడ్జెటులో వివరంగా వుంటుంది. ఇది శాసన సభలో ప్రవేశపెట్టినప్పుడు ఆర్థికమంత్రి ఆదాయవ్యయాలకు సంబంధించిన ప్రభుత్వ కార్యక్రమాలను వివరిస్తూ, సమర్థిస్తూ పెద్ద ఉపన్యాసం చేస్తారు. దాదాపు అదే సమయంలో శాసన పరిషత్తులో కూడా ఆ ఉపన్యాస పాఠాన్ని ఆర్థిక మంత్రి బదులు ఆ సభానాయకుడు చదువుతాడు. ప్రచురించిన బడ్జెటు ప్రసంగం ప్రతులు ఉభయ సభల్లో సభ్యులకు ఆ సమయంలో అందజేస్తారు.

సాధారణంగా బడ్జెటు ప్రవేశ పెట్టిన రోజున ప్రతి శాసన సభ్యుని చేతిలో పెద్ద పెద్ద పుస్తకాలదొంతర్లు చూస్తుంటాం. ఇవి బడ్జెటు ప్రచురణలు. వీటిని సభ్యులకు ప్రతి సభకు సంబంధించిన నోటీసు ఆఫీసుద్వారా ఆ రోజున ఇయ్యటం జరుగుతుంది. బడ్జెటు ప్రచురణల్లో ప్రధానంగా ఈ పుస్తకాలు వుంటాయి:— (1) బడ్జెటు అంచనాలు—ఇందులో ఆర్థిక వివరణ సంగ్రహం, రెవిన్యూ బడ్జెటు అంచనాల వివరాలు, గ్రాంటులకు డిమాండ్లు, బడ్జెటు అంచనాల వివరాలు; (2) బడ్జెటు అంచనాలకు అనుబంధాలు: (3) సవివరమైన పబ్లికు వర్క్సు బడ్జెటు; (4) సవివరమైన నీటి పారుదల బడ్జెటు; (5) ప్రభుత్వ వాణిజ్య సంస్థలు—సవివరమైన బడ్జెటు అంచనాలకు అనుబంధం; (6) బడ్జెటు అంచనాలలో చేరి వున్న కేంద్ర ప్రతిపాదిత పథకాలతో సహా పంచవర్ష ప్రణాళికలోని పథకాల వివరాలు; (7) గ్రాంట్లకు డిమాండు నోటీసు: (8) బడ్జెటు మెమోరాండం, బడ్జెటు పత్రాల్లో వుండే సంఖ్యా వివరాలలో గత సంవత్సరం లెక్కలు, శాసన మండలికి మొట్ట మొదట సమర్పించిన ప్రస్తుత సంవత్సరం బడ్జెటు అంచనాలు. ప్రస్తుత సంవత్సరానికి సవరించిన అంచనాలు రానున్న సంవత్సరానికి బడ్జెటు అంచనాలు వుంటాయి.

బడ్జెటును సభకు సమర్పించిన రోజున దాని పైన చర్చ ఉండదు. ఆ రోజు నుంచి బడ్జెటుపైన సాధారణ చర్చ ఆరంభించటానికి మధ్య రెండు రోజుల వ్యవధి వుంటుంది. బడ్జెటు ప్రచురణలు సభ్యులు పూర్తిగా చదువుకోటానికి దీనివల్ల అవకాశం కలుగుతుంది. బడ్జెటుపైన సాధారణ చర్చకు సాధారణంగా ఆరు రోజులు, గ్రాంటుల అభ్యర్థనపైన ఓటింగుకు 22 రోజులు కేటాయించ బడుతాయి.

సాధారణ చర్చలో సభ్యులు బడ్జెటు స్థూలస్వరూపాన్ని చర్చిస్తారు. ఆ చర్చ ఒక శాఖనుగాని, ఒక అంశానికిగాని పరిమితమై వుండవలసిన అవసరం లేదు. మంత్రుల పరిపాలనా విధానం, వారు అనుసరించే కార్యక్రమాలు, వాటిలో గుణ దోషాలు చర్చించటం జరుగుతుంది. పరిపాలనా వ్యవస్థ పైన తమ అభిప్రాయాలు, విమర్శలు స్వేచ్ఛగా వెలిబుచ్చేందుకు సభ్యులకు ఇది మంచి అవకాశాన్నిస్తుంది. ఈ చర్చానంతరం ఆర్థిక మంత్రి ఉభయ సభల్లోనూ సమాధానం యిస్తూ ప్రసంగిస్తారు.

బడ్జెటుపైన సాధారణ చర్చ ముగిసిన తరువాత ఘట్టంలో ఒక్కొక్క మంత్రి తన అధీనంలో వుండే శాఖకు సంబంధించిన ప్రత్యేక చర్చలు జరుగుతాయి. తన పరిపాలనలో వుండే ఫలానా శాఖకు (ఉదాహరణకు పరిశ్రమల శాఖ, వ్యవసాయ శాఖ) రాబోయే సంవత్సరంలో ఇంత మొత్తం ద్రవ్యం కావాలనే మంత్రి ప్రతిపాదనతో (Demand for grant) చర్చ ప్రారంభమవుతుంది. ఏ యే శాఖకు చెందిన డిమాండుపైన చర్చ ఏ రోజుల్లో జరగాలో ముందే నిర్ణయించబడుతుంది. ఈ ప్రతిపాదనలను విమర్శించ దలచిన సభ్యులు కోత సవరణలను ప్రతిపాదించి తమ అభిప్రాయాలు చెబుతారు. ఈ సందర్భంలో ఒక విశేషం గుర్తించాలి.

మంత్రులు పెట్టదలచిన ఖర్చు మొత్తాన్ని తగ్గించాలనే సవరణ ప్రతిపాదన చేయటానికి సభ్యులకు హక్కు వున్నది. కాని దానిని పెంచాలని ప్రతిపాదించే హక్కు వారికి లేదు. కోత ప్రతిపాదన పైన ఓటింగు జరుగుతుంది. ఓటింగులో ఇవి వీగిపోతయ్యి. సభ్యులు ఆ యా శాఖల పరిపాలన గురించి తమ అభిప్రాయాలను చెప్పటానికి మాత్రమే ఈ కోత ప్రతి పాదనలు పనికి వస్తున్నయ్యి తరువాత ప్రతి డిమాండుకు ఓటింగు జరిగి శాసన సభ ఆమోదం లభిస్తుంది.

వార్షిక బడ్జెటులో ఛార్జి చేసిన ఖర్చును ఓటు చేసిన ఖర్చును భరించేందుకు ఆర్థిక సంవత్సరంలో అవసరమయ్యే మొత్తాలు విడి విడిగా పేర్కొన బడుతాయి. శాసన సభ ఆమోదం లేకుండా ఏ ఖర్చూ చేయరాదనే సూత్రానికి కొన్ని మినహాయింపు లున్నాయి. ఖర్చు తాలూకు కొన్ని అంశాలు రాష్ట్రనిధుల పైన ప్రథమ చార్జిగా ఏర్పడి 'ఛార్జి చేసిన' ఖర్చుగా పేర్కొన బడతాయి. గవర్నరు, స్పీకరు, డిప్యూటీ స్పీకరు, ఛైర్మెన్, డిప్యూటీ ఛైర్మెన్, హైకోర్టు న్యాయమూర్తులు, పబ్లిక్ సర్వీసు కమిషను సభ్యులు మొదలైన అధికారుల జీతాలు, అప్పులపైన వడ్డీ చెల్లించేందుకు వాటిని తిరిగి చెల్లించుటకు అవసరమైనమొత్తాలు, న్యాయస్థానంలో ప్రభుత్వంపైన డిక్రీయివ్వ బడిన మొత్తాలు ఛార్జి చేసిన ఖర్చుకు ఉదాహరణలు ఈ చార్జి చేసిన ఖర్చుకు సంబంధించిన అంశాలను శాసన సభ చర్చించ వచ్చు కాని రాజ్యాంగం ప్రకారం వాటిపైన ఓటు చేయటానికి వీలు లేదు.

శాసన సభ డిమాండ్లను ఆమోదించిన తరువాత ఆ సభ ఓటు చేసిన గ్రాంట్లను భరించటానికి అవసరమయ్యే మొత్తాలను రాష్ట్ర నిధులనుండి తీసుకునేందుకు కార్యనిర్వాహక ప్రభుత్వానికి అధికారమీయాలి. అందుకుగాను ద్రవ్య వినియోగపు బిల్లు (Appropriation Bill) శాసనమండలికి సమర్పించ బడుతుంది. ఆ బిల్లు శాసనమండలి ఆమోదం పొంది గవర్నరు ఆమోదం పొందిన తరువాత అది ద్రవ్య వినియోగ చట్టం అవుతుంది. ఈ చట్టం వలన రాష్ట్ర నిధుల నుండి పైకం తీసుకొనటానికి, శాసన మండలి ఆమోదాన్ని అనుసరించి అట్టి పైకాన్ని ఖర్చు పెట్టటానికి రాష్ట్ర ప్రభుత్వానికి అధికారం లభిస్తుంది.

మార్చి నెలలో శాసన సభ ఆమోదించిన బడ్జెటు పద్దులకంటే ఎక్కువ ఖర్చు అవసరాన్ని బట్టి విడిగాచేయవలసి వస్తూ టుంది. అంతే కాక కొన్ని కొత్త అంశాల పైన ఖర్చు చేయవలసి వస్తుంది. ఆ విధంగా ప్రభుత్వం చేసిన ఖర్చులను అనుబంధ గ్రాంటుల కొరకు, అదనపు గ్రాంటుల కొరకు అభ్యర్థనలను తరువాత జరిగే శాసనసభా సమావేశాలలో ప్రవేశ పెట్టి వాటికే ఆమోదం పొందటం జరుగుతుంది.

ఆర్థిక కార్యక్రమం విషయంలో శాసన పరిషత్తుకు శాసన సభకున్న అధికారాలు లేవు. పరిషత్తులో బడ్జెటుపైన సాధారణ చర్చ మాత్రమే జరుగుతుంది. గ్రాంట్లకు అభ్యర్థనలు ఎగువ సభలో ప్రవేశ పెట్టటం వుండదు. ఆర్థిక బిల్లులు ఎగువ సభలో ప్రవేశ పెట్టరాదు. ఆ బిల్లులు ఎగువ సభ ఆమోదం లేక పోయినా చట్టాలవుతయ్యి.

కార్యనిర్వాహక ప్రభుత్వం ప్రజల శ్రేయస్సు దృష్టిలో వుంచుకుని ప్రభుత్వకార్యాలను నిర్వహించాలి. అందుకు విరుద్ధంగా జరుగుతున్నప్పుడు గాని, పరిపాలనా యంత్రాగములో లోపాలు వున్నప్పుడుగాని వాటిని ప్రభుత్వ దృష్టికి తీసుకరావడానికి అవసరమైన హెచ్చరికలు చేయటానికి శాసన సభ్యులు అనేక సాధనాలు ఉపయోగిస్తారు. ఇంతకుముందు వివరించిన ప్రశ్నోత్తరాలు, అరగంట చర్చ, కాలింగటెన్షను నోటీసులు, వాయిదా ప్రతిపాదనలు అటువంటి ముఖ్య సాధనాలే అట్లాగే అత్యవసర విషయాల పైన సంగ్రహ చర్చ మరొక సాధనం. ఇది సభాపతి అనుమతితో ఒక రోజున రెండు గంటల కాలం జరుగవచ్చు. ప్రతి సమావేశంలోను ఉభయ సభల్లో ఈరకం సంగ్రహ చర్చలు జరుగుతుంటాయి.

## పరిపాలనపైన పర్యవేక్షణ

అదేవిధంగా ప్రతి సమావేశంలోను ప్రైవేటు సభ్యుల కార్య క్రమం జరిగేందుకు వీలున్నంత వరకు శాసన సభలో ప్రతి శుక్ర వారమునాడు, శాసన పరిషత్తులో ఏడు రోజుల కొకసారి కేటాయించటం జరుగుతుంది. ఆ రోజుల్లో ప్రైవేటు సభ్యులు ప్రవేశపెట్టే బిల్లులు, తీర్మానాల సందర్భంగా జరిగే చర్చల్లో ప్రభుత్వ పరిపాలన పైన సభ్యులు తమతమ అభిప్రాయాలు వెల్లడిస్తారు. అప్పుడు వారు చేసే సూచనలు, విమర్శలు ప్రభుత్వానికి ఉపయోగకరంగా వుంటాయి.

ఈ మధ్య అధిక ప్రాముఖ్యం పొందుతున్న అంశం ఇంకొకటివున్నది. ఇది శాసనసభ నియమావళి ప్రకారం 341 నియమాన్ని అనుసరించి ప్రతిదినం సమావేశారంభానికి కనీసం అరగంట ముందుగా సభాపతి అనుమతి తీసుకుని ఏ అత్యవసర విషయమైనా సభలో ఉత్పన్నంచేయటం. ఈ నియమం క్రింద సభలో రోజూ లేవదీసే అంశాల సంఖ్య అంతకంతకు ఎక్కువవుతున్నది. ప్రశ్నోత్తరాల సమయం తర్వాత జరిగే ఈ ఘట్టంలో సభ్యులు అనేక విషయాలు ఉత్పన్నంచేసి ప్రభుత్వంనించి ఎంతో సమాచారాన్ని రాబట్ట కలుగుతున్నారు. ఈరకం నియమం శాసన పరిషత్తు నియమావళిలో లేదు

పరిపాలన పైన పర్యవేక్షణలో సభ్యులు ఉపయోగించే తీవ్రమైన సాధనం మంత్రి మండలిపైన విశ్వాసరాహిత్యాన్ని ప్రకటించే ప్రతిపాదన చేయటం ఇది అరుదుగా జరుగుతుంది శాసన సభలోనే ఇట్టి ప్రతిపాదన చేయటానికి అవకాశం వుంది శాసన పరిషత్తు నియమావళిలో ఈ నియమం లేదు. అయితే పాక్షికంగా తత్సమానమైనదిగా పరిగణించటానికి వీలయ్యే నియమం ఒకటి శాసన పరిషత్తు నియమావళిలో వున్నది. అది 71 నియమం ప్రకారం మంత్రివర్గం ఒక నిర్దిష్టమైన విషయంలో అవలంబించే విధానం ఆమోద యోగ్యంగా లేదని సభ్యులు ప్రతిపాదన చేయటం. ఈ రకం ప్రతిపాదనలు కూడా చాలా అరుదుగా వుంటాయి

ఉభయ శాసన సభలకు పరిపాలనా పర్యవేక్షణ ఎంతో సహాయాన్ని అందజేసేవి ఒక సభనుండి గాని ఉభయ సభలనుండి ఏర్పడి పనిచేసే కమిటీలు వీటిని గురించి సంగ్రహంగా తెలుసుకుందాం.

కాలానుగుణంగా పరిణతి చెందుతున్న ప్రజాస్వామ్య వ్యవస్థలో శాసన సభలు చేయాల్సిన పనులు, నిర్వహించవలసిన బాధ్యతలు అంతకంతకు అధికమవుతున్నాయి. వాటిని గురించి పూర్తిగా ఆలోచించటానికి గాని దానిపై సరియైన నిర్ణయాలు తీసుకొనడానికి గాని తగినంత కాలవ్యవధి శాసన సభలకు లభించటంలేదు. శాసన నిర్మాణం, ఆర్థిక కార్యక్రమం వంటి ముఖ్యమైన పనులకే చాలవరకు సభా సమావేశాల కాలం వినియోగించటానికి వీలౌతున్నది. శాసన సభలు రూపొందించిన అనేక విధానాలు ఆచరణలో ఏ విధంగా అమలుజరుగుతున్నాయి, వాటి ప్రగతి ఏమిటి, మార్పులు చేర్పులు అవసరమా – ఇట్లాఅన్నికోణాల నుంచి పరిశీలనచేసి పరిపాలనా వ్యవస్థను పటిష్టం చేయటానికి శాసన సభల కమిటీలు గణనీయమైన కృషి చేస్తున్నాయి.

## శాసన సభల కమిటీలు

శాసన సభ్యులలో కొంతమందితో కూడిన చిన్న ఉపసంఘాన్ని కమిటీ అంటారు. ప్రతి కమిటీలోను కొంతమందే సభ్యులుగా వుండటంవలన సులభంగా సమావేశం కావచ్చు. సాధారణంగా ఈ కమిటీలలో వుండే సభ్యులు ఆయా కమిటీలలో పరిశీలించాల్సిన విషయాల గురించి తగినంత ఆసక్తి, పరిజ్ఞానం, అనుభవం కలవారుగా వుంటారు. కమిటీలలో చర్చలు ఇష్టాగోష్టి చర్చలుగా రహస్యంగా జరిగేవి కనుక సభ్యులు నిస్సంకోచంగా స్వేచ్ఛగా తమ అభిప్రాయాలను చెప్పటానికి వీలున్నది. ప్రతి కమిటీలోను వివిధ పక్షాలకు చెందినవారు సభ్యులుగా వున్నప్పటికీ ఇట్లా చర్చలు జరగటం వలన సామరస్యధోరణిలో సులభంగా నిర్ణయాలు తీసుకోటానికి వీలవుతుంది. ప్రతి పక్షాలకు చెందిన సభ్యులు చేసే సూచనలను ఎక్కువ సౌహార్దంతో అధికార పక్షాలవారు గ్రహించటానికి కమిటీలలో అవకాశాలు అధికంగా వున్నాయి. ప్రతి కమిటీ అది చర్చించిన విషయాలను గురించిన నివేదికను తమ సలహాలతోపాటు సభకు నివేదిస్తుంది.

ప్రస్తుతం మన శాసన సభలకు అనుబంధాలుగా వున్న ప్రధాన కమిటీలు పది. వీటిలో ప్రభుత్వ లెక్కలకమిటీ (public accounts committee), అంచనాల కమిటీ (estimates committee ), ప్రభుత్వ సంస్థల కమిటీ (public undertakings committee). అనుగత శాసన నిర్మాణాలకమిటీ (subordinate legislation committee) వంటి శాసన సభ కమిటీలకు సభ్యులను ఉభయసభలూ ఎన్నుకుంటై. ఈ ఎన్నికలు సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ ఓటు ద్వారా దామాషా ప్రాతినిధ్య సూత్రాన్ని అనుసరించి వుంటాయి. కొన్ని కమిటీలకు సభాపతులు సభ్యులను నామినేటు చేస్తారు. అట్లా ఏర్పాటైన కమిటీల సభ్యుల నుండి ఫలానివారు ఆయా కమిటీలకు అధ్యక్షులుగా వుండాలని సభాపతులు నియమిస్తారు.

ఈ కమిటీలలో మొదటగా పేర్కొన వలసినది కార్యక్రమ సలహా కమిటీ (business advisory committee). ఉభయ సభలకు వేరువేరుగా ఈ కమిటీలున్నాయి. శాసన సభకు అనుబంధంగా వుండే ఈ కమిటీలో సభాపతి, సభానాయకునితో కలిపి పదకొండు మందికి మించకుండా సభ్యులను సభాపతి నామినేటు చేస్తారు. సభాపతే ఈ కమిటీకి అధ్యక్షుడు. అట్లాగే శాసన పరిషత్తుకు అనుబంధంగా వుండే కమిటీలో ఛైర్మను, ఆ సభా నాయకునితో కలిపి ఎనిమిది మందికి మించకుండా సభ్యులను ఛైర్మను నామినేటు చేస్తారు. ఛైర్మను ఆ కమిటీకి అధ్యక్షుడుగా వుంటారు. ఉభయసభల కమిటీలు సభాసమావేశాల కార్యక్రమాన్ని రూపొందించటం, చిత్తు శాసనాలను వివిధ దశలలో చర్చనిమిత్తం కేటాయించాల్సిన సమయాన్ని, కమిటీల అభిప్రాయార్థం పంపిన యితర అంశాలను చర్చించటానికి కేటాయించ వలసిన సమయాన్ని సిఫార్సు చేయటం ప్రధాన విధులుగా కలిగివున్నాయి.

రెండవది అర్జీల కమిటీ (petitions committee) ఉభయ సభలకు అనుబంధాలుగా వేర్వేరు కమిటీలున్నాయి. శాసన సభ కమిటీలో డిప్యూటీ స్పీకరుతో కలుపుకుని అయిదుగురికి తక్కువకాని సభ్యులను స్పీకరు నామినేటు చేస్తారు. దీనికి అధ్యక్షులు డిప్యూటీ స్పీకరు. అట్లాగే శాసన పరిషత్తు కమిటీలో డిప్యూటీ ఛైర్మనును కలుపుకుని అయిదుగురికి తక్కువకాని సభ్యులను ఛైర్మను నామినేటు చేస్తారు. దీనికి అధ్యక్షులు డిప్యూటీ ఛైర్మను. ఆయా సభలకు సమర్పించిన అర్జీలు పరిశీలించి అవసరమని భావించినప్పుడు ప్రభుత్వానికి సిఫారసు చెయ్యటం ఈ కమిటీల విధులు.

మూడవది ప్రభుత్వ లెక్కల కమిటీ (public accounts committee). ఈ కమిటీలో 20 మంది సభ్యులుంటారు. అందులో 15 మంది శాసన సభ నుండి 5 గురు శాసన మండలినుండి ఎన్నుకొన బడుతారు. ఈ కమిటీ పదవీకాలం ఒక సంవత్సరం. కమిటీ సభ్యులనుండి ఒకరిని కమిటీకి అధ్యక్షులుగా స్పీకరు నామినేటు చేస్తారు. శాసన సభలో ప్రతిపక్ష నాయకులు ఈ కమిటీకి అధ్యక్షుడుగా వుండటం సాధారణంగా వున్న ఆచారం. ప్రభుత్వం వివిధ శాఖలకు ఖర్చుపెట్టే ద్రవ్యం శాసన మండలి ఆమోదించిన బడ్జెటు ప్రతిపాదనలకు అనుగుణంగా వున్నదీ లేనిదీ పరిశీలించి తగిన సిఫార్సులు చేయటం ఈ కమిటీ పని. ఇది చాలా ప్రధానమైన కమిటీ.

నాల్గవది అంచనాలకమిటీ (Estimates committee) ఈ కమిటీలో కూడా 20 మంది సభ్యులుంటారు–15 మంది శాసన సభ నుండి, 5 గురు శాసన పరిషత్తు నుండి ఎన్నుకోబడతారు. కమిటీ సభ్యుల నుండి ఒకరిని కమిటీ అధ్యక్షులుగా స్పీకరు నామినేటు చేస్తారు. ఈ కమిటీ పదవీకాలం ఒక ఆర్థిక సంవత్సరం. ఆర్థికమంత్రి ప్రతి సంవత్సరం సమర్పించే బడ్జెటు పద్దులను పరిశీలించి, ఖర్చులను తగ్గించడానికి, పరిపాలనా శాఖలు ఎక్కువ పటిష్టంగా పని చేయటానికి సూచనలు చేయటం దీని పని. ఇది కూడా చాలా ముఖ్యమైన కమిటీ.

అయిదవది ప్రభుత్వ సంస్థల కమిటీ (Public undertakings committee). ఈ కమిటీలో 16 మంది సభ్యులుంటారు. వీరిలో 12 మందిని శాసన సభనుండి, నలుగురిని శాసన పరిషత్తు నుండి ఎన్నుకుంటారు. కమిటీ సభ్యులనుండి ఒకరిని కమిటీ అధ్యక్షులుగా స్పీకరు నామినేటు చేస్తారు. ఈ కమిటీ సభ్యుల పదవీకాలం ఒక సంవత్సరం. శాసన సభ నియమావళిలో పేర్కొన్న

ప్రభుత్వ సంస్థల నివేదికలు, లెక్కలు పరిశీలించటం, సక్రమ వ్యాపార సూత్రాల ప్రకారం అవి నిర్వహింపబడు తున్నవా లేదా అని విచారించటం, మొదలైన విధులు ఈకమిటీకి వున్నయ్యి. ఈ కమిటీ కూడ ప్రధానమైనదే.

ఆరవది అనుగత చట్ట నిర్మాణ కమిటీ (Subordinate legislation committee). ఈకమిటీలో 16 మంది సభ్యులుంటారు. వీరిలో 12 మందిని శాసన సభనుండి, నలుగురుని శాసన పరిషత్తు నుండి ఎన్నుకుంటారు. స్పీకర్లు కమిటీ సభ్యులనుండి ఒకరిని కమిటీ అధ్యక్షులుగా నామినేటుచేస్తారు. ఈ కమిటీ సభ్యుల పదవీ కాలం ఒక సంవత్సరం. శాసనాలు చేసే అధికారం శాసన మండలికి వున్నది. అయితే ఒక్కొక్కప్పుడు ఆయా పరిపాలనా శాఖలకు సంబంధించిన ఉప శాసనాలను, నిబంధనాలను ప్రభుత్వం చేయవచ్చు. అట్లా చేసే ఉపశాసనాలు, నిబంధనలు మాతృక శాసనాలకు అనుగుణంగా వున్నదీ లేనిదీ పరిశీలించటమే ఈ కమిటీ విధి.

ఏడవది విశేషాధికారముల కమిటీ (Privileges committee). శాసన సభకు అనుబంధంగా వుండే ఈ కమిటీలో 15 మంది సభ్యులుంటారు. శాసన సభ సభ్యుల నుండి ఎన్నుకొనే సభ్యులున్న యీ కమిటీకి అధ్యక్షులు డిప్యూటీ స్పీకరు. ప్రతి ఆర్థిక సంవత్సరానికి ఈ కమిటీ ఏర్పాటు అవుతుంది. అట్లాగే శాసన పరిషత్తుకు అనుబంధంగా వుండే విశేషాధికారముల కమిటీలో 7 గురు శాసన పరిషత్తు సభ్యులుండి దానికి డిప్యూటీ ఛైర్మను అధ్యక్షులుగా వుంటారు. అయితే ఈ ఎగువ సభ కమిటీకి ఎన్నికల ద్వారా కాక సభ్యులను ఛైర్మను నామినేటు చేస్తారు. సభ్యులకు, సభలకు వున్న ప్రత్యేక హక్కులకు అధికారాలకు విరుద్ధంగా ఎవరైనా ప్రవర్తించినా, ఏదైనా జరిగినా అటువంటి అంశాలు సభలుగాని స్పీకరు ఛైర్మనుగాని ఈ కమిటీలకు పంపినప్పుడు వాటిని పరిశీలించి తమ నిర్ణయాలను సభలకు నివేదించటం ఈ కమిటీల విధులు.

ఎనిమిదవది నియమావళి పరిశీలన కమిటీ (Rules committee). శాసన సభకు అనుబంధంగా ఒక కమిటీ శాసన పరిషత్తుకు అనుబంధంగా ఒక కమిటీ వున్నవి. స్పీకరుతో కలిపి 15 మంది సభ్యులను ఈ కమిటీకి స్పీకరు నామినేటు చేస్తారు. స్పీకరే దీనికి అధ్యక్షులు. అట్లాగే శాసన పరిషత్తుకు అనుబంధంగా వుండే కమిటీలో ఛైర్మను అధ్యక్షులుగా వుండి వారితో కలిపి 10 మంది సభ్యులుంటారు. ఛైర్మన్ కమిటీ సభ్యులను నామినేటు చేస్తారు. సభల కార్యక్రమ నియమావళిని గురించి, వాటిలో చేయదగిన మార్పులు కూర్పుల గురించి సభలకు నివేదించడం ఈ కమిటీల పని.

తొమ్మిదవ కమిటీ ప్రభుత్వహామీల కమిటీ (Government assurance committee). శాసన సభకు అనుబంధంగా వుండే ప్రభుత్వ హామీల కమిటీకి ఏడుగురు సభ్యులను సభ నుండి స్పీకరు నామినేటు చేస్తారు. అందులో ఒకరిని అధ్యక్షులుగా నియమిస్తారు. అట్లాగే శాసన పరిషత్తుకు అనుబంధంగా వున్న కమిటీకి అయిదు గురు సభ్యులను ఛైర్మన్ నామినేటు చేస్తారు. అందులో ఒకరిని ఆ కమిటీకి అధ్యక్షులుగా నియమిస్తారు. ఉభయ సభల్లోను ప్రశ్నోత్తరాల సమయంలో, తదితర చర్చల సమయంలో మంత్రులు అనేక వాగ్దానాలు చేయడం, హామీలు ఇయ్యటం జరుగుతూంటుంది. అవన్నీ ఎంతవరకు అమలు జరుగుతున్నది పరిశీలించటం ఈ కమిటీ పని. రెండు సభలకున్న యీ కమిటీల సభ్యుల పదవీ కాలం ఒక సంవత్సరం.

పదవ కమిటీ సభ కమిటీ (House committee) ఈ కమిటీలో పదకొండు మంది సభ్యులుంటారు. వారిలో 7 గురిని స్పీకరు, 4 గురిని ఛైర్మను ఆయా సభల సభ్యుల నుండి నామినేటు చేస్తారు. ఆ కమిటీ సభ్యులలో ఒకరిని స్పీకరు అధ్యక్షులుగా నియమిస్తారు. విధాన మండలి సభ్యులకు గృహవసతి, వైద్య సహాయం, తదితర సౌకర్యాలను పర్యవేక్షించటం, ఉభయ సభాపతులకు ఈ సందర్భంగా ఉచితమైన సలహాలివ్వటం ఈ కమిటీ విధులు.

ఈ పైన పేర్కొన్న స్థాయీ కమిటీలు కాక ముఖ్యమైన చిత్తుచట్టాల (Bills) పరిశీలనార్థం తాత్కాలికంగా ఏర్పాటు చేసే ఒకే సభ సభ్యులలో కొంత మంది వున్న సెలక్టు కమిటీగాని, ఉభయ సభల నుండి కొంత మంది సభ్యులతో కూడిన జాయింటు సెలక్టు కమిటీగాని వుంటాయి. ఆ యా బిల్లుల ప్రాధాన్యాన్నిబట్టి ఆ కమిటీలో ఉండదగిన సభ్యుల సంఖ్య నిర్ణయించటం జరుగుతూంటుంది. ఈ కమిటీలు తమ నివేదికను శాసన సభలకు నివేదించిన తరువాత వారు చేసిన సూచనల దృష్ట్యా అవసరమైన మార్పులు చేర్పులతో చిత్తుచట్టాలను ఆమోదించటం జరుగుతుంది.

అంతేకాక అప్పుడప్పుడు ఉభయ శాసన సభలు ఏదైనా ప్రధానమైన అత్యవసరమైన ప్రత్యేక అంశాన్ని పరిశీలించదలచినప్పుడు తాత్కాలిక కమిటీలను నియమించటం కూడా జరుగుతూంటుంది. ఇందుకు ఉదాహరణగా మన రాష్ట్ర శాసన సభ గరివిడి ఫేర్రో ఎల్లాయిస్ కార్పొరేషను నుండి విద్యుచ్ఛక్తి పరంగా రావలసిన బకాయిల పరిశీలనార్థం నియమించిన హౌసు కమిటీ, మన రాష్ట్ర శాసన పరిషత్తు సోషల్ వెల్ఫేరు హాస్టళ్లు పనిచేసే పద్ధతిని పరిశీలించేందుకు నియమించిన హౌస్ కమిటీని పేర్కొనవచ్చు. ఆ కమిటీలు సమర్పించిన నివేదికలు గణనీయమైనవి.

పైన చెప్పిన విషయాలు చాలా వరకు మన శాసనసభల కార్యక్రమంలో ప్రధానాంశాలను సంగ్రహంగా వివరించటానికి మాత్రమే ఉద్దేశించడం జరిగింది. సంపూర్ణ అవగాహనకు ఉభయ సభల కార్యవిధాన, కార్యక్రమ నిర్వహణ నియమావళి వున్న గ్రంథాలు, తత్సంబంధమైన ఇతర ప్రచురణలు పఠించవలసి వుంటుంది. ఇక్కడ ఇచ్చిన వివరాలు సభాకార్యక్రమాలను ప్రత్యక్షంగా చూసినప్పుడు శాసనమండలి పనిచేసే విధానాన్ని గ్రహించేందుకు ఉపకరిస్తయ్యి. విజిటర్సు గ్యాలరీల నుండి తదితర గ్యాలరీలనుండి సభాకార్యక్రమాలను వీక్షించేవారు ఈ సభలు ఎన్ని విధాలుగా ప్రజావాణిని ప్రతిఫలింపజేస్తున్నయో చూసి ఆనందించవచ్చు. అంతేకాదు, ప్రజాస్వామ్యవ్యవస్థ సక్రమంగా, పటిష్ఠంగా పనిచేయటానికి శాసనసభలు వహిస్తున్న పాత్ర ఎంత ప్రముఖమైనదో అర్థం కాగలదు.



# పెన్నానది మీద రైతుల పెన్నిధి

# సోమశిల ప్రాజెక్టు

**ఇటీవల ముఖ్యమంత్రి శంకుస్థాపన చేసిన రూ. 33 కోట్ల సోమశిల ప్రాజెక్టు నిర్మాణం రెండుదశల్లో పూర్తి అయినప్పుడు నెల్లూరు జిల్లాలో 3.99 లక్షల ఎకరాలలో మన కనులముందర బంగారు పంటలే పండుతాయి.**



మన పురాణాలు, కావ్యాలు అనేకమైన వాటిలో గోదావరి, కృష్ణ, పెన్న నదులను గూర్చిన ప్రస్తావనవుంది. అనాదిగా అవి తమ పుణ్యజలాలతో దక్షిణ భారతాన్ని పునీతం చేసి బంగారం పండించి మన చరిత్రనూ, సంస్కృతినీ పరిపుష్టంచేస్తున్నాయి. శాస్త్రీ. సాంకేతిక విజ్ఞానం అభివృద్ధి చెందడంతో మనిషి యీ నదీజలాలను అడ్డగించి మానవసౌభాగ్యానికి వినియోగించు కొంటున్నాడు. ఆకలి గొన్న పొలాలకు అమృతంలాటి నీళ్లతో దప్పికతీర్చి అనేకానేక పంటల్ని పండించి ప్రజల అకలి తీరుస్తున్నాడు. విద్యుచ్ఛక్తిని సృష్టించి వెలుగుల్ని వెదజల్లి చీకట్లను పారద్రోలుతున్నాడు. ఈ సోమశిల ప్రాజెక్టు అటువంటి మానవ సౌభాగ్యానికై జరుగుతోన్న కృషిలో ఒక భాగమే. ఈ ప్రాంతం ప్రజలు చిరకాలంగా కంటున్న కలలకు ఒక ఆకృతి.

నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకాలో సోమశిల గ్రామం వద్ద పెన్నానదిమీద 345 అడుగుల ఎత్తయిన రాతి ఆనకట్ట నిర్మించడం యీ ప్రాజెక్టులోని ముఖ్యాంశం ఈ ఆనకట్ట నెల్లూరు పట్టణానికి పశ్చిమంగా 50 మైళ్ల దూరంలో వుంటుంది. సోమశిల ప్రాజెక్టును రెండుదశల్లో నిర్మిస్తారు. మొదటి దశకు రూ. 17.20 కోట్లు ఖర్చవుతుంది. దీనిని 5వ పంచవర్ష ప్రణాళికలో చేర్చేందుకు ప్రణాళికా సంఘం ఆమోదించింది. రాష్ట్ర ప్రభుత్వం 1973 నవంబరులో యిందుకు మంజూరీ కూడా చేసింది.

## రాతి ఆనకట్ట

నదీగర్భంలో 1060 అడుగుల పొడవున 125 అడుగుల ఎత్తుగల మట్టి ఆనకట్టను నిర్మిస్తారు. దీనికి ఎడమవైపున 1453 అడుగుల పొడవు గల రాతి ఆనకట్ట కట్టుతారు. ఈరాతి ఆనకట్ట లోనే 735 అడుగుల పొడవైన అడుగు భాగం కూడా వుంటుంది. ఈ రాతి ఆనకట్ట ఎత్తు మొదటి దశలో 315 అడుగులు. రెండవ దశలో 345 అడుగులు వుంటుంది.

ఆనకట్ట ఎడమ పార్శ్వంనుంచి ఉత్తరపు కాలువ 30 మైళ్ల పొడవున త్రవ్వుతారు. తూర్పు పార్శ్వం నుంచి 54 మైళ్ల పొడవున దక్షిణపు కాలువ త్రవ్వుతారు. సంగం ఆనకట్ట నుంచి 48 మైళ్ల వరకు కావలి కాలువ ఏర్పాటు చేస్తారు. ప్రస్తుతం పనిజరుగుతోన్న కాన్పూరు కాలువను కూడా యీ ప్రాజెక్టులో ఒక భాగంగా మార్చుతారు.

ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తయితే నెల్లూరు జిల్లా వ్యవసాయ ఆర్థిక పరిస్థితిపై దీని ప్రభావం ఎంతగానో వుంటుంది. తొలిదశలో పెన్నా డెల్టాక్రింద ప్రస్తుతంవున్న మొదటిపంట, రెండవ పంట పల్లం ఆయకట్టుకూ, రెండు కాలువల క్రింద ప్రస్తుతం వున్న 2.8 లక్షల ఎకరాల పల్లం ఆయకట్టుకూ స్థిరంగా సేద్యపు నీరు లభిస్తుంది. ఉత్తరపు కాలువవల్ల ఆత్మకూరు తాలూకా, దక్షిణపు కాలువ వల్ల ఆత్మకూరు, రాపూరు తాలూకాలు, ఎంతగానో లాభిస్తాయి. కావలి కాలువ కావలి తాలూకాకు వరప్రసాదిని. రెండవ దశవల్ల అదనంగా 1.15 లక్షల ఎకరాల ఆయకట్టు కొత్తగా సాగులోకి వస్తుంది.

మొదటి దశ అంచనా ఖర్చు రూ. 17.20 కోట్లు వుంది. ఇందులో రూ. 8.82 ఆనకట్టుకై అవుతుంది. భూమి నష్టపరిహారం పునరావాస సౌకర్యాల కోసం రూ. 3.80 కోట్లు యంత్రాల కొరకు రు. 2.53 కోట్లు ఖర్చు అవుతుంది. కాలువల త్రవ్వకానికి రూ 2.04 కోట్లు, భవనాలు రోడ్లు వంతెనల కొరకు రూ. 60 లక్షలు ఖర్చు అవుతుంది.

## ఆహారధాన్యాల ఉత్పత్తి

ప్రాజెక్టు మొదటి దశ పూర్తి అయిన తరువాత అదనంగా 1,38,840 టన్నుల ఆహారధాన్యాలు పండగలవని ఆశింపబడుతున్నది. వీటి విలువ సుమారు రు.6.25 కోట్లు వుంటుంది. లాభం ఖర్చు నిష్పత్తి మూలధనంపైన 10 శాతం చొప్పున 3.02 మూలధనంపై 5 శాతం వడ్డీ చొప్పున 5.22 వుంటుంది. రాష్ట్ర ప్రభుత్వానికి ఈ ప్రాజెక్టు ఫలితంగా సాలీనా నికరం రూ. 13.81 లక్షలు వుంటుంది.

ప్రాజెక్టు 2 వ దశ పూర్తి అయిన తరువాత 1.15 లక్షల యెకరాల అదనపు ఆయకట్టుకు ఖుష్కి సేద్యానికి నీటిపారుదల సౌకర్యాలు కల్పించబడుతాయి. దానిఫలితంగా రూ. 3.70 కోట్లు విలువ చేసే 46,644 టన్నుల ఆహార ధాన్యాలు అదనంగా పండించబడుతాయి.

## పెన్నానది

ఆంధ్రప్రదేశ్‌లో పెన్నానది పెద్దది. దాని జలాలను వినియోగించడానికి అనేక పథకాలు రూపొందించు బడినాయి. వీటిలో కడప జిల్లాలో అదినినాయపల్లి వద్దనూ, నెల్లూరు జిల్లాలో సంగంవద్దనూ ఈ నదిపైన ఆనకట్టలు పేర్కొనదగినవి. ఇన్ని పథకాలు అమలు జరిపినప్పటికీ కూడా ఈ నదీ జలాలు చాలవరకు వృథాగా ప్రవహిస్తూ బంగాళాఖాతంలో కలిసిపోతున్నాయి.

రూ 33 కోట్లు ఖర్చుకాగల ఈ సోమశిల ప్రాజెక్టు వృథాగా ప్రవహిస్తున్న నదీజలాలను మన జీవితకాలంలో నెల్లూరు జిల్లాలో పొలాలకు వినియోగించి ఈ జిల్లాను సస్యశ్యామలం చేయడానికి వీలుగా రూపొందించబడింది.

### స్థూలంగా సోమశిల

| | |
|---|---|
| మొత్తం ఖర్చు అంచనా | : రూ. 33.52 కోట్లు |
| పరీవాహక వైశాల్యం | : 18,790 చ. మైళ్ళు |
| రాతిడామ్ కట్టడపు ఎత్తు | : 345 అడుగులు |
| కట్టడపు పొడవు | : 1,453 అడుగులు |
| రిజర్వాయర్ శక్తి | : 16 360 ఘనపు టడుగులు |
| నీరునిలిచే ప్రాంతం వైశాల్యం | : 700 చదరపు టడుగులు |

### మొదటి దశ

| | |
|---|---|
| ఉత్తరదిక్కు పంటకాల్వ నిడివి | : 30 మైళ్ళ పొడవు |
| ఆయకట్టు | : 15,800 ఎకరాల మాగాణి ప్రాంతం |
| ప్రయోజనం పొందే ఆయకట్టు ప్రాంతం | : ఆత్మకూరు తాలుకా |
| దక్షిణపు పంట కాల్వ నిడివి | : 54 మైళ్ళ పొడవు |
| ఆయకట్టు | : 16,000 ఎకరాల మగాణీ ప్రాంతం |
| ప్రయోజనం పొందే ఆయకట్టుప్రాంతం | : రాపూరు, ఆత్మకూరు తాలుకాలు |
| కావలి కాలువ | : 48 మైళ్ళ పొడవు |
| ఆయకట్టు | : 22,000 ఎకరాల మగాణీ ప్రాంతం |
| కానుపూరు కాలువ | : 23 మైళ్ళ పొడవు |
| ఆయకట్టు | : 17,000 ఎకరాల మగాణీ ప్రాంతం |
| ప్రయోజనం పొందే ఆయకట్టుప్రాంతం | : రాపూరు, నెల్లూరు తాలూకాలు |

## తెలుగు దేశంలో

# క్విట్ ఇండియా ఉద్యమం

### — శ్రీ ఎ. పండరినాథ్

1941 చివరలో భారతదేశంపై జపాన్ దండయాత్ర చేసే ప్రమాదం ఏర్పడింది. బ్రిటిష్‌వారిపై గల కోపంతో కొందరు జపాన్‌ను ఆహ్వానించ దలిచారు. భారత ప్రజల సహకారాన్ని పొందడానికి కాంగ్రెస్‌తోను ఇతర రాజకీయ పక్షాలతోను సంప్రదింపులు జరుపడానికి క్రిప్స్ నాయకత్వాన ఒక ప్రతినిధి వర్గం మార్చి 22న మన దేశం వచ్చింది.

యుద్ధ సమయంలో పూర్తి బాధ్యత కలిగిన జాతీయ ప్రభుత్వం ఉండాలని కాంగ్రెస్ చేసిన ప్రతిపాదనను మొదట అంగీకరించిన క్రిప్స్ వైస్రాయి వత్తిడివల్ల విరమించుకున్నాడు. క్రిప్స్ రాయబారం విఫలమైంది. జపాన్ దాడిని ఎదుర్కోడానికి భారతీయులకు స్వేచ్ఛ లభించలేదు కనుక బ్రిటిష్ వారు వెళ్ళిపోవాలని కోరుతూ గాంధీజీ "క్విట్ ఇండియా ఉద్యమం" నినాదం ఇచ్చాడు.

క్రిప్స్ భారత దేశంలో ఉండగానే ఏప్రెల్ 6న కాకినాడ, విశాఖపట్నం లపై జపాన్ బాంబులు వేసింది. అప్పుడు ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని గుంటూరుకు తరలించారు. జపాన్ దండయాత్రను బ్రిటన్ ఎదుర్కోలేదని కాంగ్రెస్ అభిప్రాయ పడింది. గాంధీజీ క్విట్ ఇండియా ప్రచారం దేశ వ్యాప్తంగా చేశారు.

ఆంధ్రలో కాంగ్రెస్ నాయకులు జపాన్ దండయాత్రకు వ్యతిరేకంగా ప్రచారం చేశారు. 1942 ప్రారంభంలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘాన్ని జిల్లా, తాలుకా సంఘాలను పునర్వ్యవస్థీకరించారు.

ఆగస్టులో కాంగ్రెస్‌చేసిన తీర్మానాన్ని అనుసరించి ఆంధ్రలో ఉద్యమానికి సన్నద్ధం కావడానికి బందరులో ఒక సమావేశం జరిగింది. ఫలితంగా తిరుగుబాటు కార్యక్రమం రూపొందింది. ఆంధ్ర అంతట టెలిఫోన్ తీగెలు తెంపటం, గొలుసులు లాగి రైళ్ళాపటం, కార్మికులు సమ్మెలు జరుపటం మొదలైన పెన్నో జరుగసాగాయి. కాంగ్రెస్ వారు, కాంగ్రెసేతరులు అనే భేదం లేకుండా ప్రజలందరినీ ఉద్యమంలో పాల్గొనేటట్లు చేశారు. ఈ విధంగా క్విట్ ఇండియా ఉద్యమానికి ఆంధ్ర సన్నద్ధమైంది.

ఆగస్టు 11న, తెనాలిలో బహిరంగ సభ జరిపి మరునాడు పూర్తి హర్తాళ్ చేయమన్నారు. 12 ఆగస్టు ఉదయం ఒక ఊరేగింపు రైలు స్టేషన్‌కు వెళ్ళి ఉద్యోగులందరినీ అక్కడి నుండి వెళ్ళమన్నారు. బుకింగ్ ఆఫీసును విధ్వంసం చేసి రికార్డులు, సామగ్రి తగులబెట్టారు. రైళ్ళను ఆపారు. ప్రయాణీకులను దింపి కిరసనాయిలు పోసి పెట్టెలకు నిప్పంటించారు. స్టేషన్ మాస్టర్ అతి కష్టం మీద పోలీసులకు సమాచారం అందించాడు. పోలీసులు వచ్చి లాఠీ చార్జి చేసినా జనం కదల లేదు. అప్పుడు కాల్పులు జరుపగా 6 గురు చనిపోయారు, 11 మంది గాయపడ్డారు.

## కాల్పుల్లో అసువులు బాసిన కొందరు ఆంధ్ర వీరులు

### అమ్మినేని సుబ్బారెడ్డి

ఇతడు గుంటూరు జిల్లా తెనాలికి చెందినవాడు. ఆగస్టు 12న, తెనాలి రైల్వే స్టేషన్‌లో జరిపిన కాల్పుల్లో చనిపోయి నేలకూలాడు

### భాస్కరుని లక్ష్మీనారాయణ

ఇతడు గుంటూరు జిల్లా తెనాలికి చెందినవాడు. పోలీసులు జరిపిన కాల్పుల్లో తుపాకి గుండ్లకు గురై అక్కడికక్కడే నేల కూలాడు.

### జాస్తి అప్పయ్య

ఇతడు గుంటూరు జిల్లా కూచిపూడికి చెందినవాడు ఇతడు కూడా ఈ కాల్పుల్లోనే ప్రాణాల్ని కోల్పోయాడు.

### ప్రయాగ రాఘవయ్య

ఇతడు గుంటూరు జిల్లా తెనాలిలో జన్మించాడు, ఇతడు గుంటూరులో పేరు మోసిన న్యాయవాది. ఇతడు గూడా క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని తెనాలి రైల్వే స్టేషన్‌లో జరిపిన కాల్పులకు గురి అయ్యాడు. ఆసుపత్రిలో చేర్చగా సెప్టెంబర్ 2న, మరణించాడు.

అదే రోజున చీరాలలో 500 మంది విద్యార్థులు సబ్ మెజిస్ట్రేట్ కోర్టుకు వెళ్లి ఆఫీసును మూసి వేయమన్నారు. మూసి వేయక పోగా భవనాన్ని చాలా వరకు విధ్వంసం చేశారు.

ఆగస్టు 13న. రెండు వేల మంది విద్యార్థులు గుంటూరు హిందూ కాలేజి వద్ద చేరి త్రోవలో వెళ్తున్న పోలీసుల పైన, కార్ల పైన రాళ్ళు రువ్వాసాగారు పోలీసులు లాఠి చార్జి చేశారు. ప్రయోజనం లేక పోయింది. అప్పుడు కాల్పులు జరిపారు. కాల్పుల్లో ఇద్దరు చనిపోయారు. ఎంతో మంది గాయ పడ్డారు. పోలీసు చర్యను ఖండిస్తూ అందరూ తీర్మానం చేశారు.

## మందపాటి పూర్ణచంద్రరావు

ఈ కాల్పుల్లో గుంటూరుకుచెందిన మందపాటి పూర్ణచంద్ర రావు ప్రాణాల్ని కోల్పోయాడు. విద్యార్థులందరితో ఊరేగు తున్నప్పుడు పోలీసులు కాల్పులు జరుపగా పూర్ణచంద్రరావు తుపాకి కాల్పులకు గురియై అక్కడి కక్కడే చెట్టులా కూలి పోయాడు. ఆసుపత్రిలో చేర్చారు. కాని ఫలితం లేక పోయింది. పూర్ణ చంద్ర రావు మరణించి నప్పుడు అతని వయస్సు 20 సంవత్సరాలు మాత్రమే.

ఇతడు గుంటూరులో 1922లో జన్మించాడు. ఇతని తండ్రి పేరు మందపాటి సూర్యారావు.

ఆగస్టు 17న భీమవరంలో రెండు వేల మంది సబ్ మెజిస్ట్రేట్ కోర్టుకి వెళ్ళి కార్యాలయం మూసి వేయమన్నారు. ఆ తరువాత రెవెన్యూ డివిజనల్ ఆఫీసును మూయించారు. ఆఫీసరును రాజీనామా చెయ్యమన్నారు. పతాకాన్ని చేతికిచ్చి కొంత దూరం తమతో నడిపించుకు తీసి కెళ్ళారు ఆ తరువాత కిటికీలు బ్రద్దలు కొట్టి ఆఫీసును తగులపెట్టారు. పోలీసులు కాల్పులు జరుపుతున్నా లెక్క చేయలేదు. వెంటనే మరో పోలీసు దళంవచ్చి కాల్పులు జరిపింది. అప్పుడు ముగ్గురు చనిపోయారు. 5 గురు గాయపడ్డారు.

## వేగేసిన సూర్యనారాయణ

ఈ కాల్పుల్లో 22 సంవత్సరాల యువకుడు వేగేసిన సూర్య నారాయణ ప్రాణాల్ని కోల్పోయాడు. నూనూగు మీసాలు, కసరత్తు చేసిన బలిష్టమయిన శరీరం కలవాడు యితడు

ఇతడు 1920 లో పశ్చిమ గోదావరి జిల్లా వెంపాడులో జన్మించాడు. తండ్రి కృష్ణరాజు.

దేశ పరిస్థితులు అతన్ని చిన్నతనంలోనే చదువుకు స్వస్తి చెప్పమన్నాయి. చిన్ననాటినుంచే కసరత్తు చేసేవాడు. అతడు ఏదో విధంగా దేశానికి సేవ చేయాలని తలపెట్టాడు. ఎంతో మంది యువకులను సమీకరించి వారికి శరీర వ్యాయామశిక్షణ ఇవ్వ సాగాడు. శరీర దార్ఢ్యాన్ని పెంచుకొని బ్రిటిష్‌వారితో పోరాడి జయించాలనేదే ఆయన సంకల్పం. అతడు ఎంతోమంది యువ కులకు శిక్షణ ఇచ్చి పటిష్టమైన, క్రమశిక్షణ గల పటాలాన్ని తయారు చేశాడు.

క్విట్ ఇండియా ఉద్యమం ఆంధ్రప్రాంతంలో తలెత్తి నప్పుడు భీమవరంలో అతడు తన అనుచరులందరికీ జండాలనిచ్చి తానూ ఒక జండాను చేతబట్టి ఊరేగింపు తీసాడు. యువకుల సమూహానికి నాయకత్వం వహిస్తున్న నారాయణరాజు కాల్పులకు గురై అక్కడికక్కడే మరణించాడు. జండాను చేతపట్టుకొని అలాగే చనిపోయాడు.

ఈ ఉద్యమంలో పాల్గొని ప్రాణాలు కోల్పోయిన మరి కొందరు ఆంధ్రుల్ని గురించి తెలుసుకొందాం.

## వి. శర్మ

ఇతడు గుంటూరుకు చెందినవాడు. చిన్ననాటినుంచే స్వతంత్ర భావాలు కలవాడు 1942 నాటి క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంగా గుంటూరులోని గాంధీపార్కులో ఆగస్టు 13న బహిరంగ సమావేశం జరుగుతున్నప్పుడు పోలీసులు కాల్పులు జరిపారు. ఆ కాల్పుల్లో శర్మ అక్కడికక్కడే నేలగూలాడు.

## దండు నారాయణరాజు

పశ్చిమ గోదావరి జిల్లాలోని నేలపోగులులో 1889 అక్టోబరు 15 న జన్మించాడు. తండ్రి భగవాన్‌రాజు. నారాయణరాజు చిన్ననాటినుండే స్వతంత్ర భావాలు కలవాడు. బి. ఎ. చదివాడు, ఆ తరువాత లా చదివి న్యాయవాద వృత్తికి తిలోదకాలిచ్చి ఇతడు 1921 నాటి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు. ఆ తరువాత 1930 లో గాంధీజీ పిలుపునందుకొని శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నాడు.

1942 లో దేశమంతటా ఉవ్వెత్తున లేచిన క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నాడు. ఈ సందర్భంలో ఇతన్ని బంధించి జైల్లో పెట్టారు. జైల్లో ఇతన్ని ఎంతో క్రూరంగా చూశారు. ఇతని ఆరోగ్యం దెబ్బతిన్నది. యిక అతడు కోలుకోలేకపోయాడు. 1944 సెప్టెంబర్ 10న, ఇతడు తంజావూరు జైల్లో మరణించాడు.

## గొట్టుముక్కల బలరామరాజు

ఇతడు 1925 లో పశ్చిమగోదావరి జిల్లాలోని చిన అమరంలో జన్మించాడు. చిన్ననాటినుంచే స్వతంత్ర భావాలు కల బలరామరాజు విద్యార్థిగా ఉన్నప్పుడే 1942 నాటి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నాడు. ఆగస్టు 9 న, భీమవరంలో ప్రజలంతా కలిసి ఊరేగింపు తీస్తున్న సందర్భంలో పోలీసులు జరిపిన కాల్పులకు గురి అయ్యాడు.

## ఇందుకూరి సుబ్బరాజు

పశ్చిమ గోదావరిజిల్లా సత్యవాడుకు చెందినవాడు. తండ్రి వెంకటరాజు. దేశంలో స్వాతంత్ర్యోద్యమ జ్వాలలు పెల్లుబికి నప్పుడు ఇతడు వ్యవసాయ రంగంలో పనిచేస్తుండేవాడు. ఇతడు ఆంధ్రప్రాంతంలో తలెత్తిన క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నాడు. బ్రిటిష్ ప్రభుత్వం ఇతన్ని బంధించి తంజావూరు జైల్లో పెట్టింది. ఇతడు జైలుజీవితం భరించలేకపోయాడు. ఇతని ఆరోగ్యం దెబ్బతినగా ఇతడు 1944 జులై 1 న మరణించాడు.

## కడియాల యానాదయ్య

గుంటూరుజిల్లా కత్తిపాడులో జన్మించాడు. 1942 నాటి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నాడు. ఆ తరువాత ఆంధ్ర ప్రాంతంలో రైలు ఆస్తి నష్టపడ్డచోట, ప్రభుత్వ కార్యాలయాలు

దెబ్బతిన్న చోట ప్రభుత్వం సమిష్టి పన్నులను విధించింది. జరిగిన నష్టంకంటె జరిమానాలు ఎక్కువగా విధించారు. ఆంధ్రప్రాంతంలో ఈ పన్నును వ్యతిరేకించినప్పుడు బ్రిటిష్‌వారు ఎందరినో అరెస్టు చేశారు.

ఈ సందర్భంలోనే 1943 ఫిబ్రవరి 11 న. ఇతన్ని అరెస్టు చేసి ఒంగోలు పోలీసు స్టేషన్‌లో బంధించినప్పుడు వారికి లొంగే ఇష్టంలేక ఇతడు సగౌరవంగా ఆత్మహత్య చేసుకున్నాడు.

## కర్నేని రామదాసు

ఇతడు శ్రీకాకుళంజిల్లా మామిడిపల్లిలో 1901 లో జన్మించాడు. ఇతడు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నప్పుడు ఇతన్ని బంధించి జైల్లో పెట్టారు. ఇతని ఆరోగ్యం దెబ్బతినగా ఇతడు జైల్లోనే మరణించాడు.

## సంతోషం నాగయ్య

కృష్ణాజిల్లా నందివాడలో జన్మించాడు. తండ్రి భీమయ్య. ఇతడు 1942 నాటి క్విట్ యిండియా ఉద్యమంలో పాల్గొన్నందున ఇతన్ని బంధించి బళ్లారి జైల్లో పెట్టారు. అనారోగ్యానికి గురై ఇతడు జైల్లోనే 1943 ఏప్రిల్ 13 న మరణించాడు.

## పిన్నమనేని కనకయ్య

ఇతడు కృష్ణాజిల్లా పోలుకొండలో జన్మించాడు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు ఇతన్ని బళ్ళారి జైల్లో పెట్టారు. ఇతడు జైల్లోనే 1943 డిసెంబర్ 27 న మరణించాడు.

ఆంధ్ర ప్రాంతంలో క్విట్ ఇండియా ఉద్యమం 1943 లో కూడా కొనసాగింది. గుంటూరులో, ఒంగోలులో బాంబులుకూడా ప్రేలాయి. యువకులు, విద్యార్థులు ఇంకా అలాగే ఆందోళన కొనసాగించారు. ఈ ఉద్యమంలో గాంధీజీ అహింసను విడనాడాడని ప్రభుత్వం ఆరోపించింది. దానిని ఖండిస్తూ గాంధీజీ ఉత్తరాలు వ్రాశాడు. ప్రభుత్వం వాటిని దాచిపెట్టింది. ప్రపంచానికి తన మార్గాన్ని చాటడానికి గాంధీజీ ఫిబ్రవరి 10 న నిరాహారదీక్ష పూనాడు. అప్పుడు ఆయన వయస్సు 74 సంవత్సరాలు. ఈ వయస్సులో నిరాహారదీక్ష బూనడం ఆంధ్రలో అందరినీ కలవరపరిచింది. గాంధీజీ నిరాహారదీక్షకు సానుభూతిగా మదనపల్లిలో విద్యార్థులు ఊరేగింపు జరిపారు. పోలీసులు లాటీచార్జి జరిపారు. ఎందరో గాయపడ్డారు. ఇంకా ఎన్నోచోట్ల సమావేశాలు, సానుభూతి తీర్మానాలు చేశారు. గాంధీజీ మార్చి 3 నాటికే తన నిరాహార దీక్షను విరమించటంతో ఈ సమస్య అంతటా తీరింది.

---

## ఈ సంచికలో రచయితలు

శ్రీయుతులు

వి. సుబ్బరామశర్మ, ఎం.ఎస్ 74, మలక్‌పేటకాలనీ హైదరాబాదు—36

శ్రీమతి యస్. జయలక్ష్మి, నెగ్గిపూడి, (వయా) మారుటేరు, పశ్చిమ గోదావరి జిల్లా.

తిరుమల రామచంద్ర, 69, ఆదర్శనగర్, హైదరాబాదు.

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శనగర్, హైదరాబాదు.

పుప్పల లక్ష్మణరావు, C/O "వికాసం", హిల్ పాట్నా, బరంపురం, ఒరిస్సా రాష్ట్రం.

డాక్టర్ పి. తిరుమలరావు. 263/3 ఆర్. టి, సంజీవరెడ్డి నగర్ కాలనీ, హైదరాబాదు.

కోదాటి నారాయణరావు. గాంధీ జ్ఞానమందిర్, కోఠీ, హైదరాబాదు.

ముదిగొండ వీరభద్రమూర్తి, 13-6-675, కారవాన్‌సాహు, హైదరాబాదు—2

జి. కల్యాణసింగ్, 17—సి. ఐ. బి. క్వార్టర్స్, బారాగల్లీ, హైదరాబాదు—2

తిరునగరి, "కవితాసదన్", పోచమ్మవాడ, ఆలేరు, నల్గొండ జిల్లా.

శ్రీమతి సి. ఆనందారామం, 5 ఏ.ఎస్.ఎం.సి. మారేడ్‌పల్లి సికిందరాబాదు.

డాక్టర్ ఆర్. వి. రావు, రాష్ట్ర చేనేత బోర్డు సభ్యులు, హైదరాబాదు.

వి. మధుసూదనరావు 155 సి-'బి' బ్లాక్స్, మలక్‌పేట కాలనీ, హైదరాబాదు-36

దేవులపల్లి రామానుజరావు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్, హైదరాబాదు.

శ్రీ పి. సీతాపతి, ట్రాన్స్‌పోర్టు కమీషనర్, హైదరాబాదు.

బత్తుల వెంకటరామిరెడ్డి, టీచర్, మిషన్ స్కూల్ గుత్తి అనంతపురం జిల్లా

కడియాల రామమోహనరాయ్, జె. కె. సి. కళాశాల గుంటూరు-4.

దేవిప్రియ, C/O ప్రజాతంత్ర, నాంపల్లి హైదరాబాద్

ఎ. పండరినాథ్, టీచర్, ప్రభుత్వ పాఠశాల, ఇబ్రహీంపట్నం హైదరాబాద్ జిల్లా

# నిరాశలో నిండు గుండె

– సి. ఆనందారామం

**కొత్త సీరియల్ ప్రారంభం**

మానవత్వం చిరంజీవి. అది మానవ జాతి ఉన్నన్నాళ్ళూ, అన్ని కాలాల్లోనూ అన్ని సమాజాల్లోనూ ఎక్కడో, ఏ అడుగు పొరల్లోనో చిరంజీవిగా నిలిచే ఉంటుంది.



అతడొక ఎదుగుతోన్న కుర్రవాడు.

తెలుగు దేశపు నడిబొడ్డున పుట్టినవాడు.

'నా' అనేవాళ్ళు ఉన్నారో; లేదో తెలియనివాడు.

ఆ కారణంగా అందర్నీ 'నా' అనుకుంటున్నవాడు.

అతనిలో ప్రత్యేకించి చెప్పుకోదగిన దేమీ లేదు.

అతని చిరునవ్వు మాత్రమే ఎవరినో ఛాలెంజ్ చేస్తున్నట్లుగా ఉంది. దేనినో ఎదుర్కొంటున్నట్లుగా ఉంది

అతడు ఆరోజే జైలునుండి విడుదలయ్యాడు. పోలీస్ జవాను అతణ్ణి వెంట పెట్టుకుని తీసుకొచ్చాడు.

అతణ్ణి చూడగానే పోలీస్ ఆఫీసర్‌కి బాధవేసింది. బుద్ధులు చెప్పాలనిపించింది. అలా చెప్పాలనుకోగానే శంకర రామానుజాది దివ్యపురుషుల ప్రబోధాలన్నీ ఒక్కసారిగా గుర్తుకొచ్చాయి... ఒక ప్రవక్తలాగ శాంత స్వరంతో తియ్యగా అన్నాడు.

"ఎందుకు ఇలా పాడుపనులు చేస్తావ్? దొంగతనాలు చెయ్యకూడదు అబద్ధాలు ఆడకూడదు. పెద్దలను ఎదిరించ కూడదు..."

ఇంకా ఏమేమి 'కూడదో' చెప్పటానికి ఆలోచిస్తూ ఒక్కక్షణం ఆగాడు ఆఫీసర్. ఆ కుర్రాడు "ఇహిహి" అని గట్టిగా నవ్వాడు. ఆ నవ్వు చూస్తే ఒళ్ళు మండిపోయింది ఆఫీసర్‌కి.


12–12

తన అమూల్యమైన బోధలన్నీ వ్యర్థమవుతున్నాయనిపించింది.

"బయటకి వెళ్ళాక ఏం చేస్తావ్ ?" కరుగ్గా అడిగాడు.

సంఘర్షణలతో సతమతమవుతోన్న జీవిలా ఖంగున పలికాడు కుర్రవాడు.

"ఇదివరకు ఏం చేశానో, అదే !"

నివ్వెర పోయాడు ఆఫీసర్.

"ఛ ! నువ్విక బాగుపడవు !" నిరాశగా అన్నాడు.

"బాగుపడడం అంటే ఏమిటిసార్ ! మంచి బట్టలు తొడుక్కొని కడుపునిండా తిని కార్లలో తిరగటమా ? కుర్చీలో కూర్చుని కర్రపెత్తనం చెలాయించటమా ? లేక ఈ నాగరికారణ్యంలో గర్జించే క్రూరమృగాలకు దాసోహం చేస్తూ — ఆత్మాహుతి కావించుకుంటూ కుక్కిన పేనులా కూలబడి పోవటమా ?"

పోలీస్ ఆఫీసర్‌కి చాలా కోపం వచ్చింది. అంత కోపం రావటానికి కారణం తను ఆకుర్రవాడి ప్రశ్నలకు సమాధానం చెప్పలేక పోవటమేనని ఆయనకు అర్థం కాలేదు. "గెటవుట్ !" అని అరిచాడు. ఆ కుర్రవాడు నవ్వుతూ బయటకు నడిచాడు.

సి. ఐ. డి. ఆఫీసర్ మోహన్ ఆ పిల్లవాణ్ని బయటకు వచ్చినప్పటి నుండీ పరిశీలిస్తూనే ఉన్నాడు. అతనిని చూసిన దగ్గిర నుంచీ మోహన్ మనసులో ఏదో విచిత్రమయిన సంచలనం కలుగుతోంది. తను మరచి పోయిన తంత్రు లేవో తన మనసులో కదులుతున్నట్లనిపించింది. ఆ పిల్లవాణ్ణి అనుసరించాలని పించింది.

వాడు బయటకి రాగానే ఎంతోమంది పిల్లలు — అతని ఈడువాళ్ళే - అతణ్ణి చుట్టుముట్టారు. వాళ్ళలో చింకిరి బట్టల దరిద్రులున్నారు. టెర్లిన్ షర్టుల షోకిల్లాలున్నారు.. సిగరెట్లు కాలుస్తున్న వాళ్ళు. కిళ్ళీలు నములుతున్నవాళ్ళు, దాహంతో నోరెండుకుపోతున్నవాళ్ళు - అన్ని రకాలవాళ్ళు వున్నారు. వాళ్ళందరూ ఒకరిని మించి మరొకరు వాడినేవేవో అడుగుతున్నారు. వాడు నవ్వుతూ హుషారుగా సమాధానాలు చెపుతున్నాడు. ఎవరో వాడి కేదోతినడానికి కూడా తెచ్చారు. తను తింటూ మిగిలిన వాళ్ళకు పెడుతూ ఏవో కబుర్లు చెపుతున్నాడు.

ఉన్నట్లుండి వాడి చూపు మోహన్ మీద పడింది. వెంటనే మోహన్ దగ్గిర కొచ్చాడు.

"ఏం కావాలి సార్ ?"

"నాకేం కావాలి ?"

"మరి, మీరు నన్నెందుకు చూస్తున్నారు ? అహా ! నన్నే ఎందుకు చూస్తున్నారూ అని --"

వాడి మాటల తీరుకు మోహన్‌కు నవ్వు వచ్చింది.

"వీలయితే సాయంత్రం ఒకసారి మా ఇంటికిరా."

"అలాగే సార్ !"

"ఇల్లు తెలుసా ?"

"తెలుసు సార్ ! తెలుసుకోగలను."

మోహన్ వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం ఆ కుర్రవాడు నిజంగానే తన ఇంటికి వచ్చే సరికి, వచ్చి నిర్భయంగా సోఫాలో కూచునే సరికి, తెల్లబోయి చూశాడు మోహన్.

"ఎందుకుసార్ ! అలా తెల్లబోతారు ? ఇలా సోఫాలో కూచున్నందుకా ? ఇందుకు తిట్టేవారెవరో. సంతోషించే వారెవరో, నేను కనిపెట్టగలను సార్. మిమ్మల్ని సంతోష పెడదామని."

మోహన్ నవ్వకుండా వుండలేక పోయాడు.

"ఇంత చురుకైన వాడివి. చదువుకోరాదూ !"

"అదేవిటి సార్! నేను చదువుకోవటం లేదని ఎవరు చెప్పారు?" తెల్లబోయాడు మోహన్.

"ఏం చదువు తున్నావ్ ?"

"ఇంటరు సీనియర్‌లో వున్నాను సార్."

"నిజంగా ! మరి..."

ఆగి పోయాడు మోహన్. ఆ రోజు పోలిస్ ఆఫీసర్ బుద్ధులు చెప్పడం గుర్తుకొచ్చింది. అలా తను చెప్పలేదు.

"నైట్‌కాలేజిలో చదువుతున్నాను సార్. పగటి వేళ బొత్తిగా తీరిక వుండదు. ఆల్‌వేస్ బిజీ."

"అంత తీరిక లేని వుద్యోగం ఏం చేస్తున్నావ్ ?"

"ఒకటా సార్ ! లక్ష ఉద్యోగాలు. పేపర్లమ్ముతాను. బట్టలమ్ముతాను. పరీక్షలముందు పదోక్లాసు నుండి పోస్టుగ్రాడ్యుయేట్ క్లాసుల వరకూ కాపీలు తయారు చేసి అందిస్తాను. ఇది భలే లాభిస్తుంది. కాని సీజన్‌లోనే సార్ ! సరిగ్గా పరీక్షలముందే. ఆ మాట కొస్తే పరీక్షలలోనే అందరికీ శ్రద్ధ. అంతకు ముందు ఎవడికీ పట్టదు. పరవా లేదు సార్ ! బాగానే గడిచిపోతోంది."

"నువ్వు ఒక పోలీస్‌ను కొట్టావనీ, అందుకే నిన్ను జైలులో పెట్టారనీ విన్నాను. నిజమేనా?"

"నిజమే సార్!"

"తప్పుకాదూ?"

"కాదని ఎలా అనగలను సార్! దొంగతనము చేయరాదు—అబద్ధమాడరాదు'-ఇలాంటి సూత్రాలు కాదనటానికి ఎవరికి గుండెలు సార్! కాని, ఒక్క నిముషం ఓపిగ్గా వింటానంటే జరిగింది చెప్తాను సార్! మా వీధిలో మిఠాయి దుకాణం దగ్గిర రద్దీ ఉంటుంది సార్! ఏ నూనెతో చేస్తేనేం, ఎలా చేస్తేనేం, వాడు మిఠాయిలు కాస్త చవగ్గా అమ్ముతాడు—అదీ ఆ రద్దీకి కారణం. ఒక ముసలిది ఆ దుకాణం ముందు అడుక్కుంటుంది—అక్కడయితే నలుగురూ వస్తారు కదా. మరి రెండుపైసలు వస్తాయని దాని ఆశ—తన దుకాణం ముందు కూచుని అది అలా అరుస్తూంటే శేఠ్‌జీకి చిరాకనిపించింది—అక్కణ్ణుంచి పొమ్మన్నాడు—ఆ ముసలిది పోలేదు—

పోలేదు సరిగదా, "ఈ రోడ్డు నీయబ్బ సొమ్మా? నేను పోను!" అని దబాయించింది...ఒక ముసలిది.. ముష్టిముసలిది . తనను ఎదిరించటం శేఠ్ సహించలేక పోయాడు—ఎదురుగా యూనిఫారంలో ఉన్న పోలీస్ కనిపించాడు—ఆ పోలీస్ ఇదివరకు కాస్త తెలుసు శేఠ్‌జీకి. ఆ పోలీస్‌ను దగ్గరికి పిలిచి కల్తీ మిఠాయి చేతిలో పెట్టి ముసలమ్మ సంగతి చెప్పాడు—

"ఇక్కణ్ణుంచి పోతావా లేదా? అని గద్దించాడు పోలీస్. కాకీ బట్టల్ని చూసి ముసలిది కొంచెం జడుసుకుంది—అయినా వెంటనే లేవలేక కొన్ని క్షణాలు తటపటాయించింది. పోలీస్ దాన్ని ఒక్క గెంటు గెంటాడు—అది బోర్లా పడింది—కెవ్వున కేక పెట్టి రాగాలు తీస్తూ గోల చేసింది—జనం పోగయ్యారు—పోలీస్ కొంచెం గాభరా పడ్డాడు—కానీ అనవసరం—శుద్ధదండుగ. మనవాళ్ళు అంత తెలివితక్కువ వాళ్ళేంకాదు—చోద్యం చూస్తారేగాని దేనిలోను కల్పించుకోరు—అందులో పోలీసులకు సంబంధించిన విషయాల్లో అసలు కలిగించుకోరు— కానీ, నేను కల్పించుకున్నాను—ఆ ముసలి దాన్ని అలా తోసేసే అధికారం పోలీస్‌కు లేదన్నాను—పోలీస్ సహించలేకపోయాడు. నేను చిన్నవాణ్ణి—బీదరికం స్పష్టంగా కనిపిస్తోన్నవాణ్ణి—అంచేత నా మీద లాఠీ ఎత్తికొట్టాడు—నేను తిరగబడ్డాను — చావబాదాను — భలే కొట్టాను లెండి !... "ఆహా ఇహిహి" అని అమాయకంగా నవ్వాడు వాడు.

మోహన్ మాట్లాడలేదు—వృత్తి అలవరచిన గాంభీర్యంతో అలానే కూర్చున్నాడు.

"ఒక రక్షకభటుణ్ణి నేను శిక్షించటం అన్యాయమే సార్! కాని పైన కనిపించే న్యాయం లోపలి పొరల్లో మరో న్యాయంకూడా దాగిఉంటుంది. అది సూత్రాలకందదు సార్! మనసుకి తడ్తుంది..."

అవును ! న్యాయం...సూత్రాలకు దొరకని న్యాయం.... మనసును నిలబెట్టి ప్రశ్నించే న్యాయం .. తనను ఊపిరి తీసుకోనీయక ఉక్కిరి బిక్కిరి చేస్తున్న న్యాయం ...

ఒక్క నిట్టూర్పు విడిచాడు మోహన్.

"చురుకైన కుర్రాడివి—ఈ గొడవలన్నీ వదిలి చదువుకో రాదూ?"

"గొడవల్లో పుట్టి గొడవలు పీలుస్తూ గొడవల్లో బ్రతుకుతున్న వాడిని. ఈ గొడవలు నాకేలా తప్పుతాయి సార్? నన్ను మీ దగ్గిరుంచుకొని చదివిస్తారా?" అల్లరిగా అడిగాడు.

గతుక్కుమన్న మోహన్ తేరుకుని "ఆ! చదివిస్తాను" అన్నాడు.

వాడు పెదవి విరిచి "లాభంలేదు సార్! నేనొక్కణ్ణేకాదు; నాకు బావలూ, మరదళ్ళూ, అన్నలూ అక్కలూ, మావయ్యలూ, అత్తయ్యలూ, పిన్నమ్మలూ, చాలామంది ఉన్నారు. వాళ్ళ సంగతేమిటి సార్?"

"అందరున్నారా?"

"అవును సార్! మొదట ఒక అత్తయ్యగారింట్లో ఉన్నాననుకోండి ఆ తరువాత కొన్నాళ్ళకి ఆ అత్తయ్యగారు నన్ను పోషించలేక పొమ్మంటుంది. అప్పుడు మళ్ళీ మరొక పెద్దమ్మగారి దగ్గిర చేరతాను. అక్కడ మళ్ళీ అన్నయ్యలూ, తమ్ముళ్ళూ' వగైరా...వగైరా...ఆ తరువాత ఒక బామ్మగారు...ఇలా నా బంధువర్గం చాలా పెరిగిపోయింది సార్!"

అనాథ. .వాళ్ళు వెళ్ళగొడితే వీళ్ళింట్లో...వీళ్ళు వెళ్ళగొడితే వాళ్ళింటో ..కాలం గడుపుకొంటున్నాడు . ఆ విషయం అందంగా చెప్తున్నాడు...నవ్వుతూ చెప్తున్నాడు, ముఖ్యంగా ధైర్యంగా చెప్తున్నాడు

తనకూ ఉన్నారు అలాంటి బావలూ, అన్నలూ, వగైరా వగైరా.,.అయితే వాళ్ళని తనెన్నడూ తన బంధువులని అనుకోలేదు. బద్ధ శత్రువులనుకున్నాడు..."నీ బంధు వర్గంమీద...అలాంటి బంధు వర్గంమీద...నిజంగా నీకు అభిమానం ఉందా?"

"ఎందుకుండదు సార్? వెళ్ళగొట్టినందుకా? ఆ మాత్రం అర్థం చేసుకోలేనా సార్! వాళ్ళు మనుష్యులు సార్! అందుకే ఆకలితో ఉన్న నన్ను పిలిచి అన్నం పెట్టారు. మనుష్యులు మాత్రమే సార్! అందుకే అంతకంటే ఎక్కువ చెయ్యలేక వెళ్ళిపొమ్మన్నారు..."

మోహన్ మాట్లాడలేదు. సోఫాలో వెనుక్కువాలి గట్టిగా కళ్ళు మూసుకున్నాడు...ఆ మూసుకున్న కళ్ళవెనుక అనేక దృశ్యాలు ముసురుకుంటున్నాయి.

"నన్ను వెళ్ళమంటారా సార్?"

"వెళ్ళు!"

"నాకేదైనా పని చెప్తారేమోనని ఆశపడ్డాను సార్!"

మోహన్ కళ్ళు తెరిచి చూశాడు. ఆ కుర్రవాడి కళ్ళలో నిరాశ స్పష్టంగా కనిపిస్తోంది.

"తప్పకుండా చెప్తాను—నాకు నీలాంటివాళ్ళతో అవసరం ఉంటుంది—కానీ ఆ సమయం రావాలి..."

"థేంక్యూ సర్! మీలాంటివాళ్ళు చెప్పిన పనులు చేస్తే తగిన ప్రతిఫలం ముడుతుంది .."

అసాధ్యుడు! నవ్వుకున్నాడు మోహన్.

"నీ పేరేమిటి?"

"ఏ పేరు చెప్పమంటారు సార్? పోలీస్ రికార్డులో ఎక్కిన పేరా? కాలేజీ రిజిస్టర్‌లో ఉన్న పేరా? ఫ్రెండ్స్ ముద్దుగా పిలిచే పేరా? శేఠ్‌జీ కోపంతో తిట్టే పేరా?..."

"చాలు! చాలు! నా దగ్గిర నీ పేరు చిరంజీవి...నీలో ఇవాళ నేనేం చూశానో అది మానవజాతి ఉన్నన్నాళ్ళూ .... అన్ని కాలాల్లోనూ ... అన్ని సమాజాల్లోనూ ...ఎక్కడో ఏ అడుగు పొరల్లోనో...చిరంజీవిగా నిలిచే ఉంటుంది..."

"థేంక్యూ సార్?"

నవ్వాడు వాడు.. జీవం ఉట్టిపడే నవ్వు...!

(సశేషం)



12–13

# తెలుగుదనం విశిష్టత

-శ్రీ దేవులపల్లి రామానుజ రావు

[ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఏప్రిల్ 16న జరిగిన "తెలుగుదనం—విశిష్టత" చర్చాగోష్టిలో అధ్యక్ష ప్రసంగం]

వేదిక మీదా, సభలోను ఆసీనులై ఉన్న మహాశయులకూ, సోదరీమణులకు నమస్కరించి చేసే విజ్ఞప్తి.

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో తెలుగు దనపు విశిష్టతను గూర్చి ఆలోచించుకోవడం సహజమే. అయితే ఆశ్చర్యమేమంటే కల్తీలేని తెనుగు దనానికి ప్రతిబింబమైన వావిలాల గోపాలకృష్ణయ్య గారి నేతృత్వంలో జరిగే యీ చర్చావేదిక మీద, విశేషించి తెలుగుదనాన్ని సమీక్షించుకునే యీ సమావేశానికి నన్ను అధ్యక్షునిగా నియమించడమే. ఎందుకనగా అచ్చతెనుగుదనానికి నేను ప్రాతినిధ్యము వహించలేను. బహుభాషలు మాట్లాడే నగరంలో ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర, ఉర్దూ సంస్కృతుల సమష్టి కుటుంబ మైన రాష్ట్రంలో విద్యాభ్యాసం గావించి సగము జీవితం గడిపి, మొదట భారతీయుణ్ణి, తరువాత తెలుగువాణ్ణి అనుకునే నాకు కొంత అనాంధ్ర వాతావరణము ఉన్నది. కాని మిత్రులు శ్రీ సాంబశివరావు గారి కోరికను కాదనలేక మీముందు నిలిచినాను.

## తెలుగుదనమంటే యేమి?

నా యాభై యెనిమిది సంవత్సరాల వయసులో ముప్పై ఆరు సంవత్సరాల ప్రజాహిత జీవనంలో అత్యధిక సమయాన్ని తెలుగు భాషా సేవకు వినియోగించి నందువల్ల కొంత సాహసం కలిగింది. నా అనాంధ్ర, అబ్రాహ్మణ ఆచారాలు యెట్లున్నప్పటికీ తెలుగు భాషా సంస్కృతులపైన విందుభక్తి. ఈ భక్తితో తెనుగు దన మంటే యేమి అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను. వెంటనే యీశతాబ్దిలో ఆంధ్ర ప్రబోధము గావించి మార్గదర్శకుడైన కవీశ్వరుని పద్యము జ్ఞాపకము వచ్చినది.

"కాళ్ల కడియాలొరయు ఆంధ్రకన్య సొగసు
ద్రావిడీ శూన్యచరణాల తడవ నేల?
కేరళీ కర్ణతాటంక భారకలన
తెగిపడగ నోపు తెనుగుముద్దియల చెవులు.

ఒకరి సొగసు మరొకరికి వెగటు కావచ్చును. ఒకరి సొంపు మరొకరికి యింపు కాకపోవచ్చును. దానికేమి? అయితే తెన గుదనం విశిష్టత కొంత సకల భారతానికి సమ్మోదము కలిగించి నది. తెనుగు పడతుల కట్టూ, బొట్టూ సకల భారతానికి యీనాడు అనుసరణీయమైనవనే సత్యము అందరమూ గమనించవలసి వున్నది.

చమత్కారంగా చెప్పినా సత్యమే చెప్పినాడు మన కవి మిత్రుడు. తెనుగు పౌరుని అంతరంగ బహిరంగాల విశిష్టతను గూర్చి ఆయన చెప్పిన మాటలు వినండి.

పంచె కట్టుటలో ప్రపంచాన మొనగాడు
కండువా లేనిదే కడప దాటనివాడు
పంచభక్ష్యాలు తన కంచాన వడ్డించ
గోంగూర కోసమై గుటకలేసేవాడు"

"ఏ దేశమేగినా యెందుకాలిడినా అవకాయ వియోగ మసలె నైపనివాడు"

"మంచి మనసెదురైన మాలలిచ్చేవాడు, తిక్కరేగిందంటె డొక్క చీల్చేవాడు, చిక్కులెరుగనివాడు చిత్తానపసివాడు" ఈ మాటలు తెనుగు పౌరుని ఆకారాన్ని, చిత్తవృత్తిని మన కనుల ముందు ప్రవేశపెట్టుతున్నవి.

## తెలుగువారి విలక్షణత

భారతదేశంలో బహుభాషలు మాట్లాడువారున్నారు జనాభా దృష్ట్యా రెండవ స్థానాన్ని ఆక్రమిస్తున్న తెనుగుపౌరులు పైన పేర్కొన్నవారితో పాటు మరికొన్ని ప్రత్యేకతలు కలిగి ఇతర ప్రాంతీయులకన్న విలక్షణులై ఉన్నారు. ఆ విలక్షణమే తెనుగు దనము. ఈ తెలుగుదనాన్ని వేషభాషలలోను ఆహార విహారాలలోను ఆలోచనా విధానాలలోను మనము పోల్చుకో వచ్చును.

తెలుగుదనము, తెలుగుబాష సాధారణ తపస్సు వల్ల లభించేవి కాదని అప్పయ్య దీక్షితులు చెప్పిన మాటలు మన పండితులు సభలలో పలుమారు ప్రస్తావించగా వింటున్నాము. తెనుగు వానిని గురించి శతాబ్దాలనుండి దేశీయులూ, విదేశీయులు, చెప్పిన మరికొన్ని మాటలు వింటే, యీ విలక్షణత మనకు విశదమవుతుంది. సమర మన్నా, సుందరీమణులన్నా, షడ్రసోపేతమైన భోజనమన్నా యిష్టాసీ

ఆసక్తినీ చూపే ఆంధ్రులు "అటు పుటు రటు" అంటూ వెళ్లుతున్నా రని కువలయమాలలో ప్రాకృతకవి ఉద్యోతనుడు ప్రస్తావించి తెనుగు వాడు శూరుడూ, సౌందర్యోపాసకుడూ, భోజనప్రియుడూ అని వివరించినాడు. శ్రీనాధుడు తెనుగు యింటి భోజనాన్ని అనేక సందర్భాలలో ప్రస్తావించినాడు. ఆంధ్రప్రబంధనాయికలలో చాల మంది తెనుగు పడుచులే. కాకతీయుల కాలంలో పూటకూటి యింటి భోజనాన్ని క్రీడాభిరామంలో

"కప్పురభోగి వంటకము, కమ్మని గోధుమ పిండివంటలన్, గుప్పెడు పంచదార కొ్రత్తగ కాచిన ఆవునేయి పెసరపప్పు, అరటిపండ్లు, పెరుగు" మనము చవి చూస్తున్నాము. ఆనాడు దేశ మెంత సుభిక్షంగావున్నదో యిందు వల్ల తెలుస్తున్నది. పాడిపంటల సమృద్ధి తెనుగుసీమ సామాజిక జీవనము యొక్క ప్రత్యేకతకు ఒక ముఖ్యకారణమని చెప్పవచ్చును. మన సమకాలిక కవీశ్వరులొకరు తెనుగుపల్లెల శోభను వర్ణిస్తూ —

"అరగ దంచిన సన్నబియ్యంబు వంటి
పొట్ల కాయల నేతి పోపుల నమర్చి
పేరబెట్టిన మీగడ పెరుగుతోడ"

ఒక పల్లని తల్లి తన గారాబు కూతురుకు వడ్డన చేసిన సందర్భాన్ని మన ముందుంచినారు. వేష భాషలలో, ఆహార విహారాలలో కాలానుగుణ్యమైన మార్పులు వచ్చినప్పటికినీ, కొన్ని ప్రత్యేకతలు తెనుగుదనాన్ని పట్టిచూపిస్తున్నవి. తెనుగువాని శౌర్యాన్ని గూర్చి, రసికతను గూర్చి యిదేవిధంగా అనేక ఉదాహరణలు యీయవచ్చును. ఈ ప్రత్యేకతలలో అంతర్లీనమైన తెనుగు దనాన్ని స్పష్టంగా చూడవచ్చును.

తెనుగులిపి సమగ్రమైనదనీ, సుందరమైనదనీ, తెనుగుభాష తీయనిదనీ, సంగీతానికి అనుకూలమైనదనీ, కృష్ణా గోదావరి నదులు ప్రవహించే తెనుగు సీమ ప్రకృతి సంపదకూ, శోభకూ, పాడి పంటలకూ ఆలవాలమై భారతదేశానికే ధాన్యాగారమనీ అందరికీ తెలిసిన సత్యాలే కదా!

## భావోద్రేక పరుడు

తెనుగు పౌరుడు సూటిగా మాట్లాడే స్వభావం కలవాడు. క్రీస్తుశకము 7 వ శతాబ్దిలో తెలుగుదేశానికి వచ్చి వేంగీ ధాన్యకట కాలను సందర్శించిన హ్యూయన్‌త్సాంగ్ తెలుగు దేశంలో పంటలు పుష్కలంగా పండుననీ తెలుగు పౌరుడు ఆవేశపరుడనీ, పరాక్రమ వంతుడనీ, కళాభిమాని అనీ, తెలుగుప్రాంతంలో మతాంతరులు చాలమంది ఉన్నారనీ తన యాత్రాచరిత్రలో వ్రాసిపెట్టినాడు. తెలుగు పౌరుడు భావోద్రేకపరుడన్నమాట భారతదేశంలో సుప్రసిద్ధమే కదా! కాకతీయ రాజ్యాన్ని రుద్రమదేవి పరిపాలించిన కాలంలో యిక్కడికి వచ్చిన మార్కోపోలో 13 వ శతాబ్దిలో తెలుగుదేశంలోని వజ్రాల గనులను గూర్చి వివరించి రుద్రమదేవిని బహువివేకవతిగా పేర్కొన్నాడు. తెలుగు మహిళలు విశేషించి యీ అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో యీ మాటను జ్ఞప్తిని తెచ్చుకొని సంతోషించ వచ్చునుగదా!

క్రీస్తుశకము ఒకటవ శతాబ్దిలోనే తెలుగుదేశము నేత పరిశ్రమకు ఆటపట్టుగా ఉండి విదేశాలతో వర్తకము కొనసాగించినది. చేనేత బట్టల నాజూకు, తెలుగువారి నైపుణ్యాన్ని అభిరుచిని శతాబ్దాల నుండి దేశవిదేశాలకు పరిచయం చేస్తున్నది. తెనుగు పడతుల మాటతీయదనాన్ని ఒక సంస్కృతకవి తన చాటువులో ప్రశంసించినాడు (సదుక్తి కర్ణామృతము) పూలతో పరిమళించే కొప్పు, మణిమయమైన ఒడ్డాణము, రత్నహారము, తెల్లచీర ఆంధ్రస్త్రీ వేషాలంకారమని మరొక సంస్కృత కవి చెప్పినాడు (మంకకుని కావ్య మీమాంస).

తెనుగు ప్రజలు ఆజానుబాహులు, సుందరాకారులు, తమిళులకన్న చక్కనివారు, ఎత్తులో ఉత్తరదేశీయులతో సమానమైనవారు; దాక్షిణాత్యులకన్న ఆచారవంతులు, శక్తివంతులు, కాని ఆవేశపూరితులని ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా చెప్పుతున్నది తెలుగు వారు అయిరోపాఖండ వాసులవలె నాగరికులు, తెనుగు చాలమట్టుకు ఇటాలియన్ భాషను పోలివుంటుందని మరొకరు ఉద్ఘాటించినారు. తెలుగు ఇటాలియన్ భాషల పోలికలను గూర్చి మిత్రులు శ్రీ మాల కొండయ్య ఐ ఏ. యస్ గారు పరిశోధించి చక్కని వ్యాసము వ్రాసినారు. మన జాతిపిత మహాత్మాగాంధీ "ఆంధ్రులు శౌర్యవంతులు, గర్వకారణమైన సంప్రదాయం కలవారూ, మతముపట్ల అభిమానం కలవారు, త్యాగశీలురూ, శక్తిమంతులూ, దానశీలురూ,పట్టుదల గలవారు, ప్రేమార్ద్రహృదయులూ" అని వివరించినారు. పైన పేర్కొన్న అభిప్రాయాలలో ఏకత్వం కనిపిస్తున్నది. ఆ ఏకత్వములో తెలుగు దనము వెల్లడవుతున్నది.

## పాండితి-సంస్కృతి

సంగీతము, చిత్రలేఖనము శిల్పములలో తెలుగువారు ప్రతిభను చూపించినారు. త్యాగరాజులేనిది భారతీయ సంగీతములేదు. అజంతాలోనిది ఆంధ్ర చిత్రలేఖనమే. మన జానపద సాహిత్యంలో నిజమైన తెలుగు వాతావరణము కన్పిస్తున్నది. సంస్కృతాన్ని, వేదాన్ని స్పష్టంగా ఉచ్చరించే తెలుగువారు. పార్సీ, ఇంగ్లీషు మొదలైన భాషల ఉచ్చారణలో కూడ ప్రవీణులు, తెలుగుదేశంలో రాజకీయ చైతన్యం యెక్కువ. సమిష్టిగా ఐక్యత తెలుగువాని బలమైన గుణాలలో ఒకటి కాదని చెప్పితే అతిశయోక్తి కాజాలదు. కల్పనా శక్తితో పాటు వ్యాఖ్యానశక్తి ప్రత్యేకత. మల్లినాథుని వంటి వ్యాఖ్యాత భారతదేశంలో మరొకరు పుట్టలేదంటే సత్యదూరంకాదు. ఆధునిక యుగంలో హైందవవేదాంతాన్ని, భారతీయ సంస్కృతిని సకల ప్రపంచానికి విశదీకరించిన జగదాచార్యుడు రాధాకృష్ణుడు. గాంధీజీ సూత్రకారుడైతే నేను ఆయనకు భాష్యకారుడన డాక్టర్ పట్టాభి సీతారామయ్య గారు ఒకమారు చెప్పినట్టు జ్ఞాపకము.

తెనుగు పౌరునిది విశాలహృదయం. పొరుగుప్రాంతాల నుండి విదేశాల నుండి స్వేచ్ఛగా వీచే స్వచ్ఛమైన వాయువును తెనుగువాడు నిరోధించ లేదు ప్రాకృతము, సంస్కృతము, పార్సీ, ఇంగ్లీషు పదాలు తెలుగులో సొగసుగా ఇమిడినవని చెప్పడానికి యెన్ని ఉదాహరణలైన పేర్కొన వచ్చును. భారతదేశంలోని యితర ప్రాంతాలకు వెళ్ళినా విదేశాలకు వెళ్ళిన తెనుగు పౌరుడు అక్కడి వారితో కలిసి పోతాడు. ఇతర ప్రాంతీయులు తెలుగు ప్రాంతానికి

వస్తే వారిని ఆదరంతో ఆహ్వానిస్తాడు. తెనుగుదనానికి యిది మరొక ప్రత్యేకత. భారత జాతీయతకు వ్యతిరేకంగా వ్యవహరించేవాడు తెలుగు పౌరుడు కాడు. తెనుగుదనం భారత జాతీయతకు అనుగుణమైనది. పరిపోషకమైనది ఒక రాష్ట్రం కోరినా, రెండు రాష్ట్రాలు కోరినా భారతదేశం నుంచి విడిపోవలెనని తెలుగువాడు ఎన్నడూ అభిలషించేవాడు కాదు.

అభివృద్ధికరమైన అన్ని ఉద్యమాలను తెలుగువాడు ఆహ్వానించినాడు. నాటి జైన, బౌద్ధాలతోపాటు. నేటి వివిధ ఉద్యమాలను యెన్నింటినో తెలుగుసీమ ఆకర్షించినది. విశ్వసౌభ్రాతృత్వాన్ని, మానవతను ఆహ్వానించి త్యాగసమయంలో అరనిమిషం గూడ ఆలోచించని ఆర్ద్రహృదయుడు తెలుగువాడు. తెనుగుపౌరుడు.

"పంజాబు నుండి కప్పరపు మొక్కలు దెచ్చి
పెరటితోటలలోన పెంచినాడు,
పచ్చి జవ్వాది గోవానుండి రప్పించి
దంతపు జాడీల దాచినాడు,
కొండవీటి గులాబి గుత్తుల అత్తర్లు
కీలు తిత్తులలో బిగించినాడు.
అసలైన పారసీకాశ్వాల నలవార్చి
విజయ యాత్రల స్వారివెడలినాడు,
సాంగజీవిత కల్యాణ శాఖక్రింద
నిలిచి ఆనందదేవతన్ గొలిచినాడు,

అంతేకాదు—

మోటుపల్లీ తీరమున లంగరేసి ఓ
డలు సుంకమ్ముల్ంపనిలుచునాడు.
రాయలసీమ రారాయబార్లు వసించి
చిత్ర చరిత్రల్ రచించునాడు,
పాకాలచెరువు చెంపల పండు ధాన్యముల్
అన్యదేశాధీశులడుగునాడు.
అద్దంకి కోడెల నాబోతులకునయి
దూరాగతులు కొని తోలునాడు
తెనుగుతల్లి లాలాటిక తిలకదీప్తి...
ఖండఖండాంత రాలలో ప్రకాశించినది.

ఈ తిలకదీప్తియే తెనుగుదనంలోని ప్రత్యేకత. ఇటువంటి ప్రత్యేకతను కాపాడుకొనవలసినదని కోరుతూ—

"తమ్ముడా మాయనిత్తువె తల్లి వన్నె
చెల్లెలా చిన్నబుత్తువె తల్లి చిన్నె"

అని కవివాణి ప్రశ్నిస్తున్నది. ఆ ప్రశ్నకు మనము చెప్పేది ఆశాజనకమైన సమాధానమే.

---

తెలుగు సంస్కృతి సంవత్సరోత్సవ సందర్భంగా

శ్రీ కె. ఆర్. కె. మోహన్ వ్రాసిన

"సంక్షిప్త తెలుగు సాహిత్య చరిత్ర"

సీరియల్ వ్యాసం - సెప్టెంబరు సంచిక నుండి

---

# ఇరవై అయిదు శతాబ్దాల తెలుగు వెలుగు

-కలాసిశా సింగ్

1650 ప్రాంతంలో తెలుగువారి కడపటి రాజ్యం—విజయనగర సామ్రాజ్యం-రూపరిపోయింది. అంతకుపూర్వం ఇంచుమించుగా రెండువేల సంవత్సరాలనుంచి–అంటే క్రీస్తుశకానికి ఇంకా పూర్వంనుంచే–తెలుగు దేశపు కోటలమీద రెపరెపలాడుతూ వచ్చిన ఆంధ్రరాజ్య పతాక నేలకొరిగి పోయింది. ఈ రెండువేల సంవత్సరాలలోను ఆంధ్రరాజ్య వంశాలు తెలుగు దేశాన్నంతనూ ఏకచ్ఛత్రాధిపత్యంగా కాకపోయినా మానె ఏదో కొంతభాగమైనా తమపాలన క్రింద ఉంచుకొని రాజ్యాధికారం నెరపుతూనే వచ్చాయి. ఏ సుముహూర్తాన క్రీస్తుపూర్వం 225లో ఆంధ్ర సాతవాహన వంశ రత్న దీపం శ్రీముఖ భూవరుడు ఆంధ్ర రాజ్యాన్ని స్థాపించాడో కాని అప్పటినుంచీ తెలుగు నేలను వెలసిన రాజ్యాలు అనేకాలు. అన్య దేశాలనుంచి వచ్చి ఇక్కడ నివాసమేర్పరుచుకొని స్థిరపడిపోయిన వారైతేనేమి, తెలుగువారైతేనేమి, ఎవరో ఒకరు ఎన్నిరాజ్యాలు స్థాపించారని! ఇక్ష్వాకులు, విష్ణుకుండి నృపతులు, చాళుక్యులు, గంగవంశజులు, కాకతీయులు, రెడ్డిమన్నీలు, విజయనగరాధీశ్వరులైన యాదవులు, సాళువవారు, తుళువవారు, అరవేటివారు–ఒకరా ఇద్దరా? వీరందరూ మహాబల పరాక్రమ సంపన్నులే. వీరు పాలించిన బంగారుకాలంలో ప్రతిష్ఠానపురం, ధనకటకం, వేంగి, కొండవీడు, రాజమహేంద్రవరం, ముఖలింగం (నగరి కటకం), ఓరుగల్లు, విజయనగరం మొదలైన దుర్గరాజ్యాలు ఆంధ్రరాజ్య రమకు నాట్యమండపాలయ్యాయి. వీరందరూ ఏదో ఒక రీతిని ఆంధ్రసంస్కృతిని పెంపొందించినవారే. విద్యలనూ, కళలనూ పోషించినవారే. ఆంధ్రదేశంలో తెలుగు కవితను నిలిపిన మను మార్గచరితులు చాళుక్యులు. చామర్లకోట సమీపంలోని చాళుక్య భీమవరం, ద్రాక్షారామాలలోని దేవాలయాలు ఇప్పటికీ వారి కీర్తిధ్వజాలవలె ప్రకాశిస్తున్నాయి. కాకతీయుల కదన పాండితి సామాన్యమైనదా?

## కాకతీయ ప్రభ

ఢిల్లీ తురుష్క దండయాత్రలను ఏడుమారులు నిలువరించి ఎదుర్కొని ఆంధ్ర సభ్యతకూ, ఆంధ్ర సంస్కృతికీ పెట్టనికోటై నిలిచి పరిరక్షించి చివరికి ఆ పరిరక్షణలోనే నేలహాలిపోయింది కాకతీయ త్రైలింగ్య సామ్రాజ్యం. కాకతి వంశజులలో కడపటి మహారాజు వీరరుద్రదేవుని పేరు చెప్పితే గడగడలాడేవారు ముసల్మానులు. కాకతి రాజన్యులు పరంపరగా వస్తూఉండిన ఆంధ్ర శిల్ప కళాలక్ష్మికి కొత్త అందచందాలు దిద్ది దానికి విశ్వమోహన విభూతి సంతరించిపెట్టారు. కాకతీయులు గొప్ప దేవాలయాలు ఎన్నిటినో నిర్మించారు. నాట్యకళను ఆదరించి పోషించారు. శైవులైన కాకతి రాజన్యులు ఆనాడు నిర్మించిన దేవాలయ స్తంభాల తీరు సొరులనూ, వాటిమీది శిల్పపు జిలుగుపనినీ చూస్తే ఇప్పటికీ మనకు ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది. ఆనాడు నాట్యకళ ఎంత అభివృద్ధిలోనూ ఉండకపోతే తమ సౌందర్య రూపరేఖా విలాసాలతోనూ, భంగిమలతోనూ మన హృదయాలను ఆహరించే నాట్యసుందరుల విగ్రహాలూ, ప్రతి అంగుళంలోని దశాంశభాగంలోనూ నటరాజతాండవమూ ఆ స్తంభాల మీదా, వాటి ఊర్ధ్వరాతిదిమ్మలమీద చెక్కడం తటస్థిస్తుంది?

## అలనాటి వైభవం

కొండవీడు రాజధానిగా తెలుగుదేశాన్ని పాలించిన రెడ్డిమన్నీలు మాత్రం తక్కువవారా? ఎర్రాప్రెగడ, శ్రీనాథమహాకవి మొదలైనవారికి ఆశ్రయం ఇచ్చి కీర్తి వహించినవారు రెడ్డి రాట్పురందరులు వైభవ దేవేంద్రులు. అనవేమ, కుమారగిరి, పెదకోమటి వేమారెడ్లు కర్పూరవసంతరాయళ్లు, వారేటేటా కొండవీట వసంతమహోత్సవం మహావైభవంగా నిర్వహించి సంపాదించుకొన్నది ఈ వసంతరాయ బిరుదు. ఆ వసంతోత్సవాలలో వారు వెదజల్లిన కస్తూరీ చందన కర్పూర ఖండ దివ్యపరీమళంతో నాడు ఆంధ్రావని నెత్తావులు విరజిమ్మింది. వారు ఎంతటి వైభవప్రియులో అంతటి కళావిలోలురు, విద్యావిశారదులు. తెలుగునాట ఆయుర్వేద జ్యోతిషాది శాస్త్రవిద్యలు ముమ్మరంగా వర్ధిల్లినది వారి కాలంలోనే. ఉద్భట వివాదప్రౌఢి గౌడ డిండిమభట్టు కంచుఢక్కను పగులగొట్టించిన గండరగండడు, దక్షిణాధీశు ముత్యాలశాలలో దీనారటంకాల తీర్థమాడిన ఆంధ్రకవి సార్వభౌముడు శ్రీనాథమహాకవి పెంపకంలో ఆంధ్రసాహితి కొత్త తీరుతేయాలను సంతరించుకొంది.

ఇక విజయనగర సామ్రాజ్యం ఇంచుమించుగా తెలుగు సామ్రాజ్యమే. అందులో ఆ సామ్రాజ్యాన్ని పాలించిన నాల్గవదైన కట్టకడపటి వంశం– అరవేడు వంశం– పూర్తిగా నూరుపైసల తెలుగువంశం. అరవేటివంశజుల కాలంలో విజయనగరాధీశ్వరుల అధికారం దక్షిణాన కన్యాకుమారి వరకూ గల దక్షిణదేశం మీదనే కాకుండా సింహళం(శ్రీలంక) మీదకూడా చెలామణి అయింది. విజయనగరరాజ్యం 1335లో ఉదయించి మూడువందల సంవత్సరాలపాటు వర్ధిల్లింది. ఈ మూడువందల సంవత్సరాల కాలంలో విజయనగరాధీశ్వరులు అనేకులు కళలనూ, కవులనూ, పండితులనూ పోషించి హిందూసంస్కృతి సభ్యతలను పరిరక్షించారు.

శ్రీనాథమహాకవికి తన ముత్యాలశాలలో కనకాభిషేకం కావించి గౌరవించినవాడు ఈ విజయనగరాధీశ్వరులలోని ప్రౌఢ దేవరాయ మహారాయలే. విజయనగరాధీశ్వరుల ఇలువేల్పు తిరుపతి–తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి. ఐనా వారు శివకేశవ పక్షపాతం చూపక తమ సామ్రాజ్యంలోని దివ్యక్షేత్రాలలో ఉన్న శివాలయాలకూ, విష్ణ్వాలయాలకూ కూడా సరిసమానంగా దానధర్మాలు చేసి కీర్తి వహించారు.

## గానం-నాట్యం

విజయనగరాధీశ్వరుల కాలంలోనే పదవాఙ్మయ పితామహుడు అన్నమాచార్యులవారు వర్ధిల్లారు. ఆయన శ్రీ వేంకటేశ్వరులవారిని గురించి రచించిన కీర్తనలు ముప్పయిరెండు వేలున్నాయట పండితులూ, కవులూ గేయవాఙ్మయాన్ని ఆదరించడం ఆయన కాలంనుంచే ఆరంభమయింది. గేయానికి ఆయన కాలంలో కొత్త చైతన్యమూ, పటుత్వమూ వచ్చాయి. విజయనగరాధీశ్వరులు తమ ఆమోద ముద్ర వేయకపోయినా వారి ప్రతినిధులై తంజావూరు, మధుర రాజ్యాలను పరిపాలించిన సామంతులు, ఆంధ్రనాయకరాజులు దానిని చేపట్టి లాలించి దానికి కొత్త నడకలు నేర్పి దానిచే నాట్యం చేయించారు గేయ రచనకు యక్షగాన రూపకం పరమావధి అయింది. గేయ యక్షగాన ప్రబంధాలకు చొక్క ఆంధ్ర నాయక రాజానంతరం తంజావూరు రాజ్యాన్ని పాలించిన మన రాష్ట్ర మహీపతులు కూడా వాటిని ఆదరించి గేయ నాట్యకళా లక్ష్మికి తమ ఆస్థానాన్ని నాట్యసదనంచేసి ఆనందించారు.

విజయనగరాధీశ్వరుల కాలంలో తెలుగు కవులు పాత త్రోవలు విడిచి కొత్త తెన్నులు తొక్కారు. తెలుగు కవిత పట్టభద్రపు రాజ బిరుద లాంఛనాలతో కొలువు తీరింది. సంగీతాన్నీ, సాహిత్యాన్నీ, కళలనూ పోషించి విజయనగరాధీశ్వరులు దిగంత విశ్రాంత యశస్కులయ్యారు.

విజయ నగర సామ్రాజ్యం వర్ధిల్లిన కాలంలో తెలుగుబిడ్డదే వైభవం. దండనాయకులు తెలుగువారు, రాజ ప్రతినిధులు తెలుగువారు. పౌర పత్తెగాండ్రు తెలుగువారు. తెలుగువారి రాచరికంలో దక్షిణ భారత దేశపు కోటలమీద ప్రతిష్ఠితమయినది తెలుగు పతాక. తెలుగు సంస్కృతిని–కేవలం తెలుగు సంస్కృతినే కాదు–హిందూ సంస్కృతిని పరిరక్షించి పోషించినవారు తెలుగువారు విజయనగర సామ్రాజ్యం 1650 ప్రాంతంలో రూపరి పోవడంతో తెలుగువారు విగత రాజ్యులయ్యారు.

దేశం పరాక్రాంత మయింది బ్రిటిషువారి పరిపాలన కాలంలో తెలుగుదేశం ఛిన్నాభిన్నమై వేరువేరు పరిపాలనల క్రిందికి పోయింది. తెలుగువారుండే రాజ్యాలు వేరయిపోయాయి. తెలుగువారు ఒకరికొకరు కాకుండా పోయారు. వారు దాస్యం భజించారు. ఇక్కట్లపాలయ్యారు. వారి ప్రకృతి సంపదా, వారి ఐశ్వర్యమూ వారికి కాకుండా పోయాయి

## పునరుద్ధరణ

బ్రిటిషు పరిపాలన కాలంలోనే మళ్ళీ కన్ను తెరిచారు తెలుగువారు. ఆత్మస్థితిని అవగతం చేసుకున్నారు. స్వాతంత్ర్య సంపాదనంకోసం కాంగ్రెసు మహాసభ తలపెట్టిన మహోద్యమంలో హృదయపూర్వకంగా పాల్గొన్నారు తెలుగువారు. ప్రత్యేకాంధ్ర రాష్ట్ర సంపాదనానికి నడుముకట్టి ఉద్యమం సాగించారు. స్వాతంత్ర్య సముపార్జనానికీ, ప్రత్యేక రాష్ట్ర సాధనకూ తెలుగువారు చేసిన త్యాగాలూ, వారు పడిన కష్టనష్టాలూ ఇన్నీ అన్నీకాదు. ఐతే 1947 ఆగస్టు 15వ తేదీని భారత దేశానికి స్వరాజ్యమైనా వచ్చింది కాని తెలుగువారికి రాష్ట్రం మాత్రం సిద్ధింపలేదు. నలభై ఏళ్ళపాటు తెలుగువారు సాగించిన ఉద్యమ ఫలితంగా, పొట్టి శ్రీరాములు అసువులు అర్పించిన కారణంగా, చివరికి 1953 అక్టోబరు ఒకటవ తేదీని ఆంధ్రరాష్ట్రం అంశమాత్రంగా అవతరించింది. 1956 నవంబరు ఒకటవ తేదీని సమగ్రమయిన ఆంధ్రప్రదేశ్ సాక్షాత్కరించింది. మన సంస్కృతినీ, మన సభ్యతనూ మళ్ళీ వృద్ధి పొందించుకొని మన ప్రజ్ఞనూ, మన ప్రతిభనూ చూపడానికి అవకాశం కలిగింది.

1975 ఏప్రిల్‌లో ప్రపంచ తెలుగు మహాసభల మహోత్సవ సమయంలో ఇరవై ఐదు శతాబ్దుల తెలుగు వెలుగు ఒక్కసారి దశదిశలా దీపించినట్లయింది. ఈ ఏడాది తెలుగు సంస్కృతి సంవత్సరంగా జరుపుకుంటున్నాం. తెలుగు భాషకు నూత్న ఓజస్సూ, తెలుగు సంస్కృతికి నూత్న మహస్సూ ప్రాప్తమయ్యే శుభోదయం నేత్రపర్వంగా ఉంది.

---

చట్టాలను ఉల్లంఘించడానికీ, జాతీయ కృషిని స్తంభింపజేయడానికీ, మన రక్షణ దళాలలో క్రమశిక్షణారాహిత్యం, అవిధేయతలను రెచ్చగొట్టడానికి తలపెట్టిన ఉద్యమంవల్ల మన ఆర్థికరంగం ఛిన్నాభిన్నమై పోయివుండేది. దేశంలో విచ్ఛిన్నకర ధోరణులు ప్రబలడానికీ, బైటనుండి దురాక్రమణ ప్రమాదం కలగడానికీ అవకాశం వచ్చి వుండేది. ఇప్పుడు ద్వేషధూమాలు తొలగిపోయాయి కనుక మన ఆర్థిక లక్ష్యాలను స్పష్టంగా చూడగలుగుతున్నాం. అత్యవసర పరిస్థితి ప్రకటన వల్ల ఆర్థిక రంగంలో కృషి చేయడానికి కొత్తగా సదవకాశం లభించింది.

—ఇందిరా గాంధీ

---

# దక్షిణ మధ్య రైల్వే వారి నవ రత్నాలు...

తొమ్మిదేళ్ళక్రితం దక్షిణ మధ్యరైల్వే ఏర్పాటైనప్పటినుంచీ రైలు ప్రయాణీకుల సౌకర్యాలను మెరుగు పరచడానికి అవిరళంగా కృషిచేస్తూ వస్తోంది. ఈ తొమ్మిదేళ్ళలోనూ ఎన్నో సరికొత్త రైళ్ళను ప్రవేశపెట్టింది. దూర ప్రాంతాల ప్రయాణీకుల సౌలభ్యం కోసం అతి వేగంగా ప్రయాణంచేసే ప్రయాణీకుల రైళ్ళను ప్రవేశపెట్టింది.

నిజానికి యిటీవలి కాలంలో ప్రయాణీకుల రద్దీ బాగా ఎక్కువయ్యింది. వ్యాపారస్తులు, విద్యార్థులు, యాత్రికులు, అధికార్లు—ఒకరేమిటి అందరికీ అందుబాటులో వున్న చవుక ప్రయాణ సాధనం రైలు. అందుకే సామాన్యుడికి సాధ్యమైనంత ఎక్కువ ప్రయోజనకరంగా దీనిని తీర్చి దిద్దడానికి దక్షిణ మధ్యరైల్వే సాధ్యమైనన్ని ప్రయోజనకర చర్యలన్నిటినీ తీసుకుంటోంది. రైళ్ళ స్టేషన్లలో ప్రయాణీకుల సౌకర్యాల్ని హెచ్చించడమే కాదు: కొత్త రైళ్ళను నడపడం. కొత్తగా కొన్నికొన్ని చిన్న స్టేషన్లలో రైళ్ళు ఆగే సౌకర్యాన్ని కల్పించడం, దూరప్రాంతాల ప్రయాణీకుల కోసం వేగంగా ప్రయాణంచేసే రైళ్ళను ప్రవేశపెట్టడం, బొగ్గు ఇంజన్ల స్థానే డీసిల్ ఇంజన్లను నడిపించడంవంటి చర్యల నెన్నింటినో యిటీవలి కాలంలో దక్షిణ మధ్యరైల్వే చేపట్టింది. అజంతా ఎక్స్‌ప్రెస్, దక్షిణ ఎక్స్‌ప్రెస్, గోల్కొండ ఎక్స్‌ప్రెస్, తిరుమల ఎక్స్‌ప్రెస్, కృష్ణా ఎక్స్‌ప్రెస్, గోదావరి ఎక్స్‌ప్రెస్, జయంతి ఎక్స్‌ప్రెస్, ఈస్ట్ కోస్ట్ ఎక్స్‌ప్రెస్, వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్—యీ తొమ్మిది ఎక్స్‌ప్రెస్ రైళ్ళనూ దక్షిణ మధ్య రైల్వేవారి నవరత్నాలుగా పేర్కొనవచ్చు. ఈ తొమ్మిది రైళ్లూ తొమ్మిదేళ్ళక్రితం దక్షిణ మధ్య రైల్వే ఏర్పాటైన తదనంతరం ప్రవేశపెట్టబడినవే.

అజంతా ఎక్స్‌ప్రెస్ 1967 ఏప్రిల్ ఒకటో తేదీన ప్రవేశపెట్టబడింది. సికిందరాబాదు, మన్మాడ్‌ల మధ్య రాత్రికి రాత్రి ప్రయాణంచేసే రైలు యిది. అజంతా, ఎల్లోరావంటి ప్రముఖ ప్రాంతాలకు వెళ్ళే యాత్రీకులకు దీనివల్ల మంచి సౌలభ్యం కలిగింది.

రాష్ట్ర రాజధానికి, ఢిల్లీకి మధ్య ప్రయాణీకుల రాకపోకలు యిటీవలి కాలంలో చాలా ఎక్కువయ్యాయి. రాజకీయవేత్తలు, సైనిక సిబ్బంది, వ్యాపారస్థులు, అధికార్లు ఢిల్లీ వెళ్ళాలన్నా

సికిందరాబాద్‌లోని 'రైలునిలయం'



రావాలన్నా యీ రెండింటిని నేరుగా కలిపే రైలు చాలా అవసరం. అదీన్నీ తొందరగా ప్రయాణించేసే రైలు అయివుండాలి. సికింద్రాబాదునుంచి ఢిల్లీకి 1938 జనవరి 1 న ప్రవేశపెట్టిన దక్షిణ ఎక్స్‌ప్రెస్ అటువంటిదే. ఇది డీసిల్ ఇంజనుగల రైలు.

మన రాష్ట్రంలోనేకాక దేశంలోనే విజయవాడకు వాణిజ్యపరంగా ప్రాముఖ్యం వుంది. ఇది భారతదేశంలోని ఉత్తర దక్షిణ ప్రాంతాలకు రైల్వే కూడలి. రాష్ట్ర రాజధానికి రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలనుంచి వచ్చీ పోయే ప్రయాణీకుల సౌకర్యార్థం గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌ను 1969 మార్చి 1 నుంచి ప్రవేశపెట్టారు. ఇంతకు ముందు యీ రెండు పట్టణాల మధ్యగల ప్రయాణ కాలాన్ని యీ రైలు బాగా తగ్గించింది. తెల్లవారుఝామున విజయవాడలో బయలుదేరితే మధ్యాహ్నం భోజన సమయానికి సికింద్రాబాదు చేరుకోవచ్చు. రాజధానిలో పని పూర్తిచేసుకుని మళ్ళీ రాత్రికి యిదే రైల్లో విజయవాడ చేరుకోవచ్చు. రాష్ట్ర వాణిజ్య కేంద్రమైన విజయవాడను రాష్ట్ర రాజకీయ కేంద్రమైన హైదరాబాదుతో కలిపే రైలు యిది.

దేశంలోని ప్రముఖ యాత్రా స్థలాల్లో తిరుపతి ఒకటి. రాష్ట్రంలోనుంచే కాక దేశం నలుమూలలనుంచీ ప్రతిరోజూ వేల సంఖ్యలో యాత్రికులు తిరుపతికి వెళ్తుంటారు. ఉత్తర, దక్షిణ ప్రాంతాలకు రైల్వే కూడలిగావున్న విజయవాడనుంచి తిరుపతికి ప్రత్యేకంగా రైలు వుండాలని భావించి తిరుమల ఎక్స్‌ప్రెస్‌ను 1970 ఏప్రిల్ 4 న ప్రవేశపెట్టారు. ఇది విజయవాడ, తిరుపతి మధ్యనడిచే రైలు. ప్రారంభంలో వారానికి రెండుసార్లు నడిచేది. అటు తర్వాత ప్రతిరోజూ నడుపుతున్నారు. హైదరాబాదు, మచిలీపట్నం, రేపల్లె, గుంటూరు నుంచి తిరుపతి వెళ్ళే యాత్రికులను విడి బోగీలద్వారా దీనికి కలిపే సౌకర్యం కూడా వుంది.

వాణిజ్య కేంద్రమైన విజయవాడకు ఇటు రాష్ట్ర రాజధాని హైదరాబాదుతో పాటు దేశంలో ముఖ్య వాణిజ్య కేంద్రమైన బొంబాయితో వర్తక వాణిజ్య అవసరాలు ఎక్కువైన కారణంగా వాటి మధ్య ప్రయాణ వ్యవధిని తగ్గించే చర్యగా కృష్ణా ఎక్స్‌ప్రెస్‌ను 1974 అక్టోబరు 2 న ప్రవేశపెట్టారు. హైదరాబాదు, విజయవాడల మధ్య యిది పగటిపూట ప్రయాణం చేసే రైలు. విజయవాడనుంచి బొంబాయికి వెళ్ళడానికి కాని, అక్కడినుండి తిరిగి వచ్చేటప్పుడు గాని హైదరాబాదులో ఎక్కువ సమయం ప్రయాణీకులు ఆగిపోకుండా వెంటనే ప్రయాణం కొనసాగించడానికి వీలైన కనక్టింగ్ ట్రైన్ యిది. ప్రారంభంలో హైదరాబాదు, విజయవాడల మధ్య నడిచేది. అటు తర్వాత గుంటూరు వరకు దీనిని పొడిగించారు. సుమారుగా నిమిషానికి ఒక కిలోమీటరు దూరం చొప్పున అత్యంత వేగంగా ప్రయాణం చేస్తుంది. డీసిల్ ఇంజను గల రైలు.

రాష్ట్రంలోని ముఖ్య పట్టణాలను రాష్ట్ర రాజధానితో రాత్రికి రాత్రి ప్రయాణంచేసే శీఘ్ర గమనం గల రైలు ద్వారా కలిపే ఉద్దేశంతో గోదావరి ఎక్స్‌ప్రెస్ 1974 డిసెంబరు 1న ప్రారంభించబడింది. హైదరాబాదు, విశాఖపట్నంల మధ్య నడుస్తుంది. విశాఖపట్నంకు పారిశ్రామికంగా రోజురోజుకు ప్రాముఖ్యం పెరుగుతున్నది. ఓడరేవు పట్టణం. అందువల్ల యీ రెండింటి మధ్య ప్రయాణ కాలాన్ని సాధ్యమైనంత తక్కువ చేసే ఉద్దేశంతో దీనిని ప్రవేశపెట్టడం జరిగింది. వైజాగ్‌లో సాయంత్రం చీకట్లు ముసురుకొనే వేళ బయలుదేరిన ప్రయాణీకుడు ఉదయం టిఫిను చేసే వేళకు రాష్ట్ర రాజధానికి చేరుకోవచ్చు.

జయంతి జనతా ఎక్స్‌ప్రెస్‌ను 1975 మే 3వ తేదీన ప్రారంభించడంతో ఢిల్లీ మరింత దగ్గరైపోయినట్టయ్యింది. దక్షిణ ఎక్స్‌ప్రెస్‌లో రెండు రాత్రుళ్ళు, ఒక పగలు ప్రయాణం చేయాలి ఢిల్లీ చేరాలంటే. ఇప్పుడు జయంతి జనతాలో ఒక్క పగలూ, ఒక్క రాత్రీ ప్రయాణం చాలు. ప్రస్తుతం యిది వారానికి ఒకసారే వుంది. ఇక్కడనుంచి వెళ్ళేది శనివారం సికింద్రాబాదులో బయలుదేరుతుంది. అక్కడనుంచి వచ్చేది సోమవారం ఢిల్లీలో బయలుదేరుతుంది. త్వరలోనే దీనిని వారానికి రెండుసార్లు నడపడానికి చర్యలు తీసుకుంటున్నారు. అప్పుడు మొదటి తరగతి ప్రయాణీకులకు కూడా దీనిలో ప్రయాణం చేసే సౌకర్యం వుంటుంది.

గమ్యాన్ని సాధ్యమైనంత తొందరగా చేరాలన్నదే యీనాటి ప్రయత్నం. హైదరాబాదు నుంచి కలకత్తా వెళ్ళే ప్రయాణీకునికి ఏడు గంటల సమయం మిగలడం అంటే విశేషమే. 1975 మే 16 న ప్రారంభించిన ఈస్ట్‌కోస్ట్ ఎక్స్‌ప్రెస్ వల్ల అలాటి సౌకర్యం యిప్పుడు ఏర్పడింది. విజయవాడ, కలకత్తాల మధ్య యీ రైలు ప్రవేశపెట్టబడింది. సికింద్రాబాదు నుంచి బయలుదేరే కృష్ణా ఎక్స్‌ప్రెస్‌కు అదనంగా జతపరిచే బోగీల్లో విజయవాడ దాటి హౌరా వైపు వెళ్ళే ప్రయాణీకులు వెళ్ళొచ్చు. ఉదయం సూర్యోదయ సమయంలో సికింద్రాబాదులో రైలు ఎక్కితే మర్నాడు సూర్యాస్తమయానికి కలకత్తాలో కాలుపెట్టొచ్చు.

హైదరాబాదు నుంచి నేరుగా తిరుపతి వెళ్ళే యాత్రికులకు, ఒక రాత్రికి రాత్రి బెంగుళూరుకు వెళ్ళే వ్యాపారస్తులు, అధికార్లు, విద్యార్థులు, తదితరులకు సౌకర్యాన్ని కల్పించే విధంగానూ, రాయలసీమను నేరుగా రాష్ట్ర రాజధానితో తొందరగా ప్రయాణం చేసే రైలు ద్వారా కలపడానికి అనువుగానూ వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్ 1975 మే 19 న ప్రవేశపెట్టడం జరిగింది. డీసిల్ ఇంజను రైలు యిది. రాష్ట్రంలోని ముఖ్యపట్టణాలను, నగరాలను రాష్ట్ర రాజధానితోనూ, రాష్ట్ర రాజధానిని యితర రాష్ట్రాల రాజధానులతోనూ వేగంగా నడిచే రైళ్ళ ద్వారా కలపాలనే దక్షిణ మధ్య రైల్వే కృషికి యిది చక్కని నిదర్శనం.

# అత్తిలి పంచాయతీ ఆదర్శకృషి

**శ్రీమతి జయలక్ష్మి**

పశ్చిమ గోదావరిజిల్లాలో 1973-74 సంవత్సరానికి ఉత్తమంగా ఎన్నికైన అత్తిలి గ్రామపంచాయతీ ఒకటిన్నర దశాబ్దాల క్రితం అత్తిలి సమితి ప్రధాన కేంద్ర కార్యాలయం ఉన్న గ్రామం. చరిత్ర ప్రసిద్ధి చెందిందే కాకుండా పురాణ ప్రసిద్ధి చెందిన ఈ అత్తిలి గ్రామం గత దశాబ్దంగా వికాసకార్యక్రమాలను అమలు పరచిపంచాయతీరాజ్య విజయపతాకాన్ని ఎగురవేస్తున్నదంటే అతిశయోక్తి లేదు. ఉత్తమ పంచాయతీగా అత్తిలి ఎన్నికైన విషయాన్ని తెలుసుకొని ఆ గ్రామ పంచాయతీ సాధించిన విజయాలను తెలుసుకొందామనే కుతూహలంతో ఆ గ్రామం సందర్శించాను.

## పేద వర్గాల సంక్షేమం

గ్రామ పంచాయతీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ డి. సత్యనారాయణ మూర్తిగారిని కలుసుకొన్నాను. వచ్చిన విషయం చెప్పాను. తర్వాత శ్రీ సత్యనారాయణ మూర్తిగారిని "అత్తిలి పంచాయతీ పేద ప్రజలకు ఏవిధంగా సేవజేసిందో చెప్పండి?" అని అడిగాను. శ్రీ సత్యనారాయణమూర్తి హరిజనులు, వెనుకబడిన తరగతుల అభివృద్ధి విషయంలో సాధించిన ప్రగతిని వివరిస్తూ ఇలా అన్నారు. పేద ప్రజలైన హరిజనులకు నివేశనస్థలాలను అత్తిలి గ్రామ పంచాయతీ ప్రభుత్వంచే ఇప్పించింది. వారికి నివాసయోగ్యమైన పెంకుటిళ్ళ నిర్మాణానికి పూనుకొంది. జిల్లా సంక్షేమ నిధి నుంచి 65,000 రూపాయల ఆర్థిక సహాయం పొంది హరిజనులకు 36 పెంకుటిళ్ళను నిర్మించడం జరిగింది. ఈ హరిజనవాడకు "శ్రీ మేకల వీరన్న హరిజనవాడ" అని పేరు పెట్టబడింది. హరిజన వాడలో 20,100 రూపాయలు స్వంత నిధులను ఖర్చుచేసి రహదారులను వేసింది అత్తిలి పంచాయతీ. ఈ వాడలో 1,500 రూపాయల ఖర్చుతో మంచినీటి బావిని తవ్వించింది. గ్రామంలో మూడు మరుగు దొడ్లను నిర్మించింది. ఆరువేల రూపాయలు ఖర్చుచేయించి పాలిచ్చే ఆరు గేదెలను హరిజనులకు ప్రభుత్వంతో ఇప్పించడంతోపాటు, పాలు అమ్మకానికి రెండు సైకిళ్ళను పాలు తీసుకొని వెళ్ళడానికి పాల డబ్బాలను ( Cans ) అందజేయటం జరిగింది. హరిజనవాడను విస్తృత పరచి 20 విద్యుద్దీపాలను వేసింది అత్తిలి గ్రామ పంచాయతీ. విద్యుచ్ఛక్తి లేని చోట్ల ఏడు ప్రదేశాలలో కిరసనాయిలు దీపాలు పంచాయతీ నిర్వహిస్తున్నది. హరిజనవాడల్లో రెండు పాఠశాలలను పెనుమంట్రు సమితి నడిపేలా ప్రోత్సహించింది. వెనుకబడిన తరగతుల వారైన ఉప్పర్లు, యానాదులు నివసించే ప్రాంతంలో 17,000 రూపాయలు ఖర్చుచేసి పాఠశాలకు శాశ్వత భవనం నిర్మిస్తే శ్రీ కానుమిల్లి వెంకటేశ్వరరావుగారు ఆరు వేల రూపాయలు విరాళం అందజేశారు.

## పౌర సౌకర్యాలు

పౌర సౌకర్యాలు కల్పించడంలో అత్తిలి పంచాయతీ వహించిన పాత్ర ఏమిటో వివరించగలరా అని అడిగినపుడు కొవ్వూరు డివిజనల్ పంచాయతీ ఆఫీసరు శ్రీ ఆచంట గాంధీ ఇలా అన్నారు. ఈ నాడు అత్తిలిగా పిలవబడుతోన్న ప్రాంతంలో



అత్తిలిగ్రామంలో లక్ష రూపాయలు విలువచేసే ఆసుపత్రి భవనానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేస్తోన్న దృశ్యం

అత్రిమహర్షి తపస్సు చేసుకొనే వారని ప్రతీతి. అత్రి మహర్షి పునీతం చేసిన ఈ ప్రాంతం అత్రిగా పిలవబడుతూ ఈ నాడు అత్తిలిగా రూపాంతరం చెందింది. ఈ గ్రామం ఈ నాడు బొంతు వారి పాలెం, హరిజనవాడలతో కలిపి ఏకపంచాయతీగా ఉంది. 1911 సంవత్సరంలో ఏర్పడిన ఈ గ్రామపంచాయతీ 8.37 చదరపు మైళ్ళ విస్తీర్ణం గలఈ పంచాయతీలో 17,629 మంది జనాభా నివసిస్తున్నారు. ఈ గ్రామ పంచాయతీ వీధులలో 325 విద్యుద్దీపాలను వేసి సాలీనా సరాసరిని 25,000 రూపాయలు ఖర్చుచేస్తున్నది. 14,914 కిలోమీటర్ల కంకర రహదారులను, 2.291 మట్టి రహదారులను, 0.811 కిలోమీటర్ల తారు రహదారులను వేసి అత్తిలి పంచాయతీ ఏటా 18,000 రూపాయలు ఖర్చుచేస్తున్నది. 12మరుగు దొడ్లను కూడా నిర్వహిస్తున్నది. 20 బావులను, మూడు మంచినీటి చెరువులను, రెండు రేడియోలను నిర్వహించటంతో పాటు 6536 గజాలు నిడివిగల సిమ్మెంటు మురుగు కాలువలను గ్రామంలో నిర్మించింది. రెండు పార్కులను కూడా అత్తిలి పంచాయతీ ప్రారంభించింది.

పేదరైతాంగం నిలయమైన అత్తిలి వ్యవసాయికంగా ప్రగతిని సాధించింది. ఈ గ్రామంలో రైతులు 1973-74 సంవత్సరంలో 1038 ఎకరాల్లో కొత్త వరివంగడాలను వేసి పండించారు. 332 మంది

రైతులు వ్యవసాయం ఆధునిక పద్ధతులపై చేశారు. ఈ గ్రామంలో రైతులకు ఆరు ట్రాక్టర్లు 72 స్ప్రేయర్లు ఉన్నాయి. వ్యవసాయ శాఖ ఈ గ్రామంలో రైతులకు ఆరు పవర్ స్ప్రేయర్లను, 4 డస్టర్లను 8 పాదాస్ప్రేయర్లను, 16 ఇతర వ్యవసాయ పరికరాలను అంద జేసిందని కూడా శ్రీగాంధీ అన్నారు.

1950 సంవత్సరంలో శ్రీ వెట్ల బాపన్నగారు పంచాయతీ అధ్యక్షులుగా ఉన్నరోజుల్లో నిర్మించబడిన పంచాయతీ భవనం విస్తృత పరచబడి ఈనాడు 35,000 రూపాయలు విలువైందని ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ సత్య నారాయణమూర్తి అన్నారు.

అత్తిలి గ్రామంలో రైతులు ప్రయోజనానికి గాను ఒక పశువుల ఆసుపత్రి ప్రారంభించబడింది. దానితోపాటు పశువుల పాడి పెంపొందించటానికి గాను ఒక కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రం నిర్వహించ బడుతోంది. మొదట్లో పశువుల ఆసుపత్రి భవనాన్ని శ్రీ అన్నెం శేషారావుగారు తమ తండ్రి శ్రీ అన్నెం రత్తయ్యగారి పేరిట కట్టించి ఇచ్చారు. ఇటీవలి కాలంలో లయిన్స్ క్లబ్ పశువులను ఉంచటానికి గాను ఒక షెడ్డును నిర్మించటానికి ఆరు వేల రూపాయల విరాళం అందజేస్తే, సంక్షేమ నిధినుంచి మూడు వేల రూపాయలు ఆర్థిక సహాయం లభించింది. లయన్ శ్రీ వెట్ల గోవిందరావు ప్రధాన దాతగా 1,000 రూపాయలు విరాళం చేశారు. అత్తిలి పంచాయతీ 1,000 రూపాయలు విరాళం అందజేసింది.

## ఆసుపత్రి భవన నిర్మాణం

ప్రజల సౌకర్యం కోసం అత్తిలిలో ఆసుపత్రి నెలకొల్పబడింది. అయితే ఆసుపత్రికి అనువైన భవనంలేదు. ఆ భవన నిర్మాణానికి ప్రజావిరాళం కావలసి వచ్చినపుడు ఆ గ్రామ వాస్తవ్యులు శ్రీమతి మేకల పద్దాలమ్మ ముందుకు వచ్చి 25,000 రూపాయలు విరాళం ఉదారంగా అందజేశారు. పెనుమంట్ర సమితి 25,000 రూపాయలు ఇస్తే అత్తిలిగ్రామ పంచాయతీ ఐదువేల రూపాయలు విరాళం ఇచ్చింది. జిల్లా సంక్షేమ నిధినుంచి 50,000 రూపాయలు ఆర్థిక సహాయం లభించింది. శ్రీమతి మేకల పద్దాలమ్మ ఔదార్యం కారణంగా లక్ష రూపాయల ఖర్చుతో నిర్మించిన ఆసుపత్రి భవనానికి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రారంభోత్సవంచేశారు.

## పాఠశాల భవనాల నిర్మాణం

పాఠశాల భవనాల నిర్మాణానికి అత్తిలి గ్రామ పంచాయతీ ముందుకు వచ్చి విరాళాలు అందజేసింది ఒక పాఠశాల భవనం 10,500 రూపాయల ఖర్చుతో నిర్మించబడింది. 14,000 రూపాయల ఖర్చుతో నిర్మించబడిన శ్రీ కానుమిల్లి వెంకట్రామయ్య పాఠశాల భవనానికి శ్రీ కానుమిల్లి వెంకటేశ్వరరావు ఆరువేల రూపాయలు విరాళం ఇచ్చారు. పిల్లల ఉద్యాన వనం వద్ద 15,000 రూపాయలు ఖర్చుతో నిర్మించిన పాఠశాలకు అత్తిలి పంచాయతీ 5,000 రూపాయలు ఇస్తే ప్రజలు విరాళంగా ఐదువేల రూపాయలు అందజేశారు. ఐదువేల రూపాయలు జిల్లా సంక్షేమ నిధినుంచి జిల్లా కలెక్టరు విరాళంగా అందజేశారు. ఈ పాఠశాలకు ప్రస్తుత పంచాయతీరాజ్య శాఖా మాత్యులు శ్రీ లకలాపు లక్ష్మణదాసు ప్రారంభోత్సవం చేశారు. అత్తిలి గ్రామంలో జిల్లా గ్రంథాలయ సంస్థ ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న గ్రంథాలయ భవన నిర్మాణానికి శ్రీ యడవల్లి చౌదరయ్య 10,000 రూపాయలు విరాళం అందజేశారని శ్రీ డి. సత్యనారాయణమూర్తి తెలియజేస్తూ ఈ గ్రామపంచాయతీ ప్రగతికి సహకరించిన పంచాయతీ సభ్యులకు, పంచాయతీ సర్పంచ్ శ్రీ మేకల వీరన్న గారికి తన కృతజ్ఞతలు తెలియజేశారు.

## ఆర్థిక వనరులు

అభివృద్ధి కార్యక్రమములను సమధికోత్సాహంతో అమలు పరచటం ఒకఎత్తు. ఆర్థికంగా, పటిష్ఠం కావటానికి పన్నులు హెచ్చింపు, ఉత్పత్తి పథకాలు అమలు పరచటం మరొక ఎత్తు. పన్నులను గత పుష్కరం కాలంనుంచి నూటికి నూరు పాళ్ళ వసూలు జేస్తున్నది గ్రామ పంచాయతీ. ఈ పంచాయతీ పన్నుల హెచ్చింపుతో తీసుకొన్న సాహసచర్య ఆర్థిక దుస్థితిలో ఉన్న ఇతర పంచాయతీలకు మార్గదర్శకమయింది కూడా. ఆంధ్రప్రదేశ్‌లో ఇంత పెద్ద మొత్తంతో పన్నును హెచ్చించిన గ్రామ పంచాయతీ మరొకటి లేదేమో? 1971-72 సంవత్సరంలో ఇంటి పన్నుల రూపేణా గ్రామ పంచాయతీకి 32,220 రూపాయలు లభిస్తే 1972-73 సంవత్సరానికి పన్నులు హెచ్చింపు వల్ల 65,629 రూపాయలకు పెరిగింది. అంటే నూటికి 97 పాళ్ళు పెరిగిందన్న మాట. ఈ నాడు వృత్తి పన్ను వల్ల 6,040 రూపాయలు, బళ్ళపన్ను వల్ల 4,201 రూపాయలు ఆదాయం లభిస్తుండగా పంచాయతీ నిర్వహిస్తున్న వారపు సంతవల్ల 15,000 రూపాయలు, రోజువారీ మార్కెట్టు వల్ల 3,347 రూపాయలు బళ్ళ స్టాంపు వల్ల 750 రూపాయలు, దుకాణాల అద్దె వల్ల 1,884 రూపాయల ఆదాయం లభిస్తున్నది. అత్తిలి గ్రామ పంచాయతీ ఆధీనంలో ఉన్న చెరువులలో చేపల పెంపకంవల్ల 4,730 రూపాయల ఆదాయం లభించింది.

కేసముద్రంగట్టు గ్రామ పంచాయతీలో ఉన్న చెరువును 1,65,000 రూపాయల ఖర్చుతో అత్తిలి గ్రామ పంచాయతీ బాగు చేయించి, కేసిసాగర జలాశయాన్ని తవ్వించి నాలుగు తటాకాలుగా నిర్మింపజేసింది. ఈ పథకానికి అత్తిలి గ్రామ పంచాయతీ 15,000 రూపాయలు పెట్టుబడి పెట్టితే తొలి సంవత్సరంలోనే అత్తిలి గ్రామ పంచాయతీకి 13,600 రూపాయల ఆదాయం లభించింది. భవిష్యత్తులో ఈ పథకంక్రింద చెరువు గట్లపై వేసిన 3 ఏళ్ళ వయస్సుకలిగిన మూడు వందల కొబ్బరి చెట్ల ద్వారా వచ్చిన ఆదాయంలో వాటా లభిస్తుంది. 1½ సంవత్సరాలు వయస్సు కలిగిన 2,000 కొబ్బరి మొక్కలు కూడా నాటడం జరిగింది. చెరువుల్లో 1,20,000 చేప పిల్లలు వేయటం కూడా జరిగింది.

(తరువాయి 39వ పేజీలో)

# మన రాష్ట్రంలో ఉన్ని పరిశ్రమ
## ఉజ్వల భవిష్యత్తుకు అవకాశాలు

డాక్టర్ ఆర్. వి. రావు

[ రాష్ట్రంలో తయారవుతున్న 6 కోట్ల రూపాయల విలువగల ఉన్నిలోను, 1 కోటి రూపాయల విలువగల ఉన్నిని మాత్రమే మనం ఉపయోగిస్తూన్నామనీ, మిగిలినది యితర రాష్ట్రాలవారు ఉపయోగిస్తూన్నారనీ, ఆ ఉన్నికి తక్కువధర వస్తూన్నదనీ, యీ పరిశ్రమలోని ఉత్పత్తిదారులకు తగు సహాయముచేయుటకు, పరిశ్రమ అభివృద్ధికి తగు కృషిచేయాలనీ, వ్యాసకర్త సూచించారు. ]

ఉన్ని, ప్రకృతి గొఱ్ఱెలకు సంరక్షణ క్రింద పెట్టిన భిక్ష. గొఱ్ఱెలు పెంచటం, ప్రపంచంలో అతి ప్రాచీనమైన వృత్తి. "గొఱ్ఱెలకు బంగారపు కాళ్లు గలవు; ఆ కాళ్లు ఎక్కడ పెట్టినా, అచ్చట మట్టి బంగారం అవుతుంది" అనే సామెత వలన, గొఱ్ఱెల పెంపకం వలన గల లాభములు మనకు గుర్తుకు రాగలవు. గ్రీకులు, రోమనులు, యీజిప్షియనులు మొదలగువారు భారతీయుల వలె అనాది నుండి, గొఱ్ఱె బొచ్చు నుండి దారంతీసి, కంబళ్లు మొదలగు వస్త్రసామగ్రి తయారు చేసేవారు. ఇది గృహ పరిశ్రమగా ప్రారంభమాయను.

ప్రపంచ ఉన్ని ఉత్పత్తిలో, యీనాడు భారత దేశం 2శాతం మాత్రమే తోడ్పడుచున్నది. దీనిని బట్టి దేశపు ఆర్థిక విధానంలో యీ పరిశ్రమ యొక్క ప్రాముఖ్యత మనం నిర్లక్ష్యం చేయరాదు. ఏ యితర మృగాల బొచ్చు, దారం తీయుటకు, గొఱ్ఱె బొచ్చులాగ పనికి రాదు. రాజస్థాన్‌లో, విస్తారంగా ఉన్ని తయారగు చున్నది. రానురాను గొఱ్ఱెల సంపద తగ్గుతూంది. మాజీ హైదరాబాదు సంస్థానంలో 15000 ఉన్ని మగ్గాలు ఉండేవి. వాటిని సహకార క్షేత్రంలోనికి తెచ్చుటకు తగు ప్రయత్నాలు కూడ జరిగాయి. ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ మొదలగు దేశాలలో, అచ్చటి గొఱ్ఱెల సంపదను బాగా వినియోగించుకొని, ఆయా దేశాల ప్రగతిని ఎంతో అభివృద్ధి చేసివున్నారు.

### ఉపాధి సౌకర్యాలు

ఈ సంపదను మనం పూర్తిగా వినియోగించు కోలేదు. ఈ పరిశ్రమ గ్రామీణ పరిశ్రమ అయి యున్నది. ఈ పరిశ్రమ అభివృద్ధి అయిన యడల, రెండుమూడు కోట్ల గొఱ్ఱెల కాపర్లకు (కూరుమాలు) ఉపాధి సౌకర్యాలు యిచ్చుటకు వీలవుతుంది. వ్యావసాయిక దేశమగు మన భారతదేశం, యీ పరిశ్రమను నిర్లక్ష్యంచేయరాదు. చలి కాలంలో, ఉన్నిబట్టలకు, డిఫెన్సు డిపార్టుమెంటుకు ఉన్నిబట్ట ఎంతో కావాలి. మనం 10 కోట్లకుపైగా ఉన్ని దిగుమతి చేసు కొంటున్నాం. దేశం స్వయం సంపూర్ణం కావాలంటే, గొఱెల సంఖ్య పెరగాలి. నాణ్యమైనఉన్ని లభ్యంచేయాలంటే బలము, రంగు, మొదలగువాటిపై ఆధారపడుతుంది. వాణిజ్యరీతిలో తీసి కొందామంటే, గొఱ్ఱెలజాతి, తయారుచేసిన ఉన్నియొక్క ఉపయోగం, దారంతీసే నంబరు యివన్నీ గుర్తుచేసికోవాలి. అందు చేతనే మన ఆంధ్రప్రదేశ్‌లోని ఉన్ని గురించి చెప్పాలంటే, యిది కొంతవరకు ముతకగా వుంటుందనాలి కాని రాజస్థాన్ నుండి తెల్ల ఉన్ని కొంత దిగుమతిచేసికొని దానితోకలిపి నాణ్యమైన కంబళ్లు రక్షణ శాఖకు సరఫరాచేయవచ్చని అందరూ ఒప్పుకొంటున్నారు. ఉన్నికి యిచ్చే ధరలు, ఒక్కనాణ్యత మీదనే ఆధారపడక, తయారయిన ఊరు ప్రాముఖ్యత, కాలం, ఉన్నిలోఉన్నబలం మొదలగు వాటిపై కూడ ఆధారపడతాయి. ఇకగొఱ్ఱెల సంఖ్య తగ్గినదంటే, గ్రామసీమలలో పచ్చికబయళ్లు తక్కువయినాయి. కనుక గ్రామాలలో 10వ వంతు భూమి పచ్చిక బయళ్లకు (Pasture grounds)గా విడిచేవారు ఈనాడు, గ్రామాలలో పచ్చిక బయిళ్లులేవు సరికదా, వాటికి మేసే అవకాశాలు క్రమేణాతగ్గాయి. మధ్యస్థులు ఉత్పత్తిదారులనుంచి తక్కువ ధరలకు ఉన్నికొను చున్నందున ఉత్పత్తిదారులకు లాభం లేకున్నది.

### సహకార సంఘం యేర్పాటు

అందుచే ఉత్పత్తిదారులను, యీ బాధలనుండి తొలగించుటకు, మాజీహైదరాబాదు సంస్థానం ఒక కేంద్రఉన్ని సహకార సంఘం స్థాపించెను. 39 ప్రాథమిక సహకారసంఘాలు, 10,000 సభ్యులతో, కేంద్ర సంఘ అధ్యక్షత క్రింద వచ్చెను. ఈ కేంద్ర సంఘం, ప్రాథమిక సంఘాల అభివృద్ధికి తోడ్పడుటయేగాక, తయారయిన కంబళ్లను, యితర రాష్ట్రములలో అమ్మెడిది.

ఆ రోజులలో, ఏ యితర రాష్ట్రం, సహకార పద్ధతులపై, యీ పరిశ్రమ అభివృద్ధి చేయలేదు. అఖిలభారత చేనేత బోర్డు, యీ కృషికి ఎంతో తోడ్పడింది.

పరిస్థితులు యిట్లుండగా, ఆంధ్ర ప్రదేశం స్థాపింపబడినది. ఆనాటి ఉన్ని మగ్గాలలో చాల తెలంగాణ ప్రాంతంలో ఉండటం వలన, యీ రాష్ట్రంకు ఉన్ని పరిశ్రమ అంటే పేరు వచ్చింది. రాయలసీమలో కూడ కర్నూలు, అనంతపురం జిల్లాలలో కూడ ఉన్ని పరిశ్రమ అభివృద్ధికి మంచి అవకాశాలున్నాయి. ఈ పరిశ్రమ మనకు ప్రకృతి పెట్టిన భిక్ష అనాలి. గనులు ఎంత ముఖ్యమో, యీ పరిశ్రమ కూడ అంత ప్రాముఖ్యమైనదే అనాలి. అంతేకాదు వ్యవసాయదారులకు యీ పరిశ్రమ వలన ఎంతో లాభం రాగలదని యిదివరకే వ్రాయబడినది. యీ పరిశ్రమ ఆర్థికంగా సాంఘికంగా వెనుకబడ్డ కురుమలకు ఉపాధి సౌకర్యం యిస్తూవున్నది. ఆంధ్ర ప్రదేశంలో, 20 లక్షల గొఱెలు ఉన్నాయని అంచనా వేయబడినది. వీటినుండి ఉన్ని సంవత్సరంలో రెండు సార్లు తీస్తారు. సాలీనా 6 కోట్ల రూపాయలపైగా విలువగల ఉన్ని మన రాష్ట్రంలో ఉత్పత్తి అవుచున్నదని అంచనా వేయబడినది. దీనిలో 1 కోటి రూపాయల ఉన్నిని మాత్రమే మనం ఉపయోగించుకొని, మిగిలినది యితర రాష్ట్రాల వారికి తక్కువ రేట్లకు అమ్ముచున్నాం. దానితో, యిచ్చటి తిరుమాల ఆర్థికస్థితి సన్నగిలింది. గొఱ్ఱెల మందలను పెంచుట లోను, ఊలుతీయుటలోను, దారం తీయుటలోను, దారం కంబళ్ల క్రింద నేయుటలోను, మన రాష్ట్రంలోని 40 లక్షల 'కురుమాలు' నిమగ్నులైవునారు. మన పరిశ్రమలలో యీ పరిశ్రమకు అతి ప్రాముఖ్యత గలదని, వారివారి ఉపాధి సౌకర్యాలు, వారే స్వయంగా తెచ్చుకుంటూన్నారని, చెప్పాలి. కాని రాష్ట్రంలో లభ్యమయ్యే ఉన్నిలో, అతి తక్కువ శాతం మన ఉన్ని పారిశ్రామక సంఘాలు ఉపయోగించుకొను చున్నందున, చాల భాగం పంజాబ్, రాజస్థాన్ మొదలగు ప్రాంతాలకు పోతున్నది గనుక బయటి వారికే యీ పరిశ్రమ వలన హెచ్చు లాభం వస్తున్నది. ఆ ఉన్నిని మనరాష్ట్రంలో, కంబళ్లు యితర వస్తువులు క్రింద మార్చినచో, వాట్లకు మార్కెట్లు మన రాష్ట్రంలోనే లభించ గలవు. అచ్చట ఊలు మిల్లులు ఉపయోగించి, వాటిలో చాల భాగం మనకే అమ్ముతున్నారంటే, విచారించని ఆంధ్రులెవరూ ఉండరు. ఇది మన దురదృష్టం అనాలి.

వర్తకులు, ఉన్ని లభ్యమయ్యే కాలానికి ముందేవచ్చి, కురుమలకు, పెట్టుబడులు యిచ్చి, తక్కువ ధరలకు ఉన్ని సప్లయి చేయటానికి వాగ్దానాలు పుచ్చుకొంటారు. దానితో వారికి న్యాయమగు ధర రావటం లేదు గదా, మనకు కావలసిన ఉన్ని లభ్యమగుటయే కష్టమగుచున్నది. ఉన్ని సేకరణ కేంద్రాలు స్థాపించి, అచ్చట సరసమైన ధరలకు ఉన్నికొనే ఏర్పాట్లు చేశారు. ఖాదీ కమిషన్ వారు కూడ చాల ఊలు కొంటారు కనుక, వారి సహకారం కూడ కోరారు. ఉన్ని పరిశ్రమ అభివృద్ధికి యిది మొదటి ఘట్టం అనాలి. కేంద్ర సంఘం సరిగా పని చేయనందున ప్రభుత్వం దానిని స్వాధీనం చేసికొన్నారు. త్వరలో దానిని పునర్నిర్మాణం చేసి, ఉన్ని పరిశ్రమకు, సరియగు దోహదమిచ్చేటట్లు చేస్తే ఎంతో బాగుంటుంది సహకార సంఘాలు పటిష్టంచేయాలని, కార్యకర్తలు, స్వలాభ కాంక్ష విడనాడి, సహకార సంఘాల అభివృద్ధికి తోడ్పడాలి అని, యీ శాఖ మంత్రి శ్రీ బత్తెన సుబ్బారావుగారు యీ మధ్యనే చెప్పారు. యూనియన్ పరిశ్రమల మంత్రి శ్రీ పాయిగారు కూడ సహకార సంస్థలు, యితర పారిశ్రామిక సంస్థలలో లాగ వ్యాపార పద్ధతులపై నడపిన నాడే, అవి సఫలీకృతం కాగలవని, హైదరాబాదులో చెప్పిరి. దానిలో చాల సత్యముంది.

ఇది వరలో, ఆంధ్రప్రదేశంలో లభ్యమయ్యే ఉన్ని Barrack కంబళ్లు నేయటానికి ఉపయోగపడు తుందని, మామూలు ప్రజలకు పనికి వచ్చే కంబళ్లు నేయవచ్చని వ్రాశాను. 'బ్యారక్' కంబళ్ల, రక్షణ శాఖకు సరఫరా చేస్తున్నారు. ప్రాథమిక సహకార సంఘాలు, ఒక పద్ధతి అవలంబించి సప్లయి చేసే కంబళ్లు అన్నీ ఒకే రకంగా ఉన్నవిగా ఉండేటట్లు చేయటం కాదు. దానితో మన కంబళ్లకు 'గిరాకి' తగ్గుతూంది. ఒక సంఘంలో ఉత్పత్తి అయే కంబళ్లకు, యింకో సంఘంలో ఉత్పత్తి అయే కంబళ్లకు చాల వ్యత్యాసం వుండటం వలన, ఆర్డర్లలోని నమూనాలు పాటించ మన్నారు. దానితో వర్తక సౌకర్యాలు లభించుట చాల కష్టం. కనుక మన రాష్ట్రంలో, జయప్రదంగా యీ పని చేయుటకు ఒక కేంద్ర సంస్థకు చాల అవుసరమున్నది. ఉత్పత్తి కేంద్రాలలో కూడ, సరియగు పద్ధతులు అమలు జరిగేటట్లు చేయాలి. గ్రామ సీమల నుండి ఉన్ని కొనాలి గనుక వాటిని ఒక పద్ధతి ప్రకారం కొనాలి. ఈ విషయంలో పశు పోషణ శాఖ యొక్క సహకారం చాల అవసరం.

## ఉన్ని ఉత్పత్తి కేంద్రాలు

మన రాష్ట్రంలో కరీంనగర్, మెదక్, వరంగల్, మహబూబ్‌నగర్, నల్గొండ, హైదరాబాదు, కర్నూలు, అనంతపూర్ జిల్లాల్లో ఉన్ని లభ్యమగుచున్నది. సహకార సంఘాలు కూడ యిచ్చట స్థాపింపబడ్డాయి వాటికి కావలసిన పెట్టుబడి రాష్ట్ర ప్రభుత్వం పెట్టింది. ఈ పరిశ్రమకు ఖాదీకమీషన్ సహాయం చేస్తున్నది గనుక, యిచ్చట నుండి హెచ్చు సహాయం పొందాలి. వెనుక భారత చేనేత బోర్డు వీటికి దోహద మిచ్చింది. దాని మూలముననే, మన రాష్ట్రంలో ఉన్నిపరిశ్రమ, సహకార క్షేత్రంలోనికి తేబడింది. తరువాత, ఖాదీ కమీషన్ యీ పరిశ్రమకు హెచ్చు దోహదమివ్వటం మొదలు పెట్టింది. కమీషన్ ఒక పద్ధతి ప్రకారం, రాష్ట్రప్రభుత్వ సహకారంతో యీపరిశ్రమలు అభివృద్ధి చేయాలి.

ఇది వరలో హైదరాబాదులో ఉన్ని సహకార సంస్థ 1956 లో స్థాపింపబడెనని వ్రాయబడినది. ఇప్పుడు 85 ప్రాథమిక సంస్థల సభ్యత్వముతో, యిది ప్రాథమిక సంస్థగా ఉన్నది. ఈ కేంద్ర సంస్థ రాష్ట్ర ప్రభుత్వాల నుండి, కాఫీ, టీ తోటల నుండి, రక్షణ శాఖ నుండి ఆర్డర్లు తెచ్చుచున్నది. కేంద్ర సంఘంకు ప్రభుత్వం సుమారు 20 లక్షల రూపాయలు పెట్టుబడి పెట్టింది. ఇది కొనుగోలు కేంద్రాలు కూడ స్థాపించింది. 1965 నుండీ, యీ సంఘం, నష్టాల పాలయినందున, సరిగా నడవనందున ప్రభుత్వంవారు స్వాధీనం చేసికొన్నారు. అంతేకాకుండ ప్రాథమిక ఉత్పత్తి దారులు కష్టపడకుండ ప్రభుత్వం ధన సహాయం చేసి కొనుగోలు కేంద్రాలు

స్థాపించటమేగాక, ఊలు అమ్మే విషయంలో కూడ, ఖాదీ కమీషన్ సహకారం పొందారు. వీరు కూడ, మన రాష్ట్రం నుండి ఊన్ని కొంటారు. అంతేకాదు. ఖాదీకమీషన్ వారు, కంబళ్ళు కొనటంలో రిబేటు కూడ యిస్తున్నారు.

## ఇతర ప్రాంతాలకు ఎగుమతి

మనరాష్ట్రంలో సరఫరా అయ్యే ఉన్ని ఉత్తరాది రాష్ట్రాలకు పోయి అచ్చట ఉన్ని మిల్లులో వాడబడు చున్నదని యిదివరలో వ్రాయబడినది. కంబళ్ళు పురాతన పద్ధతులతో చేతితో తీయబడిన ఊలు దారంతో నేయుచున్నారు. వాట్లకు Finishing గాని, calendering గాని లేనందున, వాటికి గిరాకీ తక్కువగా వుంది. యంత్రాలతో దారం తీస్తే మెత్తని కంబళ్ళు నేయ వచ్చునని, వాట్లకు గిరాకీ హెచ్చుగా ఉంటుందని ప్రభుత్వం మహబూబ్‌నగర్ ఉన్ని మాలు తీసే కార్ఖానా సాధించాలని 1972లో నిర్ణయించారు. దీనికి కావలసిన యంత్రసామగ్రి సుమారు 15.20 లక్షల రూపాయల విలువ గలది విదేశముల నుండి దిగుమతి చేసి కోవాలి కనుక దీనిని సాధించడానికి కొన్నిసంత్సరాలు పట్ట వచ్చు ఇంకో విషయం కూడ మనం గుర్తించాలి. పెద్ద factory కి బదులు వికేంద్రీ కరణం చేసి, చిన్న చిన్న factories (spindles) 100 వెదు రులు గలవి పెట్టిన, అవి ఉన్ని లభ్యమయే ప్రాంతాల పరిసరములలో నెలకొల్పవచ్చు. రహదారి ఖర్చులు తగ్గుతాయి. చిన్న చిన్న కార్ఖానాలు యొక్క ఆర్థిక లాభములు మనం గుర్తించాలి. యివి హెచ్చులాభ దాయకమైనచో, వీటినే నెలకొల్పిన బాగుంటుంది.

## నవీన పద్ధతుల ఆవశ్యకత

ఏదిఏట్లున్నా యీ పరిశ్రమలలో నవీన శాస్త్రిసమ్మతములైన పద్ధతులు ప్రవేశపెట్టాలి ఉత్పత్తి కేంద్రాలలో తరిఫీదు సౌకర్యాలు కలుగచేయాలి. వెనుకటి హైదరాబాదు పరిశ్రమల శాఖ, తగు సౌకర్యములు కలుగ చేసెను. Finishing Calendering units కూడా స్థాపించాలి. అప్పుడు తయారైన కంబిళ్లకు మంచి రూపువస్తుంది. రాష్ట్రప్రభుత్వం ఖాదీ కమీషన్ యీ పరిశ్రమ యందు ఎంతో ఉత్సాహం చూపుచున్నారు. మొదటి రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో, యీ పరిశ్రమ చాల అభి వృద్ధి కెక్కెను. ఉత్పత్తి దారులు కూడ ప్రభుత్వంతో సహకార భావం చూపి నాణ్యమైన సరకులు చేయాలి. వీరిలో విద్య చాల తక్కువగనుక, సహకార సంఘముల ద్వారా, వారికి తగు పరిజ్ఞానం ఉత్సాహం వచ్చేటట్లు చేయాలి. అఖిల భారత ఉన్ని బోరు రాష్ట్ర స్థాయిలో, ప్రభుత్వాధికారంలో ఉన్ని బోర్డు స్థాపించినచో, యీ పరిశ్రమ ఎంతో అభివృద్ధి పొందగలదు. ఈ పరిశ్రమకు, కుటీర పరిశ్రమలలో గొప్పస్థానం గలదు. వెనుక బడిన జాతులు యీ పరిశ్రమలలో వున్నందున, వారికి యీ పరిశ్రమ వలన ఉపాధి సౌకర్యములు కలుగు చున్నం దున యీ పరిశ్రమ యందు మనం ప్రత్యేకశ్రద్ధ తీసికోవాలి.

నిరుద్యోగసమస్య తీవ్ర రూపందాల్చున్నది. 5 వ పంచవర్ష ప్రణాళికా కాలంలో ముడిపదార్థములు దొరికే చోటనే చిన్న పరిశ్ర మలు స్థాపింప బడతాయనీ, దానితో ప్రరిశ్రమలు వికేంద్రీకృతమ వుతాయనీ యూనియన్ పరిశ్రమల మంత్రి శ్రీటి. ఎ. పాయ్ గారు, యీ మధ్య ఉన్ని పరిశ్రమల బోర్డుతో మాట్లాడుచూ చెప్పారు. ఉన్ని పరిశ్రమ వికేంద్రీకరణము వీలవుతుంది. నిజంగా లాభ కారిగా యున్నప్పుడే కేంద్రీకరణ చేయాలిగాని, లేనపుడుపరిశ్ర మలు వికేంద్రీకరణం చేయటం చాలమంచిది. అదే గాంధేయ ఆర్థిక తత్వం. గాంధీజీ చెప్పాడని మనం చేయ నక్కర లేదు. అనవసరంగా ముడిపదార్థాలు పట్టణాలకు వ్యయప్రయాసలతో తీసి కువెళ్లి వాటి నుండి తయారవ బడిన వస్తువులు తిరిగి గ్రామాలకు తెచ్చుట వలన అంత లాభం లేదు. వనరులు ఉన్నచో, వాటి మీద ఆధారపడే పరిశ్రమలు వికేంద్రీకరణ చేయటం చాల మంచిది దీనితో గ్రామసీమల నుండి ప్రజలు ఉపాధి సౌకర్యాలకు పట్టణసీమలకు తరలి రారు కనుక ఎన్ని చిన్న పరిశ్రమలు గ్రామ సీమలలో స్థాపించిన గ్రామాభివృద్ధికి తద్వారా దేశాభి వృద్ధికి తోడ్పడిన వారమయ్యేదము. ఈ సిద్ధాంతమే సంఘన్యాయానికి దారి తీస్తుంది. దీనినే Socialism in practice అనాలి.

---

# అత్తిలి పంచాయతీ

( 36 వ పేజీ నుండి )

శ్రీమతి ఎస్. బాలకుమారి అధ్యక్షతన శ్రీమతి వైట్ల సూర్యవేణి కార్యదర్శకత్వాన నిర్వహించబడే మహిళామండలి 30 పిల్లలకు ఉపయోగపడే బాలవాడీని నిర్వహిస్తున్నది. కుట్టు కేంద్రాన్ని కూడా నిర్వహించి మహిళల ఆర్థిక ప్రగతికి దోహదం చేస్తున్నది. 30 వేల రూపాయల ఖర్చుతో నిర్మించిన మహిళా మండలి భవన నిర్మణానికి అత్తిలి గ్రామ పంచాయతీ 5,000 రూపాయలు ఆర్థిక సహాయం చేసింది

1964 సంవత్సరంలో గ్రామ పంచాయతీకి సర్పంచ్‌గా ఎన్ని కైన శ్రీ మేకల వీరన్నగారి అకుంఠితదీక్ష, అభివృద్ధి కార్యక్రమాల పట్ల ఆసక్తి, పెనుమంట సమితి అధ్యక్షులు శ్రీ మంతెన భావరాజు సహకారం అత్తిలి గ్రామ పంచాయతీ విజయానికి దోహదంచేసింది. అయితే పంచాయతీరాజ్‌ను విమర్శించే విమర్శకులకు సహితం ఈ గ్రామాభివృద్ధి చరిత్రలో సువర్ణా క్షరాలతో లిఖించతగిన విధంగా చైతన్యవంతమైన శ్రీ వైట్ల బాపన్నలాంటి విజ్ఞతకలిగిన వారి సేవలను ఎవరైనా ప్రశంసించ కుండా ఉండలేరు. 1950-53 సంవత్సరంలో అత్తిలి గ్రామ పంచా యతీకి అధ్యక్షులుగా పనిజేసి ఈ నాడు ఏ పదవి లేకపోయినా స్వచ్ఛందంగా పనిజేస్తూ అత్తిలి గ్రామపంచాయతీని ఉత్తమమార్గాన పయనించేలా కృషి చేసిన ఆదర్శ సాంఘిక సేవా కార్యకర్త శ్రీవైట్ల బాపన్నలాంటి కార్యకర్తలు ఊరికి ఒకరుండేచాలు. సమాజవికాస కుసుమాల సౌరభాలు గుబాళిస్తాయి ప్రతీ ఊరూ ఒక ఉత్తమ పంచా యతీగా రూపొందుతుంది.

# వందేమాతరం

— ముదిగొండ వీరభద్రమూర్తి

జరుగుచుండె సామి పనుదెంచె దౌలత
రావు నాము డంతరంగు డొకడు
అన్న వింటి నిన్న నద్భుతోపన్యాస
మనుచు ఫాడ్కె కటుల నతడు చెప్పె

అవిరళ పూర్ణ సార్వజనికాఖ్యసభా ఘనానంతరమ్మునన్
జెవియె శరీర మౌ ప్రజకు జెప్పె నిటుల్ మహితుండు రానడే
వివిధములైన లోపముల వెప్పడు తప వు నెట్టి యేర్పడిన్
సవురగు పద్ధతిన్ దెలిపి సద్ది జేయవలెన్ మహాజనుల్ !

చక్కని సాంఘిక స్థితికి సాయము జేయును రాజకీయపున్
హక్కులు, వీని వాడుకొను స్వస్థత కల్గదు హేతుబద్ధమై
చక్కటిమై పౌసంగకయ సంఘవికాసము దీని పాదు స
మ్యక్కృత బుద్ధి యీ కలిమికై ప్రజ కావలె సజ్జనుల్ సుమా!

పూసంగవచ్చు మహానేతృబిరుదమ్ము
కొందఱో యందఱో కొలిచి నడువ
పడయవచ్చును మహోపాధ్యాయబిరుదమ్ము
శకలమో సకలమో చదివి చదువ
వేడవచ్చును మహావేదాంతిబిరుద మ
ద్వైతమో ద్వైతమో బహు కథింప
నందుకోవచ్చు మహాకవి బిరుదమ్ము
నజ్ఞులో విజ్ఞులో యాదరింప

సజ్జనుం డను బిరుదమ్ము సంతరించు
కొనుట దుర్ఘట మిద్దాని కొలిచి యొసగు
విద్య లేదు ప్రమశిక్షణ వృత్తి దక్క
చంద్రబింబ మీ బిరుదమ్ము కాంతి రేయి

సవతితల్లి నెనరు చాటుచున్నది మన
పై ప్రభుత్వ మంచు బలుకువాడు
తోడివారి నంట నోడి పంచములంచు
పలుకు తమరి నెనరు తెలుపవలయు

కూటికిం బేద యయినను గులమునకును
బేద యౌనే? మతమ్మున భేద మైన
మానవత్వమ్మునం భేద మౌనె నడుమ
గుర్తెఱిగి సర్వసమబుద్ధి వర్తిలవలె

సార్వజనిక సమాజ పక్షమున మూడు
నెలల కొకసారి పత్రిక వెలువడు బ్రిజ
లార! పంపుడు వ్యాసములను ప్రభుత్వ
శాసనగ్రస్తదోష నిరాసములను

పన్ను చెల్లింపు నెవ డైదుపదులు రూక
లట్టి వాడు శాసన సభాభ్యర్థి నెన్ను
కొనగ నర్హు డీ రీతి వాకొంటి నేను
దొరతనము నిర్ణయ మ్మేమొ యరతువలయు

చదువు కుటీపరిశ్రమము జానపదాళికి నేర్పుచున్ ఋణ
ప్రదధనశాలల న్నిలిపి పన్నులు తక్కువ సేసి భూమిపై
బదవి యెలర్ప మండలసభాపురసంఘములన్ స్వపాలనా
స్పదములుగా బ్రజన్ దెలిపి సౌఖ్య మిడం బ్రభుతన్
గథించితిన్

లండనులో లిబరలు ప
ఖండజరాజ మ్మొకండు కల దయ్యదె యై
ర్లండునకు నెపుడొ భారత
ఖండమునకు నప్పుడె పెట్టు గనకపుగ్రుడ్లన్

అమరుచుకొన్నవీలుబడి బ్రాప్తికొలంది సరస్వతీ కటా
క్షమునకు బాత్ర మై సకలసంతతి ధైర్యగుణమ్ము ఛత్రమై
శమితపురోభివృద్ధి యగు శాసనమున్ సవరింప జేసికొం
చు మనత ! రాణిపెత్తనముపొంపున హక్కుల నోలి
బొందుచున్

ఈ యధికార మందుటకు నెవ్వ రొనర్చిరి హూణజాతికిన్
సాయము ? రాజకీయమతసాంఘికపద్ధతు లెన్నొ యెన్నొ జా
తీయసమైక్యభూషణమతిన్ గని మార్చుకొనన్ దమంతతా
మే యయి రింతవార లెవరే నటు లౌదురు సంఘసంస్కృ
తిన్

భౌతిక మెల్లి కల్ల కలవంటి ద టంచు వచించువారలన్
ఖాతరుసేయ కన్నిటను గండరగండడు హూణు డయ్యె మా
యాతిమిరమ్ముక్రమ్మి మన యక్షులు రెండు కబోదిపక్షులై
చేతులు ప్రేలవేసితి మిసీ! ఘనసంపద యెంత యున్ననున్

గుబురుమీసము గాంభీర్యగుణముగనులు
కనులు శాంతిమానసవదానవము తనర
క్రౌర్య మెఱుగని పులి యన గానుపించు
రానడే పల్కె చప్పట్లలోన నిట్లు.

విద్య రాజకీయవిజ్ఞానదాయి కా
వలయు మతముచేత బట్టు వడక
యెల్లి పల్లెటూళ్ల నింటింట నిట్టిది
మలయ పవనరీతి మలయవలయు

మతసంఛన్నము పాలన మ్మయిన యా మార్గాదెపో! దుర్దిన
స్థితి వర్ధిల్లిన దంతె కాని రవిరశ్మివ్రాత మంభోదమా
ర్జితమైనప్పటినుండి కాదు ప్రజలం బ్రేరేచుటల్ కాదు నీ
గతి భాషించి నిరీశ్వరత్వమున సంఘజ్యోత్స్న కాయించుటల్

మత మని రాజకీయ మని మానిసిమేలున కైన నివ్వి రెం
డు తగులరాదు తద్దినములున్ శుభకార్య మటుల్ పరస్పర
మ్ము తనువు పోగ జీవునకు ఋణ్యము గూర్చున దొండు
స్వేచ్ఛమై
బ్రతుకగ జేయు నొండు నిరపాయము మానవధర్మమూలమై

దేవుడు పల్కెనట్టిది యిదే మత మింకొక టెద్దియేని ని
ర్జీవ మ టంచు భేదములు చెప్పెడి వానిని రెండు జానుగుల్
పీవన లట్టు తాపి మెలివేయుడి యంటగరాని వా డొకం
డీ వసుధన్ గలండనిన నెవ్వనినేన్ వెలివేయుడీ ప్రజల్!

రెండువేలయిర్వది యేండ్లు క్రీస్తుమతము
పుట్టి పదునాల్గు నూఱులు పోవ నిరువ
దేండ్లుయిస్లాము హైందవ మిలయు నొక్క
వయసు వని రొమ్మువిఱుచుకొంట యలుచపని

మత జాతి వర్ణభేద
త్రితయంబె మలత్రయంబు దీని వలన బా
ధితులము మనము పరునిచే
మతి వర్ధనులార! దౌష్ట్యమర్దనులారా!



# గుత్తి దుర్గము

శ్రీ బత్తుల వెంకటరామిరెడ్డి

ఆంధ్రప్రదేశమునందు చరిత్ర ప్రసిద్ధి చెందిన అతి ప్రాచీన దుర్గములలో అనంతపుర మండలమునగల గుత్తిదుర్గము ప్రసిద్ధి కెక్కినది. సముద్ర మట్టమునకు 640 మీటర్ల ఎత్తున, పరిసరములకు 303 మీటర్ల ఎత్తునగల పర్వతముపై, మూడువైపుల నుండు కొండల మధ్య లోయలో కట్టబడిన పురాతన నగరమును కలుపుకొని, ఇరువైపులనుండు గుట్టలను చుట్టుకొని ఎత్తులో నాలుగు మీటర్లకు వెడల్పులో 2 మీటర్లకు మించిన బలిష్టమైన రాతికట్టడపు ప్రాకార కుడ్యాలతో, లెక్కకు మించిన వృత్తాకారపు కోట బురుజులతో, శత్రుదుర్భేద్యముగా నిర్మింపబడిన ఈ దుర్గం నేటికీ చెక్కుచెదరక చూపరులకు దాదాపు 30—35 కిలోమీటర్ల దూరమునుండియే దర్శనమిచ్చుచుండును.

గౌతమపురి అను పేరుగల ఈ దుర్గము వెలుపలనుండి చూచువారలకు ఒక 'పూవుగుత్తి' ఆకారమున కన్పించుచున్నందు వలన "గుత్తి" అను నామాంతరము చెందినట్లు తోచుచున్నది.

కోటగోడకు వెలుపల పూర్వం ఉండిన కందకంస్థానములో నేడొక కోనేరువంటి బావి గలదు. దానిని దాటిన తరువాత, కోట రక్షకుడగు నగరేశ్వరస్వామి దేవాలయము కలదు. ఇచటి నుండియే కోట లోపలకు ప్రవేశము ప్రారంభమగుచున్నది. కోట పైభాగమునకు చేరుకొనుటకు 15 ముఖద్వారములను దాటి వెళ్ళవలెను. కోటలో ప్రవేశమునకు ఈ మార్గముతప్ప వేరు త్రోవలేదు. మొదటి ద్వారమునుండి శిఖరము వరకు మెలికలు తిరుగుచు వెళ్ళు రాచబాట నేటికీ చెక్కుచెదరక దృఢముగా ఉన్నది. కోట ఆక్రమణకు వచ్చే సైన్యాన్ని ఎక్కడికక్కడే నిలిపివేయడానికై కొండ చరియల్లో సైనిక దళాలను నిలిపియుంచే ఏర్పాట్లు, శత్రువులపై కోట బురుజుల మీదినుంచి, పెద్ద పెద్ద రాళ్ళు దొర్లించే ఏర్పాట్లు చేసిన గుర్తులు కనిపించుచున్నవి. మొదటి రెండు ద్వారములను దాటిన పిమ్మట సైనికుల కవాతు కొరకు విశాలమైన మైదానము, ఏనుగులు, గుఱ్ఱములశాలలు, వ్యాయామశాలలు కనిపించును.

అచ్చటినుండి మరికొన్ని ద్వారములు దాటిన ముఖ్య ఉద్యోగులు, రాజబంధువులు నివసించుటకు నిర్మింపబడిన గృహముల ఆనవాళ్ళు కలవు. సామాన్య ప్రజలు లోయలో కట్టబడిన పురాతన నగరమునందే నివసించుచుండెడివారు మరికొన్ని ద్వారములు దాటిన తర్వాత రాజకీయ ఖైదీలను ఉంచుటకు ఉపయోగింపబడిన చీకటి గుహ (నేలమాళిగ) కనిపించును. కొండ పైభాగమున స్వచ్ఛమైన మంచినీటి బావులు కూడా కలవు. ఎట్టి క్షామపరిస్థితులలోనైనను వాటిలో నీరు నిలువ యుండును. ఇంత ఎత్తులో మంచినీటి ఊట ఉండటం ఆశ్చర్యకరమైన విషయము. 15 ద్వారములు దాటి దుర్గం పైభాగమునకు చేరిన సుందరమైన చిన్న మంటపము కనిపించును. దానిని ఇప్పటివారు "బోగందాని మహలు" అని పిలుచుచుందురు. ఈ మంటపము సమీపముననే మురారిరాయుని పీఠమనుపేర పెద్ద గద్దె గలదు. అచ్చటనుండి చూచిన చుట్టూ ఆహ్లాదకరములైన ప్రకృతి దృశ్యములు అనేకము కనిపించును. దాని ఎదుట సభా భవనమను మంటపము, దాని ఎదుట మంచినీటి కోనేరు కలవు. 'విల్స్' అను చిత్రకారుడు ఈ దుర్గమును పరిశీలించి 'క్షామము, మోసము' ఇవి రెండు మాత్రమే ఈ దుర్గమును లొంగదీయగలవు అని వ్రాసినాడు.

## దుర్గ నిర్మాణము

దుర్గ కుడ్యాలపై హాళె, కన్నడ భాషలలో లిఖింపబడిన శాసనములనుబట్టి క్రీ. శ. 10వ శతాబ్దమునకు పూర్వమే ఈ దుర్గము నిర్మాణమైయున్నట్లు తెలియుచున్నది. క్రీ. శ. 973లో నివసించియుండిన రెండవ నరసింహుడనే గంగ వంశపు రాజు "గుత్తి గంగరాజు" నని సగర్వముగా చాటుకొన్నాడు. పశ్చిమ చాళుక్యరాజైన ఆరవ విక్రమాదిత్యుడనే బిరుదు వహించిన త్రిభువన మల్లునకు కూడా దీనితో కొంత సంబంధమున్నట్లు తెలియుచున్నది. 12—13వ శతాబ్దములలో నివసించియుండిన హోయసల రాజైన రెండవ వీరభల్లాలుడు దీనిని జయించినట్లు తెలియుచున్నది. ఈ కొండపై స్రగ్ధరావృత్తములోనుండు ఒక సంస్కృత శ్లోకమును బట్టి విజయనగర రాజ్య స్థాపకులలో ఒకడైన బుక్కరాయలు గుత్తిని రాజధానిగా చేసుకొని అనంతపుర మండలమును పాలించినట్లు తెలియుచున్నది.

శ్రీకృష్ణదేవరాయలు పూర్వం దిగ్విజయ యాత్రకు వెడలునపుడు మహామాత్యులైన తిమ్మరుసులవారు గుత్తి దుర్గాధ్యక్షుడుగా ఉండిన తన సోదరుడు గోవిందరాజ దండనాథుని విజయనగరాధ్యక్షునిగా నియమించి, తన మూడవ మేనల్లుడైన గోపనమంత్రిని గుత్తి దుర్గాధ్యక్షునిగా నియమించినట్లు కీ. శే. చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు "తిమ్మరుసుమంత్రి" అను గ్రంథమున వ్రాసినారు అందుకు ఉదాహరణముగా రాజశేఖర చరిత్రము నుండి ఒక పద్యమును పేర్కొన్నారు.

(తరువాయి 64వ పేజీలో)

# మహాభారతము

## శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 89

"ఆ బ్రాహ్మణుడు బయటకు వెడలునప్పుడు 'ప్రాతఃకాలమున వచ్చెదను' అని చెప్పి, సాయంకాలముననో, రాత్రియో వచ్చుచుండెను. ఆకన్యక అతనిని అన్ని వేళలందును భక్ష్య భోజ్య-శయ్యా ఆసనాములచేత, పూర్వముకంటె ఎక్కువగా పూజించు చుండెను. ఈ సత్కారములన్నియు దినదినాభివృద్ధిగా అధికముగానే చేయుచుండెను, ఆ బ్రాహ్మణుడు ధిక్కరించినను, మాటి మాటికి దోషారోపణము చేసినను, తరచుగా కఠినవచనములు పలికినను ఆ కన్యక, ఆయనకు ఎప్పుడు గూడ అప్రియముగా వ్యవహరించక యుండెను.

"పృథా దేవి యితర కార్యములయందు ఊపిరి సలుపరాకుండ నిమగ్నురాలై యున్నప్పుడు, ఆ బ్రాహ్మణుడు తలవనితలంపుగా ఇంటికి వచ్చుచుండును. ఒక్కొక్కప్పుడు ఎన్నియో దినములవరకు గూడ రాకుండనే యుండును, ఒకప్పుడు అకస్మాత్తుగా వచ్చి, అప్పుడు అత్యంత దుర్లభమైన ఆహారమును కోరుచుండును, అట్టి వస్తువును గూడ ఆమె, అంతకు ముందే సిద్ధపరచియుంచిన దానివలె వెంటనే తెచ్చి సమర్పించు చుండును. ఈ విధముగా పృథాదేవి యా బ్రాహ్మణునకు శిష్యుడువలె,పుత్రుడువలె చెల్లెలువలెనే అత్యంత నియమ పూర్వకముగా అతని సేవలో నిమగ్నురాలై యుండెను. ఆమె ఆయనకు సుఖము, ఆనందము కలుగునట్లుగా మెలగి ప్రీతిని కలిగించెను.

పృథాదేవి యొక్క సుస్వభావము చేతను, సత్ప్రవర్తన చేతను, జాగరూకతచేతను ఆ బ్రాహ్మణుడు మిగుల సంతోషించెను. ఆమె అంతకన్న ఎక్కువ సేవచేసి ఆయనను సంతోష పరచుటకు ప్రయత్నించుచుండెను.

"ఇట్లు సేవించుచున్న పుత్రిని, కుంతిభోజుడు ప్రతిదినము ఉదయ సాయంకాలములయందు "పుత్రీ ! నీ సేవచేత బ్రాహ్మణుడు సంతుష్టుడైయున్నాడా"? అని ప్రశ్నించు చుండెను, దాని కామె 'ఔను తండ్రీ ! ఆయన ప్రసన్నుడుగా నున్నాడు' అని ఉత్తరము చెప్పుచుండెను. ఆ మాట విని కుంతిభోజుడు మిక్కిలి ప్రీతిజెందు చుండెను.

"ఇట్లు ఒక సంవత్సరము పూర్తిగా పృథాదేవి యా బ్రాహ్మణునకు సేవ చేసెను. ఆయనకు ఆమెయందు ఏవిధమైన లోపము కనబడలేదు. ఆమె యెడల మైత్రీ భావము ఏర్పడెను. ప్రీతితో ఆమెను చూచి, 'మంగళకరురాలా! నీయెడల నాకు చాల ప్రీతి కలిగెను. నీ సేవకు సంతుష్టుడనైతిని. ఈలోకము నందు మనుష్యులకు దుర్లభములైన వరములను గూడ నీకు ఇచ్చెదను. నీకు ఇష్టము వచ్చినవి కోరుకొనుము. ఆ వరప్రభావము వలన గలిగిన కీర్తి చేత నీవు ఈ లోకమునందలి స్త్రీలందరి కన్న మిన్నగా శోభిల్లెదవు' ఆ మాటలు విని కుంతీదేవి బ్రాహ్మణునితో 'విప్రోత్తమా ! మీ సేవకురాలైన నాయందు, మీరు, మా తండ్రిగారు ప్రసన్నులైతిరి. అంతటితో నాకోర్కెలన్నియు నిండినవి. ఇతర వరములు నాకు అక్కరలేదు" అని చెప్పెను ఆమాట విని బ్రాహ్మణుడు కుంతితో నిట్లనెను :

### కుంతికి వరప్రదానము

"మంగళకరురాలా! నావలన నీవు వర మేదియు కోరకున్నప్పటికిని, దేవతలను ఆహ్వానించుటకు యోగ్యమైన యీ మంత్రమును నీకిచ్చెదను. తీసికొనుము. ఈ మంత్రమును జపించి నీవు ఏయే దేవుని కోరి ఆహ్వానించెదవో, ఆయా దేవుడు నీకు ప్రత్యక్షమై నీ వశమునందు ఉండగలడు. అతనికి ఇష్టమున్నను, లేకున్నను, అతడు నీకు వశపడును. ఈ మంత్రముచేత ఆదేవుడు శాంతుడై నీకు భృత్యునివలె వినతుడై నీకడ మెలగును.

"ఇట్లు చెప్పిన ఆ బ్రాహ్మణుని కుంతీదేవి, అతడు శాపమిచ్చునను భయముచేత, రెండవసారి నిరాకరించజాలక పోయెను. తరువాత ఆ బ్రాహ్మణోత్తముడు, అధర్వవేదోపనిషత్తు నందుగల మంత్రరాజములను కుంతీదేవికి ఇచ్చెను. అట్లు మంత్రోపదేశము చేసి యా బ్రాహ్మణుడు కుంతి భోజునితో 'రాజా ! నీయింటియందు సుఖముగా నివసించితిని. నీపుత్రిసేవలకు మిగుల సంతుష్టుడనైతిని. నీయింటియందు నేను సర్వదా ఆదరింప బడుచు, పూజింప బడుచు నుంటిని. ఇక నేను పోయెదను.' అని అంతర్ధానము చెందెను. అక్కడనే అంతర్హితుడైన ( సంస్కృత భారతము

నందు వ్యాసమహాముని, యీసందర్భమునందు, ఎక్కడ గూడా 'దుర్వాసుడు' అని వ్రాయలేదు. అంతటను, బ్రాహ్మణు డనియే వ్రాసెను.) ఆ బ్రాహ్మణుని చూచి కుంతిభోజుడు మిక్కిలి ఆశ్చర్యమును చెంది, పృథాదేవిని మిగుల ఆదరించి సత్కరించెను" ఇట్లు చెప్పి వైశంపాయన మహాముని జనమేజయునితో నిట్లనెను:—

## కుంతీ సూర్యుల సంవాదము

"జనమేజయా! ఆబ్రాహ్మణుడు అంతర్హితుడైన తరువాత కుంతీదేవి ఏదోయొక కారణముగా, తనకు లభించిన మంత్రము యొక్క ప్రభావమును తెలిసి కొనగోరి చింతించు చుండెను. ఇంతలో ఆమె శరీరమునందు 'ఋతువు' అకస్మాత్తుగా కలిగెను. కన్యకగా నున్నప్పుడే యామె 'రజస్వల' అయినందుకు చాల సిగ్గు పడెను. అప్పుడామె మేడపై అమూల్యమైన శయ్యపైన ఉండి తూర్పు దిక్కునందు పట్టుచున్న సూర్యమండలమును చూచెను. అప్పుడేఉదయించుచున్న సూర్యునివలన ఆమెకు ఏలాటి తాపమున్ను కలుగలేదు. ఆమె మనస్సు, నేత్రములు ఆ సూర్య మండలము నందే ఆసక్తములై యుండెను.

"అప్పుడామెకు దివ్యదృష్టి వచ్చెను. దీప్తిమంతమైన దర్శనమిచ్చుచుకవచమును, కుండలములను ధరించియున్న దేవుని ఆమెచూచెను. అప్పుడామెకు బ్రాహ్మణదత్తమైన మంత్రమునందు కౌతూహలము పుట్టెను. వెంటనే ఆమె, ఆచమన ప్రాణాయామములు చేసి సూర్యుని ఆహ్వానించెను. అతిత్వరలో సూర్యదేవుడు ఆమెకడకు వచ్చెను. ఆ దేవుని శరీరకాంతి తేనెవంటి పచ్చని వర్ణముగలదై యుండెను. అతడు ఆజానుబాహుడు, శంఖము వంటి కంఠముగలవాడై నవ్వుచున్నట్లుగా నుండెను. భుజకీర్తులను, కిరీటమును ధరించి అన్ని దిక్కులను ప్రకాశింప జేయుచు నుండెను. సూర్యుడు తన యోగ మహిమచేత శరీరమును రెండుగా జేసెను. ఒకదానిచేత ప్రపంచమునకు ప్రకాశము నిచ్చుచుండెను. రెండవ శరీరముచేత కుంతీదేవి వద్దకు వచ్చెను. అప్పుడు కుంతీ దేవికి సూర్యునకు ఇట్లు సంవాదము జరిగెను:—

**సూర్యుడు**:— రాజకుమారీ! నీ మంత్రబలముచేత వచ్చితిని. నీకు వశుడనైతిని. నీవుచేయుమనిన కార్యము చేసెదను. చెప్పుము.

**కుంతి**:— భగవన్! నేను కౌతూహలముచేత నిన్ను ఆహ్వానించితిని. ప్రసన్నుడవై నీవు వచ్చినచోటికే పొమ్ము.

**సూర్యుడు**:— నీవు చెప్పినట్లుగానే పోయెదను. కాని ఒక దేవుని పిలిచి వ్యర్థముగా అతనిని తిరిగిపొమ్మనుట న్యాయముకాదు. మంగళకరురాలా! సూర్యునివలన పుత్రుని కనవలెనని నీ మనోభావము ఉండెను. ఆ పుత్రుడు లోకమునందు అసమాన వీర్యము కలవాడై, కవచకుండలములను ధరించి యుండవలెనని కోరితివి. కనుక నీవిప్పుడు నీ శరీరమును నాకు అర్పించుము. నీ సంకల్ప ప్రకారము నీకు పుత్రుడు జనించగలడు. ఇది నాకు ప్రియము. ఈ ప్రకారము నీవు నడచుకొనకున్నచో ఇప్పుడే నిన్ను, నీ తండ్రిని, నీకు మంత్రము నిచ్చిన ఆ బ్రాహ్మణుని, క్రోధముచేత శపించెదను. నీ యీ యన్యాయ కార్యమును తెలిసికొనలేకుండ నున్న నీ తండ్రిని, నీ శీలమును, ప్రవర్తనను తెలియక నీకు ఈ మంత్రమును ఉపదేశించిన యా బ్రాహ్మణుని దహించెదను. దానికి నీవే కారణము. ఇంద్రాది దేవతలు ఆకాశము నందుఉండి, నీచేత మోసపోయిన నన్ను నవ్వుచు చూచుచున్నారు. ఆకాశమునందు నిలిచియున్న దేవతలను, ఇంతకు పూర్వమే నన్ను మోసగించుటకు నీకు ఇచ్చిన దివ్య దృష్టితో చూడుము"

"ఆ తరువాత కుంతీదేవి ఆకాశమునందున్న దేవగణములను దివ్యదృష్టి బలముచేత చూచెను. వారందరు ఆకాశమునందు తమ తమ విమానములయందు కూర్చునియుండిరి. సహస్రకిరణుడై, అత్యంత దీప్తిమంతుడైన సూర్యునివలెనే వారందరు ప్రకాశించు చుండిరి. వారినిచూచి కుంతికి చాలా సిగ్గు గలిగెను. ఆమె భయపడి సూర్యునితో నిట్లనెను:—

"సూర్యదేవా! నీవు తిరిగి నీ విమానమునందు వెడలి పొమ్ము. నేను బాలికనగుటచేత నిన్ను పిలిచి, దుఃఖదాయకమైన యీ యపకారమును నీకు చేసినాను. నా తల్లిదండ్రులకు, నా పెద్దలకే నా శరీరమునందు అధికారముకలదు. కన్యధర్మమునకు లోపము రానీయను. స్త్రీలు తమ శరీరములను పవిత్రముగా నుంచు కొనుటయే ముఖ్యము. అట్లుండినపుడే లోకులకు వారి సత్ప్రవర్తన పట్ల పూజ్యభావము కలుగును. భగవన్! మంత్రబలము పరీక్షించుటకే నిన్ను పిలిచితిని. ఇది బాల్య చేష్టచేత చేసినపని. బాలికయని నన్ను క్షమించుము.' ఆ మాటలకు సూర్యుడిట్లనెను:—

"కుంతీ! నీవు బాలికవనియే నీయందు ఇంత ఓర్పును చూపుచున్నాను. అన్య స్త్రీ యైనచో నిట్టి ఓర్పు చూపెడివాడను కాను. నీ శరీరమును నాకు అర్పించుము. అట్లు చేసినప్పుడే నీకు శాంతి లభించగలదు. మంత్రబలముచేత పిలువబడిన నాతో కలియకుండుట నీకు యుక్తముకాదు. అట్టి పిలుపు వ్యర్థముకాకూడదు. నేనువ్యర్థముగా వచ్చిపోవుటగూడ ఉచితముకాదు. నేను ఈ విధముగానే తిరిగి పోయినచో ప్రపంచమునందు అందరునన్ను పరిహసించెదరు. దేవతలందరి దృష్టిలో నేను నింద్యుడనయ్యెదను. కనుక నాతో సమాగమము చేయుము. నావంటి కొడుకును కనెదవు. సమస్తలోకములందలి స్త్రీలకన్న నీవు విశిష్టురాలవయ్యెదవు. సందేహములేదు."

## కుంతీదేవి గర్భధారణము

"ఆ కన్యక సూర్యునకు అనేకవిధముల చెప్పియు అతనిని శాంతపరచజాలకపోయెను. ఇట్లు సూర్యుని నిరాకరించజాలక యామె మనస్సునందేయిట్లు చింతించెను:—

"నిరపరాధుడైన నా తండ్రికి, బ్రాహ్మణునకు నా కారణముగా కోపించిన సూర్యుడు శాపమిచ్చును. అట్లు సంభవించకుండుటకు ఏ యుపాయముకలదు? బాలుడైనప్పటికిని తనపాప కార్యములను మోహవశుడై, తేజస్సు, తపస్సుగలవారిదాక పోనీయగూడదు. కాని నేను మిక్కిలి భయపడి సూర్యునిచేతిలో చిక్కు

కొని. నా శరీరము నతనికర్పించునంతటి యకార్యమునేనెట్లు చేయుదును?' ఇట్లు తలపోసి కుంతీదేవి శాపభయముచేత అనేకవిధములుగా చింతించుచుండెను. మోహము ఆమె అవయవములన్నిట వ్యాపింపబడి యుండెను మాటిమాటికి ఆశ్చర్యపడుచుండెను. ఒకవైపు శాపభయము, మరియొకవైపు. ఆమె బంధువుల భయము ఆమెను చుట్టుముట్టియుండెను జనమేజయ మహారాజా! అట్టి యీయవస్థలోచిక్కుకొని ఆమెలజ్జచేత వికలురాలై సూర్యునితో నిట్లుచెప్పసాగెను"

"దేవా! నా తల్లిదండ్రులు, ఇతర బంధువులు జీవించి యున్నారు. వారు బ్రతికి యుండగా నాకు శాస్త్రీయ విధిలోప మేర్పడగూడదు. నీ సంగమము నాకుధర్మహీనమైన యెడల, నా కారణముగా ఈ కులముయొక్క కీర్తి లోకమునందు నశించును. లేక, నన్ను నీకు నా బంధువులు ఇవ్వకుండనే నేను నీ సంగమమునకు అంగీకరించుట ధర్మసమ్మతమేయని నీవు తలచినయెడల. నీ యిష్టము నెరవేర్చెదను. దేహధారుల ధర్మము, కీర్తి, ఆయుష్యము ఇవన్నియు నీయందే ప్రతిష్టితములై యున్నవి. నన్ను నీకు అర్పించుకొనిన తరువాత నా పాతివ్రత్య ధర్మము నిలువ గలుగునా? నేను పతివ్రతగా ఉండగలుగుదునా?" ఆ మాటలు విని సూర్యుడామెతో నిట్లనెను —

"కుంతీ! నీకు శుభమగుగాక. నా మాట వినుము. నీతల్లిదండ్రులు, గురుజనులు, బంధువులు ఈ కార్యమునుండి నిన్ను అడ్డగించుటకు సమర్థులు కాజాలరు. భామినీ! 'కమ్' అను ధాతువునకు, '(ఇచ్చవచ్చిన యెవరినైనను) కామించవచ్చు'నని యర్థము స్వయం వరమునకు వచ్చిన వరులందరిలో, తనకు ఇచ్చవచ్చిన వరుని స్వాతంత్ర్యముతో వరించవచ్చును. అట్టి 'కమ్' ధాతువు నుండి పుట్టినదే 'కన్యా' శబ్దము కనుకనే ప్రపంచమునందు, అవివాహితకు 'కన్య' యనిపేరు. నాతో సమాగమముచేయుట నీకు ఎంతమాత్రము అధర్మముకాదు. ఎందుకనగా, నేను లౌకిక కామనకు వశుడనై యెప్పుడైనను అధర్మముచేయుదునా?

"నేను ప్రపంచమునందలి స్త్రీ పురుషులందరి కర్మలకు సాక్షీ భూతుడను. కనుక అందరుగూడ నాకు ఆవరణ (కప్పు) రహితులు (నగ్నులు)గానే యుందురు. లోకుల శరీరములకు అమర్చబడు వస్త్రభూషణాద్యలంకారములన్నియు నాయెడల స్వాభావికములు కావు. అవి ప్రాకృతులైన మనుష్యులు కల్పించుకొను వికారములే యగును. కనుక నీవు నాతో సంగమముచేసినప్పటికిని. నీ కన్యత్వమునకు భంగము కలుగదు నీవు కన్యగానేయుందువు. నా వలన నీకు మహాబాహుబలశాలియై, గొప్పకీర్తిమంతుడైన పుత్రుడు పుట్టగలడు". ఇట్లుసూర్యుడు చెప్పిన తరువాత వారిరువురకు ఈ క్రింది విధముగా సంవాదము జరిగెను: —

కుంతి:— సర్వాంధకారముల పోగొట్టు భగవానుడా! నీ వలన నాకు పుత్రుడు పుట్టిన యెడల, ఆ పుత్రుడు సహజములైన కవచ-కుండలములు ధరించినవాడుగను, మహాబాహుబల పరాక్రమసంపన్నుడుగను పుట్టవలెను.

సూర్యుడు :—మంగళకరురాలా! నీవు కోరినట్లే ఆ పుత్రుడు బాహుబలశాలియు, కుండలములు—దివ్యకవచము ధరించినవాడుగను పుట్టగలడు. ఆ కవచకుండలములు 'అమృతమయములు' (అమృతమునుండి పుట్టినవి—మరణము కలుగనీయనివి) గా నుండును

కుంతి :—భగవన్! నీకు నానుండి పుట్టబోవు పుత్రునకు అమృతమయములైన సహజ కవచకుండలములు ఉండునెడల, నీవు కవచకుండలములను ధరించియే నాతో సంగమము చేయుము. నీ వీర్యమునుండి పుట్టబోవు నా కొడుకు నీతో సమానమైన ధైర్య-వీర్య-రూప-ధర్మ—తేజస్సులు గలవాడుగా నుండవలెను.

సూర్యుడు :—శోభనాంగీ! నా తల్లియైన 'అదితి' నాకు ఇచ్చిన కుండలములను, కవచమును ఈ నీపుత్రునకు ఇచ్చెదను.

కుంతి:—భగవన్! నీవు చెప్పినలక్షణములతో నాకు పుత్రుడు కలుగబోవునెడల, నేను నీతో మిక్కిలి సంతోషముతో సంగమము చేసెదను "

" ఇట్లు కుంతి చెప్పిన మాటలకు సూర్యుడు 'తథాస్తు' అని, తన యోగ రూపముతో కుంతీదేవి శరీరమునందు ప్రవేశించి, ఆమె నాభిని తాకెను. ఆ తేజస్సుచేత కుంతి చాల భయపడి, అవయవములు వశముదప్పి. మూర్ఛిల్లి శయ్యపైనపడెను. ఆమెతో అపుడు సూర్యుడు, 'సుందరీ, సమస్త శస్త్రధారులలో శ్రేష్ఠుడైన పుత్రుని కనెదవు. నీవు కన్యవుగానే యుండగలవు. ఇక నేను నా కార్యమును సాధించెదను' అని చెప్పెను. ఆ మాటకు కుంతి మిక్కిలి సిగ్గుపడి సూర్యునితో 'అట్లే యగుగాక' యని చెప్పెను.

" ఇట్లు చెప్పి కుంతీ దేవి పుత్రునికొరకు సూర్యుని ప్రార్థించుచు, మిగుల లజ్జచెంది, మోహవశురాలయి విరువబడిన లతవలె ఆ పవిత్ర శయ్యపైనపడెను. ఆ తరువాత సూర్యభగవానుడు ఆమెను తన తేజస్సుచేత మోహితురాలిగాచేసి, యోగశక్తిద్వారా కుంతియందు ప్రవేశించి, తేజోమయమయిన తన వీర్యమును ఆమె గర్భమునందు స్థాపించెను. సూర్యుడు కుంతీదేవిని దూషితురాలిని చేయలేదు. ఆమె కన్యాత్వము చెడకుండ నుండెను. ఆ తరువాత కుంతీదేవి మూర్ఛనుండి తేరుకొనెను" ఇట్లు వైశంపాయనుడు జనమేజయ మహారాజునకుచెప్పి తరువాతి వృత్తాంతమునిట్లు చెప్పదొడగెను. (సశేషం)

దారిద్ర్యాన్ని పారద్రోలటానికి ఒక్కటే "మ్యాజిక్" వుంది. ఏమిటంటే, సరియైన దృక్పథంతో కూడిన కృషి, దృఢనిశ్చయం, ఏమాత్రం చెదరని క్రమశిక్షణ.

—ఇందిరా గాంధీ

# రాజధాని విశేషాలు

శ్రీ తిరుమల రామచంద్ర

హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ 34 లక్షల రూపాయల వ్యయంతో నిర్మించనున్న మార్కెటు భవనాలకు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు జూన్ 2 వ తేదీన శంకుస్థాపన చేశారు. మునిసిపల్ వ్యవహారాల మంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడు ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించారు. ఈ నిర్మాణంతో పండ్ల వ్యాపారస్థులు ఇకమీద వీధి మధ్యన తమ వస్తువులు అమ్మే బాధ తొలగి రద్దీ తగ్గి ప్రమాదాలు తొలగిపోయి, రాకపోకలకు అవరోధాలు వుండవు. షట్ సూత్ర ప్రణాళిక క్రింద నిర్మించే ఈ మూడంతస్తుల మార్కెట్‌లో కింది అంతస్తులో ఆ పండ్ల దుకాణాలకు వసతి వుంటుందని, ఈ భాగం త్వరలో పూర్తవుతుందని, తక్కిన అంతస్తులు 16 నెలలలో పూర్తవుతాయని మునిసిపల్ కార్పొరేషన్ ప్రత్యేకాధికారి శ్రీ నరేంద్ర లూథర్ వివరించారు

## జంటనగరాల చుట్టూ పట్టణాల నిర్మాణం

పట్టణ ప్రాంతాల అభివృద్ధి సంస్థ ప్రత్యేకాధికారి డాక్టర్ వి. కె. బావా జూన్ 4 వ తేదీన రిట్జ్ హోటల్‌లో జరిగిన రోటరీ క్లబ్ సమావేశంలో ప్రసంగిస్తూ, పల్లెపట్టులనుండి జంటనగరాలకు వలస వస్తున్న ప్రజల వసతికోసం, జంటనగరాల చుట్టూ నూతన పట్టణాలను అభివృద్ధిపరచాలనే ఆలోచన వున్నదన్నారు. జంట నగరాలు ప్రణాళికా బద్ధంగాకాక అడ్డదిడ్డంగా పెరిగిపోతున్నాయని, ఇది ఆరోగ్యకరంకాదని ఆయన తెలిపారు. జంటనగరాల 20 లక్షల జనాభాలో రెండున్నర లక్షల జనం గుడిసెలలో వుంటున్నారని, ఆయన వివరించారు. ఈ దుస్థితి ఒక్క హైదరాబాద్ నగరానికే కాక, మద్రాసు, బెంగుళూరు వంటి నగరాలకూ వుందని ఆయన అన్నారు.

## "సమాజం మారదు''కు బహుమతులు

కేంద్ర ప్రభుత్వోద్యోగుల సాంస్కృతిక సంఘాలు జూన్ 2 న రవీంద్రభారతిలో జరిపిన నాటకాల పోటీలో శ్రీ ఐ. రామచంద్రమూర్తి రచించిన, ఆలిండియా రేడియో ఉద్యోగుల క్లబ్బు ప్రదర్శించిన "సమాజం మారదు" నాటకం పెక్కు బహుమతులను సంపాదించింది. ఉత్తమ రచనకు, ఉత్తమ ప్రదర్శనానికి, ఉత్తమ దర్శకత్వానికి, ఉత్తమ నటునికి—ఇవన్నీ ఈ నాటకానికే వచ్చాయి.

## గ్రామీణ పరిశ్రమలు

రాష్ట్రపరిశ్రమల శాఖామంత్రి శ్రీ పి బసిరెడ్డి జూన్ 10 న పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, కేంద్ర ప్రభుత్వ గ్రామీణ పరిశ్రమ పథకం కింద గ్రామ ప్రాంతాలలో పరిశ్రమలు స్థాపించడంతో రాష్ట్ర ప్రభుత్వం ముందంజ వేస్తున్నదని తెలిపారు. ఈ పథకం కింద గ్రామ ప్రాంతాలలో పరిశ్రమల నిమిత్తం దాదాపు 58 లక్షల రూపాయలు అప్పుగా ఇవ్వబడ్డాయని, ఈ పథకం ఇదివరకు అనంతపూర్, గుంటూరు, నల్లగొండ, కరీంనగర్ జిల్లాలలో అమలుపరచామని, ఇప్పుడు ఖమ్మం, కడప, శ్రీకాకుళం జిల్లాలకు విస్తరింప జేస్తున్నామని ఆయన అన్నారు.

## తెలుగువారికి గర్వ కారణం

ఆంధ్రప్రదేశ్‌లో 17 జిల్లాల్లో ఉన్న ఫ్లూరోసిస్ (ఒక విధమైన కీళ్ళవాతం) వ్యాధిని నివారించడానికి ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలోని వైద్యులు డాక్టర్ ఎస్. రామచంద్రరావు, డాక్టర్ కె. ఎ. బి మూర్తి రాతినారతోపాటు దొరికే సర్పెంటైన్ అనే ఖనిజంతో నూతనౌషధం తయారుచేసినందుకు 1974 లో ఇచ్చే అమృత మోదీ రీసెర్చి అవార్డు 10 వేల రూపాయలు ఇవ్వబడింది. ఈ వైద్యులలో డాక్టర్ రావు ఉస్మానియా జనరల్ ఆస్పత్రి సూపరింటెండెంటు, ఉస్మానియా మెడికల్ కళాశాలలో ప్రొఫెసర్. డాక్టర్ మూర్తి అసిస్టెంట్ ప్రొఫెసర్. వీరు మనకు గర్వ కారణం.

## నాగార్జునకొండలో హరిణవనం

నాగార్జునకొండను చూచే విలాస యాత్రికులు ప్రాచీన వైభవాన్ని చూచి ఆనందించడమేకాక హరిణవనాన్నికూడ చూచి సంతోషించవచ్చునని, ఈ హరిణ వనాన్ని త్వరలో నెలకొల్పి, రకరకాల లేళ్ళ జాతులతో కనుల పండువుగా చేస్తామని గ్రంథాలయ, వినోద యాత్రాశాఖల మంత్రి డాక్టర్ సి హెచ్. దేవానందరావు జూన్ 18న తెలిపారు. ఈ హరిణ వనం విజయ విహార్ అతిథి గృహం వున్న చోట నెలకొల్పబడుతుంది. డాక్టర్ దేవానందరావు ఈ విషయమై అటవీశాఖాధికారులతో సంప్రదింపులు జరిపారు.

## యువకులకు మంత్రి శ్రీ కేశవులు హితవు

జవుళి, చేనేత పరిశ్రమశాఖామంత్రి శ్రీ కె. వి. కేశవులు జూన్ 23న రెడ్‌హిల్స్ జాయసీ ప్రారంభోత్సవంలో ప్రసంగిస్తూ, యువకులు, క్రమశిక్షణ, బాధ్యతగల పౌరులుగా అభివృద్ధి పొందాలని, ప్రభుత్వంపైనగాని రాజనీతిజ్ఞులపైనగాని ఆధారపడకుండా, తమంతట తామే ఆదర్శాలు, లక్ష్యాలు ఏర్పరచుకొని కృషి చేయాలని ఉద్బోధించారు నిరుద్యోగులయిన విద్యావంతులకు తగు ఉద్యోగకల్పన పథకాలను జాయసీ యువకులు ప్రారంభించాలని కూడా ఆయన హితవు చెప్పారు.

## రోడ్డు ప్రమాదాల నివారణకు మండలి

జూన్ 25, 26 తేదీలలో జరిగిన వివిధ రాష్ట్ర రవాణాశాఖామాత్యుల సభ తర్వాత రాష్ట్ర రవాణాశాఖామంత్రి శ్రీ జె. చొక్కారావు పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, ఈ సభ రవాణా భద్రతకు ప్రాధాన్యమిచ్చిందని, దీనికోసం రాష్ట్ర—జిల్లా స్థాయిలలో రోడ్డు భద్రతా మండలాలు నెలకొల్పాలని ఉద్దేశించబడిందని అన్నారు. ఈ మండలాలు రోడ్డు భద్రత మొదలైన విషయాలలో పోలీస్, రవాణా, మునిసిపాలిటీ మొదలైన శాఖలతో సహకరించవలసి వుంటుందని ఆయన తెలిపారు. 



ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఎస్. ఓబుల్ రెడ్డిగారు జూన్ 9వ తేదీన రాజ్‌భవన్‌లో రెడ్ క్రాస్ సొసైటీ రాష్ట్ర శాఖ సర్వ సభ్య సమావేశంలో బహుమతులు పంచారు.



పరిశ్రమల శాఖ మంత్రి శ్రీ పి. బసిరెడ్డిగారు జూన్ 9వ తేదీన జూబిలీహాల్‌లో పరిశ్రమల శాఖాధికారుల సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.

# నగరంలో వార్తాచిత్రాలు



జూన్ 9వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు హైదరాబాదులో పాణిని సంస్కృత స్నాతకోత్తర కళాశాలకు శంకుస్థాపన చేశారు.

జూన్ 2వ తేదీన ముఖ్యమంత్రి పుత్లీబౌలీలో మార్కెట్ కాంప్లెక్స్‌కు శంకుస్థాపన చేశారు.



జూన్ 1వ తేదీన ముఖ్యమంత్రి మలక్‌పేట కాలనీలో తెలుగు సాంస్కృతిక ఉత్సవాలను ప్రారంభించారు.



పెద్ద కథ




(గతసంచిక తరువాయి)

మాం అరుగుమీద కూకోని డబ్బులెక్కెట్టుకునే యేలకి మాయమ్మ అక్కడుంతేసీ, నెక్కలు నివోడా సేసుకున్నాక, మాయమ్మ పక్కలే ముసుగుతంతాడు అయ్య. మాయమ్మ నేన్నాడు ఆడొక్కడే తొంగుంతాడు. నా నోమూల తొంగడతాను. మా యయ్యకి అమావోశకీ, పున్నాంవుకీ ఆటయిడుపే. బారీడు పొద్దు సాగితెగాని నెగడు. నాను సెర్లతానంవాడి పకాలా సేసెత్తన్లే. ఆడునెగిసి, మర్లోకెల్లి, తానం సేసొచ్చేయేలకి సిటీ అయిస్కూల్ల కుఱ్ఱోల్లు బర్లోకెల్లోరు. అయ్యా, నానూ టిపిని జేసుకుంతం. అయ్య కల్లు మూతలడతై. అనగే ముస్తైత్తుకుంతా యెంకటేస్పరు గుడికెల్తాం. అయ్య అక్కడ గుడి గుమ్మం ముంగల బుఱ్ఱకొట్టుకోని మొక్కుకుంతడు.–యేటి మొక్కుకుంతాడో పురి–మరి ఆ నాటికి ఆడికీ నాకూ సరి. ఆడు తిన్నంగ–ఆడికెరికున్న నాంఱ్డీవోడి కడ కెల్లి పదిరోపిడ్లు అడ్డీయిచ్చి, రోపిడ్ అద్దిడబ్బులు ముట్టసెప్పి యిస్తిరి పేసిన జరీపంచీ, కట్ బనీనూ, తెల్లని లాల్చీ యేసుకోని, ఆడెక్కడికో యెల్లిపోతాడు. నాను యీదులన్నీ, బజార్లన్నీ సూసోక్కని అక్కడక్కడ వో అరకప్పు టీ యేసోక్కని, వొక్క రౌనుకొట్టి సినీమా బొమ్మలన్నీ సూసొక్కంతూ రొండు గంటలు కొట్టేయేలకి సెరుగట్టు సేరుకుని అమ్మకాడకెత్తే అమ్మ బువ్వెడతంది. అమ్మ అయాల బేపనోల్లింట గనక పనికెల్లకుంతే, బజార్లతిప్పుద్ది నన్ను. తిప్పి కొట్టులోటికెల్లి నాకు కొత్తపేసను నిక్కరూ, బుసోక్కటు కొంతది. పలారం కొనుక్కతింతం, కాపీ–టీ గాదు–కాపీయ్యే తాగుతాం. బేపనోల్లింటి కాడకి అమ్మెత్తే, అమ్మతో నానుగూడ యెల్లి, ఆల గుమ్మంల కూకుంతా, అమ్మపని సేసుకొచ్చే వొరకు. దీపాలెలిగే యేలకి, సాపులన్నీ సూసోక్కని మాయరుగుమీదే బువ్వెడద్ది–నాలుగు సెపాతీలూ, బంగాలీ దుంప మసాలాకోర, అన్నీనాకే. నానూ మాయమ్మ మజ్జిగ సుక్క తాగుతం. మాయమ్మ 'దూటీకెల్లకుంతె,' మాంవిద్దరం సినీమా మలాట కెల్లి, మాయరుగు సేరుకుంతం. ఆ రోజు మా సెడ్డ సర్దాగుంటది, మాయమ్మతో. మాయయ్య తొలాట సినీమాకెల్లి ఓగుంటని లంకించుకోని. మస్తుగ యింగ్లీషు సుక్క యేసోక్కని, జల్సాసేసోక్కని, అరుక్కాడ కొచ్చేయేలకి, రెండు, మూడొద్ది. "'నారిగా' మీయయ్య నూసెడ్డ యేడి మడిసిరా, నాకొడకా!" అని బజారు గుంటలు యిద్దరు ముగ్గురు సెప్పినరు నాతో–అల్లకెట్ట తెలిసిందోమరి. అయ్యనిసామీద గప్పాలు కొత్తుంతడు. ఆయేడి మీదుండే వొణ్ణి దగ్గరికి సేరనిచ్చేది గాదు గందా, అమ్మ వొంటిమీద సెయ్యేయనిచ్చేది గాదు. మాయమ్మ మా సెడ్డ కరకట్టు మడిసి. సైంయంటే సంయ్యే–నైయంటే నంయ్యే. సచ్చినా మాయమ్మ దగ్గిర తిరకాసు నేదు. ఆ డామూల వొంటిగ తొంగుడాల్సిందే. మాయమ్మ రోజూ అరుగుమీద తొంగేదేంవీ అని అడుగుదాంవనుకుంతున్నావు గదూ–నాను పోల్సినాన్లే. మాయమ్మ సదువుకున్న మడిసి, సుమా. మరీ కన్నుసూపు గుడ్డోణ్ణి యెలా తగులు కొందో తల్సుకుంతే నాకేటో అయోమయం గుంటది. మద్దినాళ అయ్య తొంగుంతప్పుడూ, మాయమ్మ నన్ను బజార్లోట తీస్కెల్లి, గోడల కతికించిన సినీమా బొమ్మలు సూపెట్టి అచ్చరాలు నేర్పించింది. 'అ'– అన్నదమ్ములు; – 'ఆ' – ఆండబతుకు; ఇ–ఇల్లాలు; ఊ–ఊర్వశి, క–కన్నెమనసులు, చ–చిలకాగోరింకా; త–తాత– మనవడూ; ప – పక్కింటమ్మాయి, మ–మనుషులు–మమతలు; బ–బంఱ్రోతుభార్య,–ఇట్టాగే అచ్చరాలూ, గుణింతాంవూ

నేర్పించింది. 'నాకెందుకో ఓలమ్మ, యీ సదువుసంత ?.' అని నాను మొర్రెత్తుకుంతే, "అది కాదురా! నాయనా! నువ్వు సదుకోవాల, నువ్వు వుద్దినోకి రావాల, నువ్వు బుద్దిగుండాల" అని బోధ సేసేది. సిత్తరంవైన మడిసి మాయమ్మ పొగలల్ల ఓమడిసి–ఆల్లింట, యీల్లింట అంట్లుతోంవీ శాకిరీసేసే అప్పలమ్మ. మరి రేతిరికి సీంకట్లై దీపాలెలిగీ సంసార్లు యిల్ల తలుపులు మూసేసుకునే యేలకి–పదిగంటలు కొట్టేయేలకి–మరి సెప్పక, మాయమ్మముంగల సినీమా గుంటలు యెండి తెరసాటున దాగుండి పోవాల! యేటనుకున్నవో! నానుగంతే రంబని సూణ్లేదుగాని, ఆ రంబ బతికుంతే–ఆరంబ బరతం పడతంది మాయమ్మ. అదుగందుకనే మన యూరిల్లకల్ల పెద్ద నాడ్జింగు నేదా, ఆనాడ్జింగు సావుకారు మాయమ్మని సూసి, పెత్తేకంగ కంవులెట్టి పిలిపించి, ఆడి కార్లె రప్పించుకున్నాడంట–మాయమ్మే సెప్పింది. రప్పించుకునీ, దర్జీవోడిచేపునేదూ, అదు గాచేపుతోనె–సావుకారి పయ్యేటుగదిలో చె–స్సాయంగ కొలిసి నాడంట. పొడుగు, గుండెలయెత్తూ, యెడల్పూ, నడుంవూ, తుంటీ–అయన్నీ కొలిసి–కాతా బుక్కుల రాసోక్కని–'పద్దింవిని' కిలాసల యేసుకున్నాడంట. అంటేటి – ఫస్టుకిలాసులోకి మల్లఫస్టు! ఆదినావు కాడ్నుండి–నాలుగేళ్లమాట అనుకో–మాయమ్మకి కంట్రోట్టు–మాట కంట్రోట్టే అనుకో. కాయితమ్మీద రాపించనేదనుకో–పెద్దమడుసులు మాటసెప్పితే[illegible]సాలు–కన్నెకోమ్మరి గుడిగుమ్మంల సింవాలు సెక్కినయి నేవా? అది గట్టగే ఆల్లమాట మరి. సెరగదంటే సెరగదే. రేతిరి పదికాన్నుండి, తెల్లోరేయేలకి – మూడుగంటలు కొట్టీయేలవరకూ మాయమ్మకి పైయంతస్తు గదిట–సింగల్ రూముల–డూటీ. గోపాల పరంల గిరాకి తగిత్తె అక్కడి కెల్లాల–టాక్సీ కరుజులు సావుకారియేలే. వూర్ల పెద్ద పెద్ద యిల్లకో, ఘరానా నాడ్జింగులకో, సప్లై కైతే–గోపాల పరం యెల్లిన్నాగే–రేటు రేతింకి ముప్పై, సావుకారు బిల్లుసేసి సేల్టాకిస్ కలిపి, ఆ పెద్దమడుసుల దగ్గిరుచ్చుకుంతడు. మాయమ్మది ఫస్టుకిలాసు రేటు. రెండోకిలాసు ఇర్వై, మూడోకిలాసు పదేను, నాలుగో కిలాసు పది. ఆ సావుకారు దగ్గిర్ది నికార్సు సరుకుగందా, మరి తక్కువ రేటు సరుకుసప్లై సెయ్యడు–ఆడిపేరు పోద్ది. "అబ్బ మీయమ్మకింత రేటిత్తే సావుకారు మన్నుగొట్టుకుపోడా?" అంతన్నావుగందా? ఉండుమరి, నాను సెప్పతన్నానుంతావా? తొమ్మిది గంటలు తాసిల్దారాపీసులకొట్టే యేలకల్లా సావుకారి పయ్యేటు గదిల తయ్యారుగుండాల. అంటేయేటీ–నాడ్జింగులో చే తానంవాడాల, ఆడిత్తాడులే, సాంపూ తలకి, సందనం సబ్బూ, బసంత మాలతీ మొకానికి తెల్లముద్దా, పౌడరూ, పెదాలికి రంగు, గోలకి నక్కాయేసోక్కని, వొల్లల్ల 'కునేగా' సెంటు పులుంవు కోవాల–ఆడిదే సప్లయ్. యీటన్నిటికీ రొండ్రూపాయిలు యిరగ్గోసుకుంతడు సావుకారు. మరి లేసు నాగు తొడుక్కోవాల, ఫుల్వోయిల్ లంగా కట్టాల, చిప్పను బాడ్డీ తొడగాల, జార్జెట్టు చోలీ యేసాక్కోవాల, పోరిన్ నైలాన్ సీరె కట్టాల, మరగాల్ల మడింవల జోడు తొడగాల, సేతిల బేగ్ పట్టాల. యీ దుస్తుల బాడిగకని ఆడు రేతిరికి మూండ్రోపయిలు తీసుకుంతడు. మరిగంతే, మెల్లో గిల్టు ఆరంవూ, మాయమత్తెల కుత్తిగంటూ, సెవులకి లోలక్కులూ, కుడిసేతికో ఆరు జతల వుమ బంగారం గాజులు, యెడంవ సేతికి వోసి, యేలికి ఎంర్రపొడి మాయబంగారం వుంగరాంవూ – యీటికి రేతిరికి అద్ది రొండ్రుపిడ్ లొసూజ్జేత్తడు సావుకారు. మరి డాక్తరూ మందులూ సార్జీలకని, యింజేషను డబ్బులకనీ రేతిరికి రూపిడ్ కోసేత్తాడు. పోలీసోళ్లకి వొత్తు రూపంలో రొండోకిలాసు సరుకు సప్లయి అటుంచి, నగదుమాముళ్ల కోసంవని రేత్తిరికి రొండ్రోపిడ్లు కరుజు జెప్తాడు షావుకారు. మాయమ్మ సేతిలెంతడతాడా సావుకారు? సింగారానికి రొండు, ముస్తాబుకి మూడు, మూడ్లొండు ఐదు, నగలకి రొండు–ఐదున్రొండు యేడు, మందులు మాకులకి వొకటి––యేడునొక్కటి యెనింవిది, పోలీసుస్టేషను ముడుపు రొండూ, యెనిమిన్రొండు పది–ముప్పైల పది యిరగ్గోసినాడంతె – మిగులు ఇర్వై. ఇర్వైల సంగోరు సావుకారిది, సంగోరు మా యమ్మది–సంగోరంతె ఎంత–పది మాయమ్మ మొగాన్ని గొడతాడు సావుకారు మారాజు. అప్సరనాగ తయ్యారైన మనచెణం–సావుకారు ముంగల ఆజరవ్వాల. అప్పుడాడు సూత్తడు–బొడ్డు కిందకే సీరగట్టిందో నేదో, యీపు యెన్నుంవుక మెడకాణ్ణుండి నడుంవొరకు చిన్నంగ కనబడతందోనేదో, సూసి ఆడు ఈలేత్తానే, బుక్కులఆజరుయేసోక్కంవని ఆడి మేనేజరికి పోన్ల కబురెడతాడు. మాయామ్మ ముస్తాబై ఆడిముంగల నిలుసుందంతె––శాతి పొంగులు యెంత సొంపుగుంతయ్యో, యెనకవొంపులూ అంత వొయ్యారంగ కులుకుతుంటై. ఆడికల్లు జిగేలుమంని సిల్లులొడిపోవాల–అదుగందుకే మాయమ్మ ఫస్టుకిలాసు పద్దివిని అని ఆడే టిక్కెట్టు రాసినాడు గందా. మూడు గంటలకి డూటీ సేసి, నాడ్జింగుకి టాక్సీమీదో, రికసా యేసుకునో పారొచ్చి. సావుకారి సాంవానంత ఆడిమేనేజిరికి వొప్పజెప్పేయాల. బాడీ కాడ్నుండి లోట నాగుతోసగా అన్ని శాల్తీలు యిచ్చేసి, పాంత కోకా, రెంయికాయేసోక్కని యెల్లిపోవాల. అది కంట్రాట్టు సరతులు. నేనోపాలి మాయమ్మతో కారుమీద గోపాలపరం యెల్లినాను. మాయమ్మ మాయయ్యనాక్కాదు. మాయమ్మని నిలువెల్ల వొల్లు వొలిసీ–సుక్కరుసి సూండదు. సావుకారితొ మాయమ్మ కంట్రాట్టు సరతెట్టినాది. మా యమ్మ నాలిక తాటివట్ట అనుకున్నావు గాంవాల! మాయమ్మది పద్ది విని ఉల్లాకు గందా–అందుకని వోరోనికి రెంండ్రోజులు ఆటిడుపు. ఆటిడిపురోజల్ల రోజుకి ఐదు రుపిడ్లు బత్తెం–మరెక్కడి కెల్లగూడదు–అదీ ఆడి సరతు. నాను సూత్తుంతాను–ఒకొక్కక్కపాలి–అమ్మయింటరుగు సేరుకునేసరికి–అమ్మ వొల్లంత రక్కులు, బుగ్గంల్రొండింటి మీద, రొండు తిరగలి రాల్లమీదనాగే–గంట్లు, అయి తెల్లగంట్లు, మా యమ్మ బుగ్గలమీదయి కెంపుల్లాటి నెత్తురు గంట్లు, పెదాలరెండు సితికిపోన దొండపల్లే. సేతిరుంవాలూ బాడీయంత రకతాపు డాగులే. డైవరుసింగు సూసి గెడ్డాంలోట సిరునవ్వు సిందించినోడు. నాకు సిర్రెత్తుకొచ్చి గొంతుకలోటుండి వెక్కులు సెగిలొచ్చినాయి. కార్లకూకోని మా యమ్మ నా నోరు నెత్తురు మరకల రుమాల్తొ నొక్కేసింది. నాడ్జింగుల శాల్తీ లొప్పగించేసి రసీదు రాపించుకొని యింటి కొచ్చేదార్ల నాకడుపుల సావుకారే సెయ్యియెట్టి కెలికేసినట్టనుకున్నను. మరుండబట్టక–అమ్మ సెయ్యెట్టుకుని యేడుత్తూనే అడిగినా: "అమ్మ, వోలమ్మా, నీ కెందుకమ్మ యీ కవుకులు? అయిగ బేపనోళ్ల నాలుగింటల పాసిసేసి బతుకు యెల్లమారుత్తుండావు – నీకేటి నోబైందీ? నానున్నానుగందా.

అయ్యొన్నాడు గందా. నీకంత బులుపుగుంతే ఆడిముసుగుల దూరుతున్నావుగందా. నీ కెందుకమ్మా యిదంతాను! " అని నా కడుపులోటి మాట అడిగీసినా. అమ్మ సిత్తరంగనవ్వి, అప్పుడు సెప్పింది. " అయ్యన్జూసి నా వొల్లేటి సలిపిందనుకున్నావేఁటి. సీ! మొగుణ్ణి సూసి నానంతట నానె ఆడికాడికి పారెల్లి దురద్దీర్చుకుందుకు నా వొల్లప్పటికే సచ్చిపోనాదిరా, నానిగా, నా నాయినా. నా వొల్లు సిత్రయింసలేజ్జేసి, కల్లకి గంతలు రాల్పించినోల్లున్నార్లే. ఆల్లునిచ్చేపంగ బతికున్రు. ఆల్లని నానేటి అన్ను. ఆడదాయి మొగోడు కల్చితేగందా— అండఁవై పిండం పెరుగుద్ది. నీకిప్పుడింక తెల్దు నాయనా— నీకు మీసకట్టొచ్చినాక తెలుద్ది. అదిగందుకే బుద్ది గుండమంతా నిన్ను. నాను రంకు ముండ కడుపున బుట్టినానని" ......... అందమ్మ. నాకేటి అరతంకాక, నానడిగినా వడిఁవిల " అదేటోలమ్మ! ఆడదాయికి పెల్లి సేసుకోకుంత పిల్లలుట్టగూడదని శాత్తర ముందంటే.? నాను పెల్లి సేసుకోకుంత గుంటని ముట్ట కూడదా? ముద్దెకుంతనే సంతానం కలుగుద్దా !" అనడిగినా. " అది గక్కుడే వొచ్చిందిర, నాయినా నాబతుకుల సిక్కంత నాను రండా గర, బొంవున బుట్టి నానకి నన్ను వోరు పెల్లి జేసుకోవఁన్రు. పాపం మాయమ్మకి పని దొరక్కదొరక్క, గర్లిస్కూలు వోస్టల వంట లక్కపని కుదురుకుంది. వో పంతులమ్మ కొడుకు మాయమ్మ దగ్గిర ఐదొందలుచ్చుకోని నన్ను పెల్లి జేసుకొండు. రెండేల్లు నన్ను యేలుకొని నా వొల్లు పీకి పిండెట్టె నా కడుపున కాయ కాయనేదని నామీదె నెపంయెట్టి, ఆయిస్కోల్లె సదువుతున్న రాజుల కుర్రదాయిని లేవదీసుకెల్లిపోనాడు. మా యమ్మ నౌక్రీ పోనాది. యేనుగు మాలీదిల బేపన పంతులంతే ఆ పంతులకాడ సేరి—ఇద్దరూ వొచేలిటిన్రు. ఆవోటల్ల పజ్జేసి జేసి, నావొల్లు—మహర్లా కన్రని బాడిదతనరికీ సిత్రికత సిత్రిక బట్టే బరమాత రంద్రాఁవులేజ్జేసి సేసినట్టుగె—పేనంలేని కొయ్యముక్కైపోనాదనుకో. నువ్వగనిపించావు. నాగుండెకి సీరెట్టి – సిట్టి సిగుర్నేపించినావు. నిన్ను నాను కాజెయ్యాలంటే అయ్యపక్కఁనాను తొంగోవాల్రా. నాయినా—"దేవుడుఁ నీకింత కర్మమాఁవురాసెట్టినాడెందుకో, ఓలమ్మా? " అని అడిగినా. అమ్మ యేమందీ: "దేవుఁడు నేదు. దెయ్యఁవూ నేదు. కరమ్మూ నేదు మరమ్మూనేదు. ఇదంత మడుసులేజ్జేసిన ఈ పెపంచం పోకదే యనుకొమ్మీ" అంది. " అనగంతే, అమ్మా. పెపంచం పోకడ అంత పోకిరీయేనా?" అని నానడిగినా, "పెపంచమంత పోకిరియ్యే, పెపంచంల మనుసులందరూ పోకిరీ యెదవలే, ఐతే మల్లా—మడుసులు మంచోల్లే. మా సావుకోరూ మంచోడే సుక్కెయ్యడూ, నీసు ముట్టడూ, యేటరొండు తూర్లు ఏడు కొండలాడి దర్శనం జేసుకోని గుండు కొట్టించుకుంతడు. మాలాటోల్ల మీద సెయెయ్యడూ, నన్నుడూటీమీద తోలేసేయేల వొరిజఁవూ రావు కాలవూ పంచాంగాఁవుల సూసి మరీ పంపిత్తాడు. పెల్లాం వొంటి నిండ నగనట మోపిత్తాడు కూతుర్ని డాక్టరు సదివిందుకు అఁమెరికా పంపించి, యేబైయ్యేలూ కారూ కటనాం యిచ్చి నచ్చునంగ పెల్లి సేసిండు దానం, దరమ్మంసేత్తడు. దినాఁవూ పది మంది బేపనయ్యలకి సొయం పాకం ముట్ట జెపతోడు. ఇనగే మంచోల్లు మంచి తల్లులూ యెందరో యెందరో వున్నారనుకో" .. "నువ్వు మంచి తల్లివి గావా అమ్మా? నీ కడుపు సీల్చి నాను పుట్టనేదు.

నీ రొమ్ము పాలు నాకు కుడపనేదు. మరి నా నంతే నీ కెందుకింత ఆపేచ్చ అంత'' అందుకు మా అమ్మ అంది గందా ''నామాటా, నీ మాటా కాదరా నారిగా, నాయనా, నోకమ్మీద మాట సూడాల్రా. పెపంచం నటక సూడాల్రా. ఈ పెపంచంల మననాటోల్లకి సుకం నేదురా బాబూ" అందమ్మ. నానన్నాను గందా: "మరో పెపంచానికి మనం యెల్లగూడదేటే?" అని నానంతే మా యమ్మ పక్కున నయ్యేసి: " యేం యెల్లగూడదూ? అదెక్కడుందో ముంగల తెల్సుకోవాల '' అంది. రోజులు దొర్లిపోనాయి. దొర్లిపోనాయి. మరో పెపంచం యెల్లేందుకు బారకాసుల బస్సులకాడ ఓరూ సెప్పనేదు మా యమ్మనే అడగాలనుకున్నను ఓసుట్టు మూడు నాలుగ్గంటలేలకి అమ్మ అరుగు సేరుకునే ముంగలే నాన్నెగిసి సత్తినారాయణ గుడికాడ రోడ్డు కేసింగు నేదూ. అక్కడ అమ్మ కోసవానీ కాసినాను. అమ్మ అల్లంత దూరాంనుంసే కనబడింది. ఆకసంల యేగుసుక్క యింక రానేదుగానీ, మాయమ్మె యేఁగుసుక్కనాగయెలిగి పోతంది. నన్ను అల్లంత దూరావుల సూసి, నాకాడకి పారొచ్చి, నన్ను గెట్టిగ కాయిలించుకోని రోట్టుమీదే యిల యిల యేడ్సేసింది. నాకు బయ్యఁవేసి, "యేటమ్మ, మల్లీ వొల్లుతూట్లడిందేటే?" అని అడిగినా, ''నాయనా, నా కొడకా, వొల్లు తూట్లడ లేదరా, మనసల్ల తూట్లడిందిరా నారిగా, నా బాబూ, జల్లైపోనాదిరా నాయనా' అని యేడ్చింది. "యేమైందమ్మా?" అనడిగా నాను దిగాలడిపోయి. "ఇయ్యాల వూర్లే సప్లియ్కి పెద్ద బంగాలాకి పంపినాడు. సావుకారు. తిరిగొచ్చీ యేలకి సావుకారే సాయగనా నొచ్చే యేలొర కుండి. నాపది రోపిడ్లు నాకాతాల జఁమ రాస్కోని ఐదు రోపిడ్లు ఎగస్ట్రాసేతి లెట్టినాడు. ఆ బంగాలా కాడ్నుండి పోనాచ్చిందట—సరుకు బేసుగ్గుందని. అందుకనే సావుకారో ఐదు రుపిడ్లు కటనం సదివించఁమని సెప్పి మాపిటిగ్గూడ పంపించమన్నాడంట. తెల్లారితె రొండ్రోతిర్లు నాకు ఆట యిడుపు. నానెల్లను గాక యెల్లనని సెప్పేసినా. ఆ ఐదు రోపిడ్లుచ్చుగున్నా గాని—మనసల్ల మంగలం పేలగింజనా యేగి పోతందరా. నాయనా" అ ది. అమ్మ యేడుపు సూశ్లేక, సావుకార్ని నను సంపేదునా, నీకీపీడ యిరగడైపోద్ది!" అన్నా. అమ్మంది గందా, "వోరీ, నీ సత్తిగేఁం బంగారంగానూ! ఆణ్ణి సంపేత్తె యేఁవుందిరా. నన్నుసంపేత్తే యేవుందిరా? ఆడుకాపోత్తే మరో సావుకారు, నానుపోతే మరోకర్తె. నువ్వెంతమందిని సంపగలవురా? అదికాదురా, నాయనా, యీ పెపంచమె సచ్చిపోవాల. యీ పెపంచాఁవె మారిపోయి మల్లీ పుటక పుట్టాల్రా! ఇదిగో ఐదు రోపిడ్లు సూసినావా? ఇది గిదే—యీ డబ్బే రాజ్యాం సేత్తాందిరా. ఈ రాజ్యాంల—కూలీ, నాలీ, కట్టఁవూ, సుకాఁవూ, కుటుంబాఁవూ, మగనాలూ, ఆడదాయికులుకూ, వొలవూ, అన్నీ యాపారం సరుకులే. మడసి మనిసిని దోసుకుంతున్నడు గందా దోసుకోడవమె యేటి? డబ్బు పారేసి కొనడంఁమన్న మాటే నన్ను కొంటున్నడు కాదా సావుకారు—సింతప డు, వుప్పు.పప్పు బియ్యాఁవునాగే నన్ను మనోడికి అమ్ముతుండు డబ్బు సేసి కుంతండు. నాన్న సేతుల మారు తన్నను గానా—నానా బజార్ల సరుకునే. డబ్బూ సరుకూ—యిదే సమ్మంతావు యీపెపంచాంల అది గందుకే యీ పెపంచాఁవే మారి పోవాల్రా బాబూ!" అని బావురు మంది అమ్మ యింతలోట ఆనాటి కాలీ అరుగు కొచ్చినాం. అమ్మ! "యిక పల్లకోరా!" అని

నా బుగ్గమీద ముద్దెట్టింది. పోయినోరం యేటయిందనుకున్నవేటి? మనూరికి 'మరో పెపంచం' సినీమా వొచ్చింది గందా. మాయమ్మని సావుకారు బువనేస్పారం నుండి ఓడో గాపోప్పయిన, ఉద్దేగాస్తుడు, ఆడికి సాయం యిచ్చి సినీమాకి తోలినాడు. మరేటయిందో యేటో తరాత రొండ్రేత్తిర్లూ మాయమ్మ ఆటిడుపు రేత్తిర్లే. మాయమ్మ తెల్లకోక గట్టుకోని, సేతుల రయిక యేసుకోని. ఆ సినీమాకే-'మరో పెపంచం' సినిమాకేయెల్లింది-ఆరొండ్రేత్తిర్లూనూ మాయమ్మతో నాను గూడ యెల్లినాను. "అదొక్కటే నేటిసినీమా పూర్ల. పంచకల్యాణి దొంగల రాణికి యెల్దామె' అనినానంటే అదయినుకోనేదు మా డోరేత్తిరి మొదటాట కెల్లినం రోపాయ్ ముప్పై పైసాలెక్కని రొండు టిక్కట్లు తీసిందమ్మ. లోని కెళ్ళినాం గాని-సినీమాసూత్తూన్నంతసెక్కా మాయమ్మ మాయమ్మే కాదనుకో. బజార్ల దురగమ్మ పూజకి పది సేతులు బొమ్మ యెడతారు గందా అదుగా దురగమ్మ నాగే వుంది మాయమ్మ. సెర్ల సూరేడు పడితే నీల్లు మెరసిపోవా-అదుగనాగే మయమ్మకల్లు సెమ్మగిలి, మెరిసిపోనాయనకో. మాయమ్మ సదుకుందని నాను సెప్పినాను. యెరికుందా? సీనీమాల పిల్లల కేసి. ఆ పోలీసోడు కేసినాను గుమ్మయిపోయి సూత్తూన్నాననుకో. నాను సూత్తూన్నంత సెక్కా మాయమ్మ "మరో పెపంచం, మరో పెపంచం పిలిసింది, పదండి ముంగులికి పదండి తోసుకు పోదాం పోదాం" అని వొహటే సణుగుడు. "యేటమ్మ నీగోల! అని అమ్మెపు సూసినగాని. అమ్మ కల్లు జూసి నాకు నిజంగ. బియ్యమేసి కల్లు వొక్కపాలి మూసుకొని మల్లీ బొమ్మకేసి జూసిన — సినిమా వొగ్గేసి కాలేజీ కుర్రోల్లు పదిమంది పాడు కుంటన్రు గెట్టిగే! "పదండి పదండి, పదండి ముంగలికి, కనబడ్నేదా మరో పెపంచం"! మాయమ్మ సదుకుంది గందా. మరి ఆల్ల పాడితేమాయమ్మే ఆల్లతో గొంతుగల్పిందో, మరి మాయమ్మే పాడితే ఆల్లే వొంత పాడిన్రో గాని, మాయమ్మ నోటంట పెగినింది పాట, 'అగ్గి కిరీటం దగదగలు! ఎర్ర బావులూ నిగనిగలూ! వోమజ్జోలల బుగబుగలు—మరో పెపంచం, మరో పెపంచం, మరో పెపంచం పిలిసింది. !—— —ఆల్లు పాడుకోని యెల్లి కిల్లీ బడ్డి కాడ బీడీలు కొనుక్కుంతా వనేసి అక్కడాగి పోన్రు. మాయమ్మ లోలోటే పాడుకుంతానే నాడ్జిగు యింటిలోటికి మల్లిందో—నేదో—సావుకారి మేనేజరూ రంగెత్తు కొచ్చినాడు రోజు కుంతా రొప్పు కుంటా మాయమ్మ దగ్గిర కొచ్చి—సెవిల యేటో వూది నోడు. నాకొద్దిగ యినికడైంది. "పోలీసులు కబురెట్టినారు — ఆల్లు ఊశన్నుండి బయలెల్లినోరు.——నిన్నొట్టుకు పోతారు.. నీ కేటి బియ్యం నేదు—యేం తెల్దను.—పల్లకుండు-'దండు ముండ, గుడిసేటి నంజ' అని తిట తోరు—అవును బాబు." అను——మరేటి సెప్పక——సావుకారు వూసెత్తక—కోరుట్టుల మల్ల యీ మాటలే పెగనాల నీ నోటంట—నువ్విక్కడే నిల్సొండి పోమి! అన్నడు.

పోలీసు లొచ్చిన్రు. బజారు గుంటల్ని రొండు పుంజిల మందిని బట్టు కొచ్చిన్రు. మాయమ్మని కూడ ఆల్లతోపాటు యాన్ల యెక్కించుకుని పోలీసుటేశన్కి యెల్లిపోన్రు. నా నేడ్చుకుంటా యెల్లినా టేశన్కి. లోట ఆల్లందరు కూకున్రు. మా యమ్మ ఆల్లకి కసింత యెడంగ కూకుంది. మాయమ్మ నన్ను గుమ్మంకాడ సూసి, రైటరుబాబుకేసి కన్నుగొట్టింది. రైటరుబాబు రంకేసినాడు. "రొండొందల నలిపియ్ నాలుగు! అప్పలమ్మని వొరండామీదికి తీసికెల్లు! ముండ పారిపోద్ది. జాగర్త!" అనోన్నాడు. మాయమ్మ నానున్నకాడకొచ్చి, నన్ను తీస్కొనెల్లి కొబ్బరిసెట్టు కాడ కూకుని, నన్ను పక్కల కూసోబెట్టుకోని బోద సేసింది...... "నాయినా, నారిగా, నీకేం బియ్యం నేదురా నాబాబూ! నాను మల్లీ ఆర్నెల్లకల్ల వొచ్చేత్తాను. మాటికి తప్పకంట గుడ్డోణ్ణి ఒగ్గియ్. నువ్వెల్లి సావుకారికన్నపడు. పద్దిరిని కొడుకునని సెప్పుకో. నీకు మైసూరు కాఫీ వోటల్లె కినరు పని సెప్పిత్తాడు. నెలకి పదేను రోపియ్లిచ్చి, రొండుపూట్ల కడుపునిండ బువ్వ. రొండు సుట్లూ టిపినూ యెడతాడు. ఇదిగో ఐదు రోపియ్లు. తలకత్తిరించుకో మంగలిసాపుల. తానంసేసుకోని యెల్లు సావుకారికాడికి. నానొచ్చిందాక సావుకారు సెప్పిన పన్లుండుమీ. బుద్దిగుండాల. బీడీలు, సిగరెట్లు ముట్టక. ముట్టనని నాతలమీద సెయ్యేసి పెమానకం సెయ్యి. అద్గదీ, నాబాబుగదరా, నానాయనా, ఇదిగో నీకు వోకం వోరం ఆటి పుంటడిగందా. అప్పుడు గిరిజా సెంటర్ల ఎర్ర జెండా పుస్తకాల కొట్టునేదా, ఆ కొట్టుల కూకుంతాడు, ఎర్ర పంతులు కాడకెల్లు. ఆ పంతులుపేరు సూన్నారాయణ. నాకు సయితన్న. సయితన్నంతే నీకు తెల్దువో, సూన్నారాయణగారి అయ్య సిరద్దారు. ఆరింటిల మాయమ్మే బేపనక్క ముండ మోపని తల గొరిగించిన్రులే. అయితే యేటి? పెద్ద పంతుల్కి అది అడ్డు రానేదు. అమ్మకి సిన్నంగ కడుపుసేసినడు. మరి సూన్నారాయణ పంతులు మా యన్నగాడా? నాను ఆరింటే పెరిగినా. మా యమ్మ మా నాయన్తొ జగడంవేసుకోని నేసెల్లిపోనాది. నానప్పటికే పెద్ద మడిసినైనా...అదంతోపాలి సెప్పినాగానా, మా యన్నగోరి దగ్గిరికి యెప్పుడెల్తాండూ, ఈ సీటీ జాగర్తిగ ఆయనకియ్యి. మాపిటికే. సీటి బద్దరం. అన్నియ్యకాడ నువ్వు సదువు నేరుసుకోవాల. నువ్వు బుద్దిగుండాల సుమీ. ఆర్నెల్ల నాను పారొత్తాను—నా సిచ్చ అయిపోద్ది. అప్పుడుగంతే, మా అన్నియ్యా, మా అన్నియ్యోల్లూ, నువ్వూ, నేనూ— అందరంవూ మరో పెపంచం కట్టిందుకు పునాదు లేదాం. తెల్సిందా......"

"రెండొందల నలపియ్ నాలుగు! అప్పలమ్మని తీసుకురా! టయింవైంది. లాకప్పుకి! జల్దీ!" అని టేశనులోటుండి కేక.

అమ్మ నన్ను బుగ్గలమీద ముద్దెట్టుకుని:

"మరో పెపంచం!" అని నవ్వుతా నా సెవిలోవూది, లోనకెల్లిపోనాది.

(అయిపోయింది)

# వార్తావాహిని

శినారా

## విశాఖ కర్మాగారంలో ఆక్సిజన్ ఉత్పత్తి

విశాఖపట్నంలోని భారీ ఫలకాలూ, పాత్రల కర్మాగారం ఢిల్లీలోని ఒక ప్రైవేట్ సంస్థకై రూపొందించిన ఆక్సిజన్ ఉత్పాదక యంత్రాలను వుపయోగించి జూన్ మొదటి వారంలో ఆక్సిజన్ ఉత్పత్తిని ప్రారంభించే యేర్పాట్లు చేసింది. గంటకు 6.8 ఘనపు మీటర్ల ఘనపరిమాణంగల ప్రాణ వాయువును ఉత్పత్తి చేసే యీ యంత్ర సాధనాలను భారీ ఫలకాల సంస్థ ప్రఖ్యాత ఫ్రెంచి సంస్థ తోడ్పాటుతో తయారు చేసింది. ఇదివరలో యీ సంస్థ గంటకు 140 ఘనపు మీటర్ల ఘన పరిమాణంగల ఆక్సిజనును ఉత్పత్తి చేసే యంత్రాన్ని రూపొందించింది. దానికి జూన్ 1వ తేదీన కేంద్ర పరిశ్రమలు, పౌర సరఫరాల శాఖ మంత్రి శ్రీ టి.ఎ. పాయ్ ప్రారంభోత్సవం చేశారు.

ఈ రెండు ఆక్సిజన్ యంత్రాలు చేసే ఉత్పత్తితో ఆక్సిజన్ ఉత్పత్తి విషయంలో స్వశక్తిపై ఆధారపడగలిగే అవకాశం యీ భారీ ఫలకాల సంస్థవల్ల ఏర్పడడమే కాకుండా పెద్ద మొత్తంలో విదేశీ మారక ద్రవ్యాన్ని మిగుల్చుకొనే అవకాశం కూడా వుంది.

## ''వేదభవన్''కు శంకు స్థాపన

రాష్ట్ర ప్రభుత్వం కేటాయించిన ఎనిమిది ఎకరాల స్థలంలో ఇరవై లక్షల రూపాయల ఖర్చుతో నిర్మించనున్న 'పాణిని' సంస్కృత మహా విద్యాలయంలో ఒక భాగంగా జూన్ 9వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు "వేదభవన్" కు శంకు స్థాపన గావించారు. దీని నిర్మాణానికి 3 లక్షల రూపాయలు ఖర్చవుతుంది. ఇది మన సాంస్కృతిక సంవత్సరం. యుగ యుగాల సంస్కృతినీ, సాహిత్యాన్నీ, నానాటికీ మార్పును సంతరించుకొంటోన్న ధర్మసారాన్నీ బోధించే 'సంస్కృత మహా విద్యాలయం' త్వరలోనే జంట నగరాల్లో స్థాపింపబడుతోంది. ఆ విద్యాలయానికి "వేదభవన్" శంకు స్థాపనతో నాంది పలకడం జరిగింది.

## హిందూస్థాన్ జింకు శుద్ధి కర్మాగారం

విశాఖపట్నం వద్ద హిందూస్థాన్ జింకు శుద్ధి కర్మాగారం నిర్మాణంతో దేశంలో యీరంగం అభివృద్ధి ద్విగుణీకృతం కాబోతోంది. ఈ కర్మాగారం ఇనుముకు సంబంధించని తదితర లోహాలను వెలికి తీయడంలో ప్రధాన పాత్ర వహిస్తుంది. ఎంతో విలువయిన విదేశీ మారకద్రవ్యాన్ని వెచ్చించి మనం యింతవరకూ జింకును యితర దేశాలనుండి దిగుమతి చేసుకొంటున్నాం. ఇక ముందు యీ విదేశీ మారక ద్రవ్యం ఆదా అవుతుంది. విశాఖపట్నం జింకు శుద్ధి కర్మాగారంలో రోజుకు 750 టన్నుల జింకును ఉత్పత్తి చేయడం ప్రధాన లక్ష్యం. హిందుస్థాన్ జింకు శుద్ధి సంస్థ వారి విస్తరణ కార్యక్రమాన్ననుసరించి దిబారి, ఉదయపూరు, విశాఖపట్టణం కేంద్రాల్లో యీ కర్మాగారాలను స్థాపించారు. బీహారులోని తాండూ వద్ద సీసపు శుద్ధి కర్మాగారం కూడా వీరే స్థాపించారు.

## ఉద్యోగినులకు వసతి గృహాలు

ప్రభుత్వ రంగంలో గాని, ప్రయివేటు రంగంలోగాని ఉద్యోగాలు చేసే మహిళలకు పట్టణాలలో భోజన, వసతి సదుపాయాలు గల నివాస గృహాలు నిర్వహించడానికి మహిళా సంఘాలవంటి స్వచ్ఛంద సంస్థలు ముందుకువస్తే ఆ వసతి గృహాల నిర్వహణకయ్యే వ్యయంలో 60 శాతం గ్రాంటు రూపంలో యివ్వడానికి కేంద్ర ప్రభుత్వ సాంఘిక సంక్షేమశాఖ సిద్ధంగా వుంది. విజయవాడలో భారత మహిళామండలి అటువంటి ఒక హాస్టలును రూ 1,21,000ల వ్యయంతో మండలి ఆవరణలోనే నిర్వహించ తలపెట్టింది. ప్రజలనుండి రూ. 50,000లు విరాళాల రూపంలో వసూలు చేయనున్నట్లు భారత మహిళా మండలి అధ్యక్షురాలు శ్రీమతి ముప్పా చంద్రవదనదేవి వెల్లడించారు.

## విద్యావిధానంలో మరో మలుపు

విద్యాసంస్థల్లో రోజూ తరగతులకు హాజరు కావడం, పరీక్షలకు కూచోవడం—మామూలుగా ఉండే ఈ పద్ధతికి తోడుగా ఇందుకు భిన్నమైన ఒక కొత్త పద్ధతిని (నాన్ ఫార్మల్ ఎడ్యుకేషన్) పెద్ద యెత్తున ప్రవేశపెట్టే విషయమై రాష్ట్ర ప్రభుత్వం యోచిస్తున్నది. ప్రయివేటుగా చదివిన బాలబాలికలు నేరుగా ఏడవతరగతి, పదవ తరగతి పరీక్షలు వ్రాయడానికి వీలు కల్పింపబడుతోంది. వయోపరిమితి ఏడవ తరగతికి 11 సం. లు, పదవతరగతికి 15 సం.లు. ఈ కొత్త పద్ధతిని ప్రయోగాత్మకంగా వచ్చేనెలలో కృష్ణా, ఖమ్మం జిల్లాల్లో ప్రవేశపెడతారు. దశలవారీగా అమలు జరిపే యీకార్యక్రమాన్ని ఇతర జిల్లాలకు కూడా విస్తరింపజేస్తారు. ప్రతి జిల్లాలోనూ యిందుకుగాను 100 కేంద్రాలుంటాయి. ప్రతి జిల్లాలోనూ యిటువంటి కేంద్రాలను నిర్వహించడానికి సుమారు రూ. 1.5 లక్షలు వ్యయమవుతుంది. కేంద్రం 1.5 లక్షలు "మాచింగ్ గ్రాంటు" గా ఇస్తుంది. ఈ నూతన విద్యాపద్ధతి క్రింద రెండు మూడు వేల

మంది పాఠశాలలకు వెళ్ళలేని బాలబాలికలకు చదువుకొనే అవకాశం కలుగుతుంది. 6–14 మధ్య వయస్కులకు, 15–25 మధ్య వయస్కులకు కూడా యీ పథకాన్ని వర్తింపజేస్తారు.

## ఆంధ్ర ప్రదేశ్ అంతటా ఒకే విధమైన సబ్ తాలూకా వ్యవస్థ

రాష్ట్రంలోని తెలంగాణా, ఆంధ్రప్రాంతాలకు ఒకే విధమైన సబ్‌తాలూకా వ్యవస్థను నెలకొల్పనున్నట్లు రెవిన్యూ మంత్రి శ్రీ పి. నరసారెడ్డి యిటీవల తెలియజేశారు. తెలంగాణా సబ్ తాలూకాలు స్వతంత్రంగా వుంటూ వాటికి ఇన్‌ఛార్జిగా డిప్యూటీ తాసిల్దార్లు వుంటూ, వారు తాసిల్దారు ద్వారా కాకుండా నేరుగా సబ్ కలెక్టర్, లేదా, డిప్యూటీ కలెక్టర్‌లతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపవచ్చును. అయితే ఆంధ్రప్రాంతంలో డిప్యూటీ తాసిల్దారు తాసిల్దారు ద్వారా వ్యవహారాలు నిర్వహిస్తారు. తెలంగాణాలోని వ్యవస్థ జాప్యాలను నివారిస్తుంది. కనుక అది ప్రయోజన కరంగావుంది. దానినే రాష్ట్ర మంతటా విస్తరింప చేసే విషయం పరిశీలనలో వుంది. కొన్ని సబ్‌తాలూకాల స్థాయి పెంచేందుకు కూడా పరిశీలిస్తోన్నట్లు మంత్రి తెలిపారు. రెవిన్యూ బోర్డు రద్దు అనంతరం భవిష్యత్తు వ్యవస్థ విషయం పరిశీలించడానికి నియమింపబడిన అధికారి తన పనిని ప్రారంభించారు. సాధ్యమైనంత త్వరలో ఆయన ఒక నివేదికను సమర్పిస్తారు.

## ప్రభుత్వ ఉద్యోగులకు క్రొత్త జీతాలు

రాష్ట్రప్రభుత్వోద్యోగులకు కరువు భత్యం కలిపిన కొత్త జీతాల స్కేళ్లను యిటీవల ప్రభుత్వం ప్రకటించింది. ఇవి 1975 మే 1 వ తేదీనుండి అమల్లోకి వస్తాయి. కాని 1974 జనవరి 1 వ తేదీన ఉన్న పరిస్థితిని దృష్టిలో పెట్టుకు కొత్త స్కేలును నిర్ణయిస్తారు. ప్రభుత్వం తీసుకున్న యీ సంక్షేమచర్యవలన 4 లక్షలకు పైగా ఉద్యోగులకు లాభిస్తుంది. ఏటా 10 కోట్లపైగా ఖర్చవుతుంది.

1974 సంవత్సరానికి ముందున్న కరువు భత్యం పూర్తిగా జీతంలో కలిపివేశారు. కొత్తగా 26 స్కేళ్లను ప్రతిపాదించారు. ఇవి కాక 13 స్కేళ్ళు ప్రత్యేకంగాఉపాధ్యాయులు మొదలగు వర్గాల వారికి వున్నాయి. అన్నిటి కంటె చిన్న స్కేలుకూ పెద్దస్కేలుకూ 1:13 నిష్పత్తి వుంది. లోగడ 1:30 నిష్పత్తి వుండేది. జీతాలలోని వ్యత్యాసాల తగ్గింపు గమనించదగింది. గరిష్ఠస్థాయి చేరుకున్న వారి కోసం 1 నుండి 3 యిక్రిమెంట్లు యివ్వడానికి అవకాశం కల్పించారు. చివరి గ్రేడ్‌లోని లోయర్ గ్రేడ్ ఉపాధ్యాయుల స్థాయి పెంచి, పై గ్రేడ్లను దీనికి అనుగుణంగా సవరించారు.

కొత్త స్కేలు నిర్ణయించేటప్పుడు 5 శాతం కలుపుతారు. ఈ మొత్తం 10 రూ .లకు తక్కువ కాకుండా 25 రూ.లకు మించకుండా వుంటుంది.

---

## చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధి రుణ సహాయక పథకం

ఆంధ్రప్రదేశ్‌లో చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధికి సౌకర్యాలు కల్పిస్తూ ప్రోత్సహించే సమస్యను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గత కొద్దికాలంగా పరిశీలిస్తున్నది. తగిన రుణ సౌకర్యాలు కల్పించే పక్షంలో హైదరాబాదులోను, ఆంధ్రప్రదేశ్‌లోను, అంతట కొత్తగా స్టుడియోలు నిర్మించడానికి అపారమైన అవకాశాలు ఉన్నాయని చలన చిత్ర పరిశ్రమ ప్రతినిధులతో జరిపిన చర్చలలో వెల్లడిఅయింది. ఇతర సౌకర్యాలు కల్పించడంతోపాటు నిర్ణీతగడువులో వడీతో సహా తిరిగి చెల్లించడానికి వీలుగా నిర్మాణం ఖర్చులో 80 శాతం మొత్తాన్ని రాష్ట్ర ప్రభుత్వం రుణంగా అందజేసే సౌకర్యాన్ని కల్పించాలని చలన చిత్ర పరిశ్రమ వారు సర్వసాధారణంగా కోరుతున్నారు.

చలన చిత్ర పరిశ్రమ వారి విజ్ఞప్తులను రాష్ట్ర ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలించి, ఆంధ్రప్రదేశ్‌లో చలన చిత్ర స్టుడియోల నిర్మాణానికి రుణ సహాయం అందజేసే పథకాన్ని ఆమోదించింది.

ఈ పథకంలో ముఖ్యమైన అంశాలు, రుణసహాయానికి సంబంధించిన నియమ నిబంధనలు ఇవ్వబడినాయి. ఆంధ్రప్రదేశ్‌లో చలన చిత్ర స్టుడియోలు, తత్సంబంధమైన సౌకర్యాలను నెలకొల్పడానికి చిత్ర పరిశ్రమలోని ఆసక్తిగల ప్రముఖులకు రుణ సహాయం అందజేయబడుతుంది. సేకరించిన వినోదం పన్ను నుండి చలన చిత్ర పరిశ్రమకు ఉద్దేశించిన మొత్తాలను యిందు నిమిత్తం వినియోగిస్తారు.

భూమి ఖరీదు, అభివృద్ధి, భవనాల నిమిత్తం 70 శాతం మేరకు, కొత్త పరికరాల నిమిత్తం 80 శాతం మేరకు రుణ సహాయం లభిస్తుంది. ఇదివరకే వాడిన పరికరాలను ఉపయోగించే పక్షంలో మదింపు వేసిన వాటి ధరలో 50 శాతం రుణ సహాయం యిస్తారు. నిర్మాణం పనిని బట్టి తగినట్లు దశలవారీగా మొత్తం రుణం యివ్వబడుతుంది.

# "సౌభాగ్య వాగీశ్వరి" సరస్వతి దేవాలయం

" సరస్వతీమయం దృష్ట్వా వీణాపుస్తక ధారిణీ
హంస వాహసమాయుక్తా విద్యాదాన కరీమమ "

శ్రీమతి పి. రమాదేవి సీతాపతి
శ్రీ పి. సీతాపతి

సరస్వతీ మాతకు భారత దేశంలో ఆలయాలు ఎక్కువగా కనుపించవు. ఆంధ్రప్రదేశ్‌లో ఈ చదువుల తల్లికి అపురూపమైన దేవాలయం ఒకటి ఉన్నది. ఇది శ్రీకాళేశ్వరాలయంలో ఒక చిన్న ఆలయంగా ఉన్నది. ఆంధ్రప్రదేశ్‌లోని త్రిలింగ ఆలయాలలో శ్రీకాళేశ్వరమొకటి. తెలుగు అనే పదము త్రిలింగ శబ్దము నుండి వచ్చిన విషయం అందరికీ తెలిసినదే. ఈ త్రిలింగ ఆలయాలు ఆంధ్రదేశంలో కరీంనగర్‌లో శ్రీకాళేశ్వర ఆలయం, శ్రీశైలంలోని మల్లికార్జునస్వామి ఆలయం, దక్షారామంలోని భీమేశ్వరస్వామి ఆలయం. తెలంగాణాలో ఉన్న శ్రీకాళేశ్వర ఆలయం కరీంనగరం జిల్లాలోని మహాదేవపురానికి పదకొండు మైళ్ళలో ఉన్న శ్రీకాళేశ్వర గ్రామంలో ఉన్నది. ఈ ఆలయం గోదావరి నది ఒడ్డున ఉన్నది. సరస్వతీదేవికి ఒక చిన్న ఆలయం, ప్రధాన దేవాలయ ఆవరణకు ఆనుకొని ఉన్నది. ఇటీవలి వరకు ఈ ఆలయం శక్తి ఆలయంగా భావించబడి పూజింప బడుచుండినది.

ఈ ఆలయంలోని మూల విగ్రహాన్ని పరిశీలించిన తర్వాత, ఆలయంలోని ప్రతిమ 'సౌభాగ్య వాగీశ్వరి' అనే సరస్వతీ ప్రతిమగా నిర్ణయించబడింది.

ఆలయంలోని సరస్వతి ప్రతిమ సుమారు ఐదు అడుగుల ఎత్తు కలిగి ఉన్నది. మూర్తి పద్మాసనయై ఉన్నది. శిల్పము క్రింద 'హంసవాహనము' చెక్కబడి ఉండుటచే, ఈమె హంస వాహనిగా గుర్తింప బడినది. మూర్తికి చతుర్భుజములు ఉన్నాయి. కుడివైపు పైహస్తంలో కమలము ఉంది. కటకహస్తయై ఉంది. ఎడమ వైపున పైహస్తంలో కమలం మీద చిలుక చెక్కబడి ఉన్నది. కుడివైపున క్రింది హస్తంలో 'అక్షమాల' ఉంది. ఈ హస్తం సింహ కర్ణముద్రలో ఉన్నది. ఎడమ వైపున క్రింది హస్తం 'పుస్తకం ధరించి,' పుస్తకహస్తయై ఉన్నది. మూర్తి హస్తములు అసహజ భంగిమలోగాక, ఆయుధములను సాధారణముగా ధరించినట్లు చూపబడి ఉన్నందున ఈ శిల్పం తొమ్మిదవ శతాబ్దమునకన్న వెనుకటిది కాదని తోస్తుంది. అక్షమాల, పుస్తకం ధరించి హంసవాహనిగా ఉండటము మూలాన్ని ఈ శిల్పము సరస్వతీ దేవి శిల్పముగా గుర్తించబడింది. అయితే శిల్పంలోని ఇతర అంశాలను పరిశీలించిన తర్వాత, మూర్తిలో లక్ష్మి, శక్తి అంశలుకూడ ఉన్నవని గుర్తించి, ఈ మూర్తి "సౌభాగ్య వాగీశ్వరిగా", గుర్తింపబడింది. ఇది భారత దేశంలో అతి అపురూపమైన శిల్పం. సౌభాగ్యవాగీశ్వరీ అని గుర్తింప బడగల మరో శిల్పం శ్రీకాకుళం జిల్లాలోని శ్రీముఖ లింగ ఆలయంలో ఒకటి ఉన్నది. కాని ఇక్కడి ఆలయంలోని మూర్తి పూజింప బడటమేగాక ప్రత్యేక ఆలయం కల్గిన అపురూప మూర్తియై ఉన్నది.

ఈ సరస్వతీ ఆలయాన్ని తెలుగు సంస్కృతిని తెలుసుకొనగోరే ప్రతి ఆంధ్రుడు తప్పక చూడాలి.

## ప్రజాస్వామ్యం ముఖ్యమే—దేశ భద్రత మరీ ముఖ్యం

# పాఠకుల లేఖలు

ఆంధ్రప్రదేశ్ జూలై నెల సంచికలో 'పాఠక లేఖలు' శీర్షిక ప్రవేశపెట్టినందుకు ధన్యవాదాలు. మీ పాఠకులను యీ విధంగా గౌరవిస్తున్నందుకు చాలా సంతోషంగా వుంది

భారతం బోరెత్తుతున్నదని ఒక పాఠకుడు రాశాడు. ఇది చాలా అన్యాయం. భారతీయ సంప్రదాయమంతా యిమిడివున్న "పంచమ వేదం" ఆయనకు అలా కనిపించడం దురదృష్టమే అని నా మనవి. ఈమధ్య ప్రసిద్ధ రచయిత్రి కె. రామలక్ష్మిగారిని హైదరాబాదులో కలుసుకున్నప్పుడు ఆమె దీనిని గురించి సదభిప్రాయం వెల్లడించింది. మేము ఆ పేజీలు చింపి బైండు చేయించుకుంటున్నాము గ్రహించ వలెను.

ఎస్. వేదవ్యాస్
శీతాఫల్‌మండీ, సికిందరాబాదు.

మహా పురుషుడైన "ఆంధ్రరత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని గురించిన మాదలవారి వ్యాసం (జూలై సంచిక) చాలా బాగుంది. కాని ఆంధ్రరత్న జననము. మరణమూ జూన్ నెలలోనే జరిగినట్లు వ్యాసంలో రాశారు. జూన్ నెల సంచికలోనే యీ వ్యాసం ప్రచురిస్తే ఉచితంగా వుండేది గదా !

మిరియాల రామదాసు
కర్నూలు.

[జూన్ సంచిక కోసమే యీ వ్యాసం ఉద్దేశించబడింది. స్థలాభావంచేత జూలైకి మార్చవలసి వచ్చింది—సం.]

ప్రపంచ మహిళా సంవత్సరం సందర్భంగా మహిళా సమస్యలకు మీ పత్రికలో ప్రాధాన్యం యివ్వడంలేదా ? ప్రభుత్వంవారికి మహిళాభ్యుదయం అక్కరలేదా ?

ఎస్. జానకి
విజయవాడ.

[అక్టోబరు సంచిక మహిళల ప్రత్యేక సంచికగా ప్రచురించడానికి సన్నాహాలు జరుగుతున్నవి—సం ]

శ్రీమతి సి. ఆనందారామంగారి సాంఘిక నవల సీరియల్‌గా వస్తుందని జూలై సంచికలో ప్రకటించారు. నవలా రచనలో సిద్ధహస్తురాలైన ఆనందారామంగారి రచన కోసం ఎదురుచూస్తున్నాం.

కావేటి రాములు
న్యూఢిల్లీ

జూన్ ఆంధ్రప్రదేశ్ సంచికలో 'మన శాసన సభ పనిచేసే తీరు' ను గూర్చి రచయిత వి. సుబ్బారామ శర్మగారు చాలా చక్కగా వివరిస్తున్నారు. ఈ వ్యాసం మాకు అనేక కొత్త విషయాలను తెలియజేస్తున్నది ఈ సంచికలోని వ్యాసాలన్నిటినీ పరిశీలిస్తే యిది ప్రభుత్వ పత్రికగా అనిపించడంలేదు. ఇది ప్రజల పత్రికే. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత ఎన్నో చట్టాలు చేశారు శాసన సభలో. ఆయా విషయాలను గురించి చేసిన చట్టాలలోవి విశేషాలను సులభంగా అర్థమయ్యేట్లు రాయించి ప్రకటించాలని కోరుతున్నాను.

ఎం. వేదవతి
చికడపల్లి, హైదరాబాదు.

[మీ సూచన బాగుంది—సం.]

ప్రసిద్ధ తెలుగు పత్రికలను మరిపించేలా ప్రచురించిన మీ జూన్ నెల " ఆంధ్రప్రదేశ్ " ను ప్రశంసించాల్సివుంది. " కన్నీరు తుడుచుకో కృష్ణవేణి——" అంటూ హృదయాన్ని కదిలించిన బాపురెడ్డి, మన శాసన సభ పనిచేసే తీరును సరళమైన శైలిలో చెప్పిన సుబ్బరామశర్మ, సమాజంలో కులత్వతం పోవాలని వాదించిన వీరాస్వామి, తెలుగు ఆధునికతకు వాడుకే ప్రమాణమని నిరూపించిన భద్రిరాజు కృష్ణమూర్తి, తెలుగు సాహిత్యంలో భారతీయ దృక్పథాన్ని వివరించిన డా. శివప్రసాద్, వావిళ్ళవారి వాఙ్మయ సేవను జ్ఞప్తికి తెచ్చిన బులుసు వెంకట రమణయ్యగారలు ఒకే సంచికలో దర్శన మీయటం పాఠకుడి అదృష్టం. పేలవమయిన రచనలు వెలువడుతోన్న యీ కాలంలో; చదువరిని పెడదారులకు మళ్ళించే పత్రికలు అచ్చవుతోన్న యీ కాలంలో కవీసం ఒక్క " ఆంధ్రప్రదేశ్ " ( మీరు మొదటి కవరులో వివరించినట్లు ) " తప్త ప్రకృతిలో వానజల్లు మొదలయింది " అనిపించేలావుంది.

మీ అభిమాన పఠిత
సి. సరోజ
కరీంనగర్



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారిని జూన్ 3వ తేదీన గూడూరు పంచాయతీ సమితి సన్మానించింది.



గూడూరులో శ్రీ దువ్వూరు నారాయణ రెడ్డి కమ్యూనిటీ హాలుకు జూన్ 3వ తేదీన ముఖ్యమంత్రిచే శంకుస్థాపన.

# ముఖ్యమంత్రి నెల్లూరుజిల్లా పర్యటన



సూళ్ళూరు పేటలో జూన్ 4వ తేదీన రైతు మహాసభలో ప్రసంగం.

జూన్ 4వ తేదీన గండిపాలెం ప్రాజెక్టు శంకు స్థాపన



జూన్ 3వ తేదీన నెల్లూరు జిల్లా పరిషత్‌లో ప్రసంగం





ఖమ్మంజిల్లా సూదిమళ్ళ పంచాయతీ సమితి ఇరసాలపురంలో ఆశ్రమ పాఠశాల నిర్మాణానికి గిరిజన యువజన శిబిరం సభ్యుల చేయూత.



ఇరసాలపురం ఆశ్రమపాఠశాల నిర్మాణ కార్యక్రమంలో మహిళామండలి కృషి.

## జిల్లాల్లో వార్తా చిత్రాలు



మే 28వ తేదీన కడపలో మహిళాగ్రంథాలయానికి యాత్రిక. గ్రంథాలయ శాఖ మంత్రి శ్రీ. సి. హెచ్. దేవానందరావు గారు ప్రారంభోత్సవం చేశారు.

రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు మే 30వ తేదీన విశాఖజిల్లా శృంగవరపు కోటలో సాంఘిక సంక్షేమ బాలికల వసతి గృహభవనానికి శంకు స్థాపన చేశారు.



కాళహస్తిలో చుక్కల నిరిగల్లు హరిజనులకు మే 28వ తేదీన మైనర్ ఇరిగేషన్ శాఖ మంత్రి శ్రీ ఆనం వెంకటరెడ్డిగారు యిండ్ల స్థలాల పట్టాలు పంపిణీ చేశారు.



# ప్రగతియాత్ర – 'తిరునగరి'

చేయి చేయి కలిపితే
చేయలేని దేదిరా
మనసు మనసు ఒకటైతే
మనుగడ స్వర్గమ్మురా

ఒళ్ళువంచి పనిచేస్తే
ఉర్వి సిరులు పండురా
ఒకరి కొకరు తోడైతే
జగతి సుధలు చిందురా

మంచిమాట గుండెలలో
మల్లెలు పూయించురా
తేనెపలుకు ఎల్లరలో
దివ్వెలు వెలిగించురా

అన్నమాట ఆచరించి
అడుగు ముందుకేయరా
మాట విలువ పెరిగినపుడె
మనిషి బ్రతుకు వెలుగురా

బుద్ధుడు ఒక మనిషేరా
జీసెస్ ఒక నరుడేరా
మనిషిగుండె వెలిగితే
మనిషే ఒక దేవుడురా

కర్తవ్యం తెలుసుకొని
గమించాలిరా ముందుకు
గతాన్ని బాగ చదువుకొని
కదలుమురా భవితకు

ప్రతి మనిషీ ఏదో ఒక
పనిచేసిననాడే మన
కదలిక ఒక జైత్రయాత్ర
ఆగలదది ప్రగతి యాత్ర

చేయి చేయి కలిపితే
చేయలేని దేదిరా
ఒళ్ళువంచి పనిచేస్తే
ఉర్వి సిరులు పండురా!

పెళ్ళయిన తర్వాత స్వాతంత్ర్యం అంటే ఏమిటో మర్చిపోయా!

మధు

వింత వేడుకలు

ఊహాతీత యథార్థాలు

ఘనాలో, అనేకులు మరణానంతరం వింత వింత శవపేటికలలో వుంచి స్థాపించబడాలని ఆశిస్తారు - జాలరులు పడవ ఆకారము, డ్రైవరు కారు ఆకారము, భూస్వాములు భవంతి ఆకారము గల శవపేటికలను కోరుతారు.

పురాతనకాలపు దక్షిణ భారత ఆదివాసులు మరణానంతరం శవాన్ని కుండలలో వుంచి స్థాపితం చేసేవారు. వారిలో దహనక్రియ ఆచారాలు అప్పట్లో లేవు.

చైనా దేశంలో మరణించిన వారిని భూస్థాపితం చేశాక, కాగితపు ఇళ్ళు, పరుపులు, పుస్తకాలు, రిక్షాలు దహనం చేస్తారు మరణించిన వారికి స్వర్గంలోయని తోడుగా వుండి వారికి సుఖజీవనాన్ని ప్రసాదిస్తాయని వారి నమ్మకం.

RANG REKHA FEATURES PVT LTD 1974

# గ్రంథసమీక్ష

## మేం

[కవితాసంకలనం; కవులు: సుధామ, నాగినేని భాస్కరరావు; ప్రచురణ: యువభారతి, 5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3; 64 పేజీలు; వెల. 5 రూపాయలు]

వచన కవులు పెక్కుమంది వెలుగు మార్గం వెదుక్కుంటూ చీకటిలో తచ్చాడుతున్నారు. సమస్యల వలయాల్లో చిక్కుకొని కలగాపులగంగా ఆలోచిస్తూ, కవిత్వానికీ ఉపన్యాసానికీ వ్యత్యాసం లేకుండా రచనలు చేస్తున్నారు. వర్తమాన సమాజపు స్థితిగతుల నవలోకిస్తూ శ్రీ సుధామ, నాగినేని భాస్కరరావుగారలు 'మేం' అనే కావ్య సంకలనం వెలువరించారు. "ఆశయంలో కవిత్వం వ్రాయి; దాన్ని ఆచరిస్తేనే బ్రతుకు" అనేది వీరి కవిత్వతత్త్వం. వీరి ఆశయమేమిటని పరిశీలిస్తే "సహస్ర విప్లవాల్ని ఆహ్వానించటం" గా కనిపిస్తుంది. మాటలేగాక చేతలలోనూ విప్లవాన్ని కోరినవాడే నిజమైన కవి అని వీరి నమ్మకం.

కవిత్వపరంగా చూస్తే వీరు రాసింది కవిత్వమనటానికి దాఖలాలు కన్పించవు వచనానికి, వచన కవితకు తేడాను పంక్తులను విడివిడిగా అచ్చు వేయటంలో తప్ప ఇంకెక్కడా పాటించలేదు. వచన కవితలో సాధారణంగా కన్పించే లయ, ఒక విధమైన తూగు, వచనం నుండి వేరు పరిచే భావప్రకటన వీరిసంకలనంలో చాలా కొద్దిచోట్ల మాత్రమే కన్పిస్తాయి. సంఘంలో జరుగుతున్న అన్యాయాలను వార్తాపత్రికలు వ్యాఖ్యానించినట్లుగానే వీరు కొద్ది మాత్రపు చమత్కారాన్ని జోడించి కవిత్వమని తలుస్తున్నారు "రంగెలిసి పోయిందని 'పాత జెండాను' ప్యూను రంగయ్య దేనికో వాడు కొన్నాడు. 'రేపు జండా వందనం'. మళ్లీ కొందామంటే మాజీ మంత్రులు తానులు తానులు కొన్నారట'.దాంతో దానిధర ఆకాశంలో వుంది-అన్నారు పంతులుగారు" ఇటువంటి వ్యాఖ్యను, అందులోని విషాదాన్ని తలచి కదలి పోనూవచ్చు కాని కవి తన శబ్దంతోగాని, శిల్ప చమత్కృతితో గాని సాధించేదేమీలేదు. నిలువుగా అచ్చేసినంత మాత్రాన కవిత్వమైపోదు. 'అంగారవల్లరి' అనేగీతంలో 'సుధామ'

"నిప్పులు చిమ్ముకుంటూ ఎగసి
నింగి అంచులు కాల్చి
నిబిడాశ్చర్యం కలిగించేలా
ఈ అట్టడుగు అన్నదమ్ములను మేల్కొల్పడానికి
కత్తి అంచుల మీద రాసుకు నడవడానికి
సిద్ధపడు''

అని హెచ్చరించారు. "నిప్పులు చిమ్ముకుంటూ, 'నిబిడాశ్చర్యం'యింకా 'అంగార వల్లరి' పదాలు శ్రీ శ్రీ, రమణారెడ్డిగారల కవితలను తలపిస్తాయి. విప్లవకవుల పదజాలాన్ని పుష్కలంగా వాడినంత మాత్రాన కవిత విప్లవకవిత అయిపోదు. వీరరాజుగారు "తను నమ్మినది ధైర్యంగా చెప్పగలగాలి. చెప్పినది సాధ్యమైనంత ఎక్కువగా ఆచరించి చూపాలి" అని 'ఇది చదివాక' చెప్పిన మాట గుర్తుంచుకోదగింది.

భాస్కరరావు 'ఔ' అనేగీతంలో "ఒక్కసారే పెల్లుబికేపీడిత జన కోపానికి మితిమీరిన అక్రమం నెత్తురు కక్కిచస్తుంది" అని అక్రమాన్ని శాపనార్థాలు పెట్టారు. ఈ శాపాలు పీడిత జనుల దగ్గరకు చేరుతున్నాయో లేదోననైనా ఆలోచించకుండా రాసేస్తున్నారు. పీడిత జనుల కోపాన్ని పెల్లుబికేటట్లుచేసే కవి పీడిత జనులలోనే ఉంటాడు. మధ్యతరగతి మేధావి వర్గం మాత్రం వాళ్లను ప్రోత్సహించి కవిత్వం రాసి 'కీర్తి' తెచ్చుకుంటారు. సిరాతో మాత్రమేచేస్తున్న సింహగర్జనలకు పేదల్నిపీడించే వర్గమెప్పుడూ భయపడదు. ఇలాంటి కవులు మాత్రం 'పేపర్ టైగర్ల' వలె (విప్లవకవులు తఱచుగాతెచ్చే ఉపమానం) మిగిలిపోతారు.

'స్థైర్యం' అనే గీతంలో 'సుధామ'

"ఈ గది దుర్గంధపు వాసనలను
నీ నిలుకడ తనం ఫినాయల్‌తో కడగ్గలవు" అన్నారు. నిలుకడ తనాన్ని ఫినాయల్‌తో పోల్చడంలో కవికి గల శక్తి ఏమిటో తెలుస్తుంది. మరొక గీతం వీరిదే "వేదనా వైజయంతిక"లో

"ఒక్కడూ ఆకలిచావు చావలేదని
పాతికేళ్ల ప్రణాళికా ప్రగతిని-పకోడీల్లా
ఉదారస్వభావులైన మంత్రిగారు
కరకర నమిలి మాట్లాడ్డం విన్నాను"

అని చెప్పటం పత్రికల్లోవార్తకు వ్యంగ్యమైన, తిరస్కారపూరితమైన చమత్కారమేగదా యిది ఇటువంటి బుల్లిబుల్లి చమత్కారాలు చిక్కటి కవిత్వమని ప్రశంసలందు కుంటున్నాయంటే ప్రవేశికలు కేవలం పొగడ్తలుగా మారాయని తలంచాలి.

'వాదనా వేదన' అన్న నాగినేని రచనను ఉపన్యాసమని మాత్రమే అనుకోగలం "మీరు వెళ్లకండి డబ్బుకోసం విదేశాలకు వెళకండి" అని వాచ్యంగా బల్లగుద్ది చెప్తూ కవిత్వంగా అచ్చువేస్తున్నారు. దేశస్థితిని పాడుబడ్డ బల్లివలె ఉన్నదని చెప్పటానికి, తెలుగులో 'కథానాయకుడు' 'రచయిత్రీ మానసవ్యభిచార పుత్రుడు', అని చెప్పటానికి ఎన్నో పాదాలు వ్యయం చేయటం చూస్తే కవిత్వానికి క్లుప్తత ప్రాణమన్న సత్యాన్ని వీరింకా నేర్చుకోవలసి ఉన్నదనిపిస్తుంది

'మేం' అనే యీసంకలనంలో వచన రచన కన్పించినంతగా వచనకవిత కన్పించదు. కవిత్వపు పంక్తుల కోసం వెదికితే కొద్దిగా వ్యంగ్యోక్తులు మాత్రం లభిస్తాయి. 64 పేజీల సంకలనం 5 రూపాయలు. ఇంత ఖరీదైన కవిత్వాన్ని కొని చదవటం మాత్రం కష్టం

—రామమోహనరాయ్

# పత్రికాలోకం

(తెలుగు పత్రికల సంగ్రహ సమాచారం)
(ప్రచురణ : భారతసమాజ విజ్ఞాన పరిశోధన మండలి.
ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయం, హైదరాబాదు-7.)

Newspaper is the only serious book most people read అంటాడు ప్రఖ్యాత అమెరికన్ జర్నలిస్టు శ్రీ వాల్టర్ లిప్‌మన్. అయితే అంత సీరియస్‌గా పత్రికలు నిర్వహించబడుతున్నాయా. అంత సీరియస్ విషయంగా పత్రికలు చదివే పాఠకులు వార్తల్ని గురించి, వ్యాఖ్యల్ని గురించి ఆలోచిస్తున్నారా? ఈ ప్రశ్నలకి సమాధానం సగటు మనిషితోపాటు, పత్రికలు నిర్వహించేవారుకూడా ఆలోచించవలసివుంది. తెలుగు పత్రికలు సంఖ్యలో చాలా తక్కువ. నాలుగే నాలుగు దిన పత్రికలు. మూడు వార పత్రికలు. ఉంటామా, పోతామా అన్నట్టు చావు బతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్న చిన్నతరహా పత్రికలు కొన్ని. ఏడెనిమిది మాస పత్రికలు, ఇదీ మన పత్రికాలోకం. అయితే దిన పత్రికలలో మాత్రమే జాతీయ, అంతర్జాతీయ, రాజకీయ, సాంఘిక పరిణామాలను మనం చూడగలుగుతున్నాం రోజువారీగా.

ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయానికి సంబంధించిన, భారత సమాజ విజ్ఞాన పరిశోధన మండలి, దక్షిణ ప్రాంతీయ కేంద్రంవారు ప్రచురించిన తెలుగు పత్రికల సంగ్రహ సమాచార, పత్రిక పత్రికాలోకం తొలి సంచికలో, ప్రముఖమైన మూడు తెలుగు పత్రికలు, ఆంధ్రప్రభ, ఆంధ్ర పత్రిక, ఆంధ్రజ్యోతి నుంచి సంగ్రహించబడిన, ప్రధాన వార్తలు ఒక 'చారిత్రిక' క్రమంలో కూర్చబడివున్నాయి రాజకీయ సంఘటనలు, సమ్మెలు, సాంఘిక పరిణామాలు, సంక్షిప్తంగా సూచించబడ్డాయి. 'జై ఆంధ్ర' ఉద్యమం, రాష్ట్రపతిపాలన మొదలైన ప్రధాన విషయాలకు సంబంధించిన సమాచారం క్లుప్తంగా పొందుపరచబడింది దిన పత్రికలనుంచి జూలై, ఆగస్టు, సెప్టెంబరు మాసాల సంచికలనుంచి మాత్రమే వార్తలు గ్రహించారు పత్రికాలోకం సంపాదకులు. ఇది పుస్తకం మొదటి భాగం

రెండవ భాగంలో ప్రధానంగా రాష్ట్రవిషయాలను గురించిన సమాచారం వుంది. ఈ సమాచారం ప్రధానంగా ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధ శాఖవారు నిర్వహిస్తున్న 'ఆంధ్రప్రదేశ్' మాస పత్రికనుంచి గ్రహించడం విశేషం. ఈ రెండవ భాగంలో అన్నీ వ్యాసాలు. ఆంధ్రప్రదేశ్ పత్రికలో ప్రచురించబడిన, విద్య, చరిత్ర, పాలన, పంచాయతీ వ్యవస్థ, రాజ్యాంగం, మొదలైన వివిధ అంశాలపై చర్చలతో కూడిన వ్యాసాలు సూచించబడి వున్నాయి 'సోవియట్ భూమి' వంటి విదేశీ రాయబార కార్యాలయాలు నిర్వహించే పత్రికలనుంచి కూడా వ్యాసాలు గ్రహించి సూచికలో చేర్చడం బాగుంది. సంపాదకులు ప్రారంభంలోనే చెప్పినట్టు యిది పరిశోధనకు, ఆసక్తితో సమాజ పరిణామాలను అధ్యయనం చేసేవారికి రిఫరెన్స్ బుక్‌గా బాగా ఉపకరిస్తుంది. భా. స. వి. ప. మండలివారి కృషి హర్షించదగిందీ; ప్రోత్సహించదగిందీ

-దేవిప్రియ



---

# స్వీకారం

## రాగారాధన (గేయఖండ కావ్యం)

(రచయిత : శ్రీ యన్ బాలరాజు వెల : 2.50 రూ.
ప్రచురణ : శ్రీనివాస సాహితీ సమితి, వివేక నగర్, హైదరాబాద్)

"రసస్రవంతి" కలంపేరుతో శృంగార రసంలో ముప్పయి ఆరు గేయాలను ఒక సంకలనంగా ప్రచురించారు రచయిత. గేయాలన్నీ సరళ శైలిలో రాగాలాపనతో పాడుకోడానికి వీలుగా వున్నాయి. లలిత సంగీతం మీద అభిరుచి వున్న చదువరులు తప్పక కొనదగిన ఖండకావ్యం.

## వెలి నాగరికత (సాంఘిక నవల)

(రచయిత : "నవలా కళానిధి" శ్రీ కోలాహలం లక్ష్మణరావు. వెల రూ. 2 50, ప్రతులకు : నాగినీ పబ్లికేషన్స్, మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా) సమాజంలో స్త్రీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో జీవితపర్యంతం అనుభవిస్తోన్న కష్టాలను యితివృత్తంగా తీసికొని సుమారు 50 పేజీలలో రచించిన సంక్షిప్త నవల.

## జయశివభవహర

(రచయిత : విద్వాన్ గొట్టుముక్కల నీలకంఠ శర్మ: వెల : రూ. 1.50; ప్రతులకు : జి. నీలకంఠ శర్మ 2-14-7, కొల్లాపురం, మహబూబ్ నగర్ జిల్లా)

ఇది దేవచూడామణీ శతకంతో పాటుగా మరో నాలుగు భక్తి ప్రబోధకములయిన ఖండ కావ్యాలున్న సంపుటం. ముముక్షువులు చదువదగినది.

# జిల్లాల్లో..

## కొల్లిమర్ల వంతెనకు శంకుస్థాపన

గుంటూరు జిల్లా పొన్నూరుకు మూడున్నర మైళ్లదూరంలో చింతలపూడి వద్ద కొల్లిమర్ల మురుగు కాలువ మీద రూ 1 58 లక్షల వ్యయంతో నిర్మించనున్న వంతెనకు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు జూన్ 10 న శంకుస్థాపన చేశారు. గ్రామీణులు వ్యయమయ్యే మొత్తంతో సగం భరించడానికి ముందుకు వచ్చినందుకు ముఖ్యమంత్రి వారినభినందించారు ఈ మురుగు కాలువ ఆవల సుమారు ఆరువందల ఎకరాల సాగు లాయకీ భూమి వున్నది. ఆ పొలాలకు వెళ్లిరావడానికి రైతులు పడరాని పాట్లు పడుతూ వుండేవారు. ఈ వంతెన నిర్మాణంతో చక్కటి దారి యేర్పడి రైతులకు బహుళ ప్రయోజనాలు కలుగుతాయి. శంకుస్థాపన సందర్భంగా జరిగిన సభకు రాష్ట్ర నీటి పారుదల శాఖ మంత్రి శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు అధ్యక్షత వహించారు.

## పశ్చిమ గోదావరి జిల్లాలో హరిజనోద్ధరణ

షెడ్యూలుకులాల ఆర్థిక సహాయ సంస్థ పశ్చిమ గోదావరి జిల్లాలో హరిజనుల సాంఘిక ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచడానికి రూ. 20 లక్షల ఖర్చుతో వివిధ కార్యక్రమాలను అమలు చేస్తారు హరిజనులకు యిళ్ళ స్థలాలను కేటాయించడానికి కూడా యింతే మొత్తం వ్యయమవుతుంది పంచాయతీలు తమ వనరులను పెంచుకొనడానికి షెడ్యూలు బ్యాంకుల సహాయాన్ని పొంది, ఉత్పత్తి పథకాలను చేపట్టాలని యిటీవల జరిగిన ఒక సమావేశంలో ప్రసంగిస్తూ జిల్లా కలెక్టరు శ్రీ జి కుమార స్వామిరెడ్డి ఉద్బోధించారు. పోడూరు సమితిలోని ఆచంట ఉత్తమ గ్రామంగా ఎంపిక అయిన సందర్భంగా సమితి సర్పంచ్‌కి నగదు బహుమతిని అందజేశారు.

## విశాఖ జిల్లాలో మంచినీటి సరఫరాకు రూ. **6.25** లక్షలు మంజూరు

ఈ సంవత్సరం విశాఖపట్నం జిల్లాకు మంచినీటి సరఫరా నిమిత్తం రూ. 6 25 లక్షలు మంజూరు చేసినట్లు పౌర సరఫరాల కమీషనర్ శ్రీ ఇ. వి రాంరెడ్డి తెలిపారు ఆయన ఈ జిల్లాలోని యలమంచిలి, శృంగవరపుకోట, యింకా యితర ప్రాంతాలలో పర్యటించారు. జిల్లాలో అనావృష్టి పరిస్థితులు ఎలావున్నదీ పరిశీలించడానికి ఆయన యీ పర్యటన జరిపారు. ఇంతవరకు రాష్ట్రంలో 7.5 లక్షల టన్నుల బియ్యాన్ని సేకరించామని శ్రీ రాంరెడ్డి వెల్లడించారు. పంటల పరిస్థితులను గూర్చి పౌర సరఫరా విషయాలను గూర్చి రెవిన్యూ బోర్డు సభ్యులు శ్రీ రాంరెడ్డి జిల్లా అధికారులతో చర్చలు జరిపారు.

## గుంటూరు జిల్లాలో బలహీనవర్గాల వారికి యిళ్ల స్థలాలు

గుంటూరు జిల్లాలో బలహీనవర్గాల వారికి యిళ్లస్థలాలను యిచ్చేందుకు ఉద్దేశించిన బృహత్కార్యక్రమంలో ఒక భాగంగా ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గుంటూరు పట్టణంలో 1063 కుటుంబాలవారికి యిళ్ల స్థలాలకు సంబంధించిన పట్టాలను పంపిణీ చేశారు. అలా పంపిణీచేసిన స్థలం 27 08 ఎకరాల వరకు వుంది. ఈ జిల్లాలో ఇప్పటికే 6,000 కుటుంబాలకు పైగానే యిళ్లస్థలాలను యివ్వడం జరిగిందని ఆయన అన్నారు గుంటూరు పట్టణంలో ముఖ్యమంత్రి పాత్రికేయులకు ఇళ్లస్థలాలకు సంబంధించిన 16 పట్టాలను పంపిణీ చేశారు కొత్తగా అభివృద్ధి పరచబడిన నల్ల చెరువు ప్రాంతంలో పురపాలక సంఘ ఆరోగ్య సిబ్బంది కుటుంబాలకు 610 ఇళ్ల స్థలాలు కేటాయించబడ్డాయి 45 భూమిలేని వ్యవసాయ కుటుంబాలకు ముఖ్యమంత్రి మొత్తం 36 ఎకరాల మేరకు భూమిని పంపిణీ చేశారు.

## ఒంగోలు సమీపంలో ఇనుప ఖనిజం

ప్రకాశం జిల్లాలోని ఒంగోలు సమీపంలో 10 కోట్ల టన్నులకు పైగా ఇనుప ఖనిజం లభిస్తుందని జాతీయ ఖనిజాభివృద్ధి సంస్థ ప్రణాళిక విభాగం డైరెక్టర్ యిటీవల వెల్లడించారు. రాష్ట్రప్రభుత్వం కోరికపై యీ మధ్య నిర్వహించిన ఒక నిర్దిష్టమైన సర్వేలో ఈ విషయం వెల్లడయింది ఒంగోలు సమీపంలో లభించే యీ ఇనుపఖనిజం వచ్చే 50 సంవత్సరాల వరకూ రాష్ట్ర ఖనిజావసరాన్ని తీరుస్తుందనీ, విశాఖపట్నంలో నెలకొల్పనున్న ఉక్కు కర్మగార అవసరాలకిది ఉపయోగపడుతుందనీ అంచనా వేయబడింది.

## కమల్‌కోట లిఫ్ట్ ఇరిగేషన్ పథకం

నిర్మల్‌కు 35 కిలో మీటర్ల దూరంలో వున్న కమల్ కోట గ్రామంవద్ద గోదావరి నదిపై లిఫ్ట్ ఇరిగేషన్ పథకాన్ని అమలు చేయడానికి ప్రాథమిక సన్నాహాలు పూర్తయినవి భూమి తనఖా బ్యాంకు యిచ్చే రెండున్నర లక్షల రూపాయల రుణంతో నిర్మించే యీ లిఫ్ట్ ఇరిగేషన్ పథకంవల్ల అదనంగా ఐదువందల ఎకరాల భూమికి నీరు లభిస్తుంది రైతులు యీ రుణాన్ని పదిహేనేళ్లలో తిరిగి చెల్లిస్తారు. జూన్ రెండవ వారంలో రెవిన్యూ శాఖ మంత్రి శ్రీ పి. నరసారెడ్డి కమల్‌కోట వెళ్ళి అక్కడ యీ పథకానికై నిర్దేశించిన స్థలాన్ని తనిఖీ చేసి వచ్చారు

## భూదానోద్యమ ప్రచారం

దేశంలో భూసమస్య పరిష్కారానికి అహింసామార్గమే సరియైనదనీ, హింసా మార్గం సరియైనది కాదనీ, పూజ్య వినోబాజీ, భూదానోద్యమం ద్వారా 24 ఏండ్ల క్రితం ప్రపంచానికి ఋజువుచేశారని ఆంధ్రప్రదేశ్ భూమ్యాదాయ శాఖామంత్రి శ్రీ పి. నరసారెడ్డి గారు ఈనెల 12వ తేదీని ఆదిలాబాదు జిల్లాలో వాంఖిడి గ్రామం వద్ద భూదాన రజతసంవత్సరోత్సవాల సందర్భంగా ఏర్పాటైన

పెద్ద బహిరంగ సభలో వెల్లడించారు. భారత దేశానికి ప్రధాన మైన ఆర్థికవనరు వ్యవసాయమేననీ, అది సర్వతోముఖంగా అభివృద్ధిచెందిననాడే దేశప్రజలకు ఆర్థిక స్వాతంత్ర్యము లభిస్తుందనీ ఆయన అన్నారు.

ఆంధ్రప్రదేశ్ భూదాన యజ్ఞ బోర్డు అధ్యక్షులు శ్రీ సి. వి. చారిగారు సభకు అధ్యక్షత వహించారు.

శ్రీ నరసారెడ్డిగారు తమ ఉపన్యాసాన్ని కొనసాగిస్తూ ఆర్థిక స్వాతంత్ర్య సముపార్జనలో, ఆచార్య వినోబాభావే భూదానోద్యమం, గణనీయమైన పాత్ర నిర్వహిస్తోందని అన్నారు. భారతదేశం అహింసకు పుట్టినిల్లనీ, గౌతమబుద్ధుడు, అశోకుడు, మహాత్మాగాంధీలను కన్న గడ్డయనీ, ఆ యుగ పురుషులు ప్రబోధించిన సిద్ధాంతాలకు కట్టుబడి పనిచేయడము ప్రతి భారతీయుని విధ్యుక్త ధర్మమనీ ఆయన పేర్కొన్నారు. వినోబాజీ ఋషి తుల్యులని వర్ణిస్తూ, ఆయన ప్రవచనాలను పాటించక పోతే మనం ఆత్మవంచన చేసుకోవడమే అవుతుందని ఆయన హెచ్చరించారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ సి. వి. చారిగారు మాట్లాడుతూ భూదానోద్యమం అంతిమ లక్ష్యం గాంధీజీ ఆశించిన గ్రామ స్వరాజ్యమేనని, ఆ లక్ష్యసాధనకై నిర్మాణ కార్యకర్తలు, గ్రామస్థులు కలిసి మెలిసి కృషిచేయాలని విజ్ఞప్తి చేశారు.

## ఏజన్సీ ప్రాంతాల్లో గిరిజన సంక్షేమం

గిరిజనులు ఎక్కువగా నివసిస్తోన్న శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, ఖమ్మం, వరంగల్ జిల్లాలలోని ప్రాంతాలలో వంతెనల నిర్మాణానికి రాష్ట్ర ప్రభుత్వం సమకట్టింది. ఏజన్సీ ప్రాంతాలలో రహదారులు సరిగ్గా లేవన్న విషయం చాలా కాలంగా పరిశీలనలో వుంది. వాటిని మెరుగు పరచడానికి ప్రభుత్వం సంసిద్ధమైవుంది. ఇటీవల అరకులోయలో "హౌస్ కమిటీ" సమావేశానికి అధ్యక్షత వహించిన రహదార్లు, భవనాల శాఖ మంత్రి శ్రీ చనుమోలు వెంకట్రావు యీ విషయాన్ని ప్రస్తావిస్తూ ఏజన్సీ ప్రాంతాలలో వంతెనల నిర్మాణానికి యీ సంవత్సరం అదనంగా రూ. 1.5 కోట్లు కేటాయించినట్లు ప్రకటించారు. గిరిజనులు అధికంగా నివసిస్తోన్న పై ఆరు జిల్లాలకు ఒక్కొక్క దానికి రూ. 5 లక్షల వంతున రోడ్ల నిర్మాణానికి కేటాయించినట్లు కూడా ఆయన ప్రకటించారు.

## కరీంనగర్ జిల్లా రైతులకు రూ. 2 కోట్లకు పైగా రుణాలు

కరీంనగర్ జిల్లా ఖరీఫ్ పంటకాలానికి రైతులకు సహాయం అందజేయాలని ప్రభుత్వం తలపెట్టింది. పంటకాలంలో రైతులు ధనం లేక భూమిని బీడుగా వదలివేసే సమస్యలు ఎదురవుతోన్న కారణంగా పేదరైతులకు స్వల్పకాలిక రుణరూపంలో యీ సహాయం అందజేయబడుతుంది. ఈ కార్యక్రమం క్రింద రూ. 260 లక్షలను రైతులకు పంపిణీచేస్తారు. ఇదికాక వ్యవసాయశాఖ ద్వారా రూ. 16 లక్షల మేరకు ఐ. ఎమ్. ఎస్. రుణాలుకూడా రైతులకు అందుతాయి.

## ఉట్నూరు సమితిలో గిరిజన సంక్షేమ పథకాలు

ఉట్నూరు సమితి ప్రాంతంలో గిరిజన అభివృద్ధి కార్యక్రమాలకై ప్రభుత్వం కేటాయించిన ధనంలో మిగులు నిధులను, అంటే రూ. 3 లక్షల 75 వేలను, సంక్షేమ కార్యక్రమాలకై వినియోగించాలని సమితి నిర్ణయించింది. ఈ పథకాలను ప్రభుత్వ ప్రోత్సాహంతో అమలుచేయటమే గాకుండా, రూ. 25 లక్షల 15 వేలతో యీ ప్రాంతపు రైతులకు విత్తనాలను, ఎరువులను సరఫరా చేయాలని కూడా నిశ్చయించారు. ప్రత్యేకించి గిరిజనుల సంక్షేమం కోసం సమితి సాధారణ నిధి నుండి 28 వేల రూపాయలు ఖర్చు చేస్తారు. జిల్లా గిరిజన సంక్షేమశాఖ సమితిలోని గిరిజనులకు విత్తనాలు, ఎరువులు సరఫరా చేయడానికి రూ 4,600, బీడు భూములను సాగులోనికి తీసుకొనివచ్చే రైతులకు యివ్వడానికి రూ. 5,500; వ్యవసాయ పనిముట్లకోసం రూ 16,060లు; ఎద్దుల కొనుగోలుకు గిరిజనులకు సబ్సిడీ రూపంలో యివ్వడానికై రూ. 22,200; యితర అవసరాలకోసం రూ 10,800 మంజూరు చేశారు.

## హయత్‌నగర్‌లో ఎలుకలబెడద నివారణచర్యలు

ఎలుకల బెడద నివారణ కార్యక్రమం పేరుతో హైదరాబాద్ జిల్లా హయత్‌నగర్ సమితిలో ఒక ప్రయోగాత్మక పథకాన్ని అమలు జరిపారు. గ్రామప్రాంతాల్లో ఎలుకలు, పందికొక్కుల వల్ల పంటలు పాడుకాకుండా కాపాడడానికిగాను రొడెంటిసైడ్, రొడోపెరాన్ అనే మందులను వినియోగించి కుంట్లూరు గ్రామంలో యీ చర్యను ప్రారంభించారు. కోళ్ళకూ, జంతువులకూ, (పసిపిల్లలకు హాని కలుగకుండా) యీ మందులు వినియోగిస్తారు రాష్ట్ర వ్యవసాయ విశ్వవిద్యాలయంలోని ఎటమాలజీ శాఖాధిపతి డా॥ ఎడ్విన్ ధర్మరాజు, విస్తరణశాఖ సిబ్బంది, పోస్టుగ్రాడ్యుయేటు విద్యార్థులు యీ ప్రయోగాత్మక పథకాన్ని నిర్వహించి కుంట్లూరు గ్రామంలో 75 శాతం ఇళ్ళలో యీ మందుల్ని చల్లించారు.

## తూర్పు గోదావరి జిల్లాలో స్టేట్ బ్యాంక్‌చే విస్తృతంగా రుణాల పంపిణీ

తూర్పుగోదావరి జిల్లాలోని రైతులకు పారిశ్రామికవేత్తలకు స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా యిప్పటి వరకు రూ. 7 కోట్ల 50 లక్షల మేరకు రుణాలుగా యిచ్చినట్లు హైదరాబాద్ ప్రాంతీయ జనరల్ మేనేజర్ వెల్లడించారు అన్ని రంగాల్లోనూ ఉత్తమ నైపుణ్యం కలిగివుండి, పనిముట్ల కొనుగోలుకు, నిర్వహణకు వ్యయం చేయడానికై ఆర్థిక వనరులు లేనివారికి యీ రుణాలు అందజేశారు రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో యీ బ్యాంకుకు చెందిన 365 శాఖలు పనిచేస్తున్నాయి వీటి డిపాజిట్లు రూ. 131 కోట్ల మేరకు ఉన్నాయి. మన రాష్ట్రంలో యింత వరకు యీ బ్యాంకు మొత్తం రూ. 128 కోట్ల మేరకు రుణాలను మంజూరు చేసింది.

# తూర్పుగోదావరి జిల్లాలో పరిశ్రమల విస్తరణ కార్యక్రమం

తూర్పుగోదావరి జిల్లా జూన్ 13 నుండి 18 వరకు పరిశ్రమల అభివృద్ధికి ముమ్మర కార్యక్రమం జరిగింది. జిల్లాలో కొబ్బరితోటల వనరులను వినియోగించుకోవడం ద్వారా సాధ్యమైనంత వరకు ఎక్కువ సంఖ్యలో కొబ్బరికి సంబంధించిన పరిశ్రమలు నెలకొల్పాలన్నది యీ కార్యక్రమంలో ప్రధానలక్ష్యం. ఈ కార్యక్రమాన్ని రాజమండ్రిలో మూడురోజులు,కాకినాడలో మూడురోజులు నిర్వహించారు. పరిశ్రమల విస్తరణతో సంబంధం వున్న ఆర్థిక సహాయ సంస్థలను ఒక చోట సమావేశపరచి నూతనంగా పరిశ్రమలు స్థాపించాలనుకొన్న వారికి అక్కడికక్కడ శీఘ్రగతిన మంజూరీ యివ్వాలన్న సంకల్పంతో ఈ ముమ్మర కార్యక్రమాన్ని పరిశ్రమల విభాగంచేపట్టింది. దీనివల్ల పరిశ్రమల స్థాపనకు ఎట్టి అవరోధాలుగాని, ఆటంకాలుగాని వుండవు సరికదా శీఘ్రగతిన యివి విస్తరించడానికి అవకాశం ఏర్పడుతుంది. పరిశ్రమల స్థాపనకు అందిన దరఖాస్తులను పరిశీలించడానికి ఒక కమిటీని నియమించారు. ఈ ముమ్మర కార్యక్రమం కొనసాగినన్ని రోజులు యీ కమిటీ సిఫార్సుల నందజేసింది. జిల్లాలో యీ కార్యక్రమం సందర్భంగా 536 మందికి పరిశ్రమలస్థాపన కోసం మంజూరీ యిచ్చారు. ఈ పరిశ్రమల స్థాపనకు ఉద్దేశించిన మూలధనం రూ. 2 కోట్ల 40 లక్షలు. ఈ మూలధనం 3,205 మందికి ఉపాధి కల్పిస్తుందని అంచనా.

# చిత్తూరుజిల్లాలో ఉపాధి సౌకర్యాల విస్తరణకు ప్రత్యేక కృషి

మదనపల్లెలో జూన్ 14న చిత్తూరు జిల్లాలోని ఉపాధి సౌకర్యాల విస్తరణోద్యమం ప్రారంభించబడింది. ఇండియన్ బ్యాంకు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్రాంచి మేనేజర్లు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ, లఘు పరిశ్రమలసేవా సంస్థ, పరిశ్రమల శాఖ డైరెక్టర్ కార్యాలయాలకు సంబంధించిన ప్రతినిధులతో కూడిన ఆమోదసంఘం సంయుక్తంగా పారిశ్రామిక వేత్తలను ప్రాజెక్టులను ఎన్నికచేసింది.

ఈ సంఘం ఎదుట హాజరైన 44 మంది పారిశ్రామిక వేత్తల్లోను 32 మంది పారిశ్రామిక వేత్తలు ఎంపికచేయబడ్డారు. ఈ ముప్పయ్యిద్దరికీ మొత్తం రూ. 13 లక్షలమేరకు డబ్బు పంపిణీ చేయడానికి అంగీకరించడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సహాయసంస్థ అయిదుగురు పారిశ్రామికవేత్తలకు, ఎ.పి.ఎస్.ఎస్.ఐ.డి.సి. ఒకరికి, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా 16 మందికి, ఇండియన్ బ్యాంక్ 15 మందికి సంబంధించిన కేసులపై పరిష్కార చర్యలు తీసుకున్నారు.

ఆమోదసంఘ సభ్యులకు అంగీకారమైన ప్రాజెక్టులను, పారిశ్రామిక వేత్తల కేసులను పూర్తిగా పరిశీలనలు జరిపిన అనంతరమే ఎంపికచేయడం జరిగింది. పరిశ్రమలశాఖ ఉద్యోగులు పారిశ్రామిక వేత్తలు ఆయా ప్రాజెక్టులను చేపట్టడంలోనూ, నివేదికలు రూపొందించడంలోనూ సాంకేతిక సలహా సంప్రదింపులను జరిపారు.

కుప్పం, పలమనేరు, కొత్తూరు, తిరుపతి, కాళహస్తి, చిత్తూరులలో యిదేవిధంగా ప్రత్యేక కృషి జూన్ 21 వరకు జరిగింది.

# మహిళలకు ప్రత్యేకంగా పది కళాశాలలు ప్రారంభం

అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా విజయవాడ మున్సిపల్ స్టేడియంలో జూన్ 18న వివిధ మహిళా మండలులు నిర్వహించిన చేతివస్తు ప్రదర్శనను శ్రీమతి ప్రభావతి కృష్ణారావు ప్రారంభించారు. సమావేశానికి అధ్యక్షత వహించిన రాష్ట్ర విద్యా మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు ప్రసంగిస్తూ ప్రస్తుతపు అంతర్జాతీయ మహిళా సంవత్సరాన్ని పురస్కరించుకొని స్త్రీలకు ప్రత్యేకంగా అయిదు డిగ్రీ కళాశాలలను, అయిదు జూనియర్ కళాశాలలను యీ యేడాది ప్రభుత్వం ప్రత్యేకంగా ప్రారంభించనున్నట్లు తెలియజేశారు. వీరికై ఒక పాలిటెక్నిక్‌ను, ఒక రెసిడెన్షియల్ విద్యా సంస్థను ప్రారంభించనున్నట్లు కూడా మంత్రి వెల్లడించారు. జిల్లా స్త్రీ సంక్షేమ శాఖాధికారిణి శ్రీమతి పెరిన్ షా ప్రదర్శనను గూర్చి వివరించారు.

# విశాఖ జిల్లాలో ఖరీఫ్ పంట

విశాఖ జిల్లాలో ఖరీఫ్ పంటకు ఎరువుల కొరత లేకుండా యీ సంవత్సరం 7400 టన్నుల ఎరువులు కేటాయించారు. గత సంవత్సరం దాదాపు 5000 టన్నులు మాత్రమే కేటాయించబడ్డాయి. సులభ పంపిణీకి 15 డిపోలు యిప్పటికే యేర్పాటు చేశారు. మరో 15 డిపోలు త్వరలో ప్రారంభమౌతాయి. 1975 ఖరీఫ్ పంట క్రింద 1,63 లక్షల హెక్టార్ల భూమిలో వరిసేద్యం చేయబడుతుంది. అనావృష్టి మూలంగా యిదివరలో 1,48 లక్షల హెక్టార్లలో మాత్రమే వరి పండించారు. ఈయేడు 54,000 హెక్టార్లలో అధికోత్పత్తిసాధక వంగడాలు 'జయ', 'రత్న' మొదలయినవి సేద్యమవుతున్నాయి. మొత్తం సేద్యపు ప్రాంతంలోనూ 10 శాతానికి సరిపడే వరివంగడాలు సుమారు 8 టన్నులవరకు వ్యవసాయశాఖ సరఫరాచేస్తుంది. మిగతావి రైతులు సమకూర్చుకొంటారు.

---

## గుత్తి దుర్గం

(42 వ పేజీ నుండి)

ప్రాపిత రాజ్యవైభవ నిరాకృతపాక విరోధియైన, యా
గోపనమంత్రి ధర్మధన గోపన సమ్మతి, గుత్తిదుర్గ, ల
క్ష్మీ పరిపాలన క్రమసమిద్ధ భుజాబలశాలి, రూప రే
ఖాపరమత్స్యలాంఛను, డయాహవ కార్య దురంధరుం
డిలన్॥

### పరిపాలన

విజయనగర రాజ్యమునకు వారసుడైన సదాశివరాయలు కుట్రచే బంధితుడై గుత్తిదుర్గమున నేలమాళిగ యందుంచబడెనట. అది తెలిసి కృష్ణదేవరాయల అల్లుడైన రామరాయలు గుత్తిపైకి దండెత్తి భూగృహమందున్న సదాశివరాయలను విడిపించి, అచటనే అతనిని విజయనగర సార్వభౌమునిగా పట్టాభిషిక్తుని చేసెనట.

తాళికోట యుద్ధానంతరం గుత్తిదుర్గం కొంత కాలము బీజాపూరు నవాబులకును, తర్వాత గోల్కొండ నవాబులకును లొంగియున్నట్లు తెలియుచున్నది. 1677 ప్రాంతంలో శివాజీ నాయకత్వాన మహారాష్ట్రులు అనంతపుర మండలముపై దండయాత్రలు చేశారు. వారిని, బీజాపూరు నవాబులను అదుపులోపెట్టే ఉద్దేశముతో, ఔరంగజేబు 1687లో దక్కన్‌పై దాడిసల్పి, దానిని జయించి, తన సేనాపతులలో ఒకనిని సుబేదారుగా నియమించి వెళ్ళినాడు. 1713 లో అనంతపురం మండలముతోపాటు గుత్తిదుర్గము దక్కన్ సుబేదారు పాలనక్రిందికి వచ్చింది. ఔరంగజేబు మరణానంతరం 1724 లో కమ్రుద్దీన్ అసఫ్‌జా, నిజామ్-ఉల్-ముల్క్ అను సుబేదారు స్వతంత్రత ప్రకటించి, హైదరాబాదు ముఖ్యపట్టణముగా పరిపాలన సాగించాడు. అతని కాలమున అనంతపుర మండలమున అరాజకం ప్రబలి, స్థానికులైన నాయకులు వూరికొక పాలెగాడుగా తయారై ప్రజాకంటకులైనారు. ఆ అరాజకాన్ని అవకాశంగా తీసుకొని, మహారాష్ట్రి సేనానులలో ఒకడైన శాంతాజీఘోరపడె, మనుమడు మురారిరావు 1746 లో గుత్తి, తాడిపత్రి, పెనుగొండ ప్రాంతాలపై దాడిచేసి, వాటిని స్వాధీనం చేసుకొని, గుత్తిదుర్గమును ప్రధాన కార్యస్థానముగా చేసుకొన్నాడు.

1762లో మైసూరు రాజైన హైదరాలీ, రాజ్యవిస్తరణకై కన్నడ ప్రాంతం నుండి తెలుగుదేశంపైకి దండయాత్ర నడిపి, గుత్తిదుర్గమును ఎదిరించి ఓడిపోయెను. రెండవసారి 1776 లో దండయాత్ర నడిపి పెనుగొండ, మడకసిర దుర్గాలను స్వాధీనంచేసుకొని, గుత్తిదుర్గాన్ని ముట్టడించినాడు. 2-3 నెలల పర్యంతము యుద్ధము జరిగినను కోట వశము కాలేదు.

తుదకు హైదరాలీ కపటోపాయముతో సంధికై రమ్మని చెప్పి మోసగించి, కొండమీది దుర్గమునుండి దిగివచ్చిన మురారిరావును దారాపుత్ర సహితముగా బంధించి, కబాల దుర్గమునకుపంపి దుర్గమును స్వాధీనము చేసుకొనెను.

1800 లో నైజాం నవాబు ఇంగ్లీషువారు తనకిచ్చిన సైనిక సహాయానికి ప్రతిఫలంగా రాయలసీమ జిల్లాలతోసహా గుత్తి దుర్గమును వారికి దత్తం చేసెను. వారు ఈ దుర్గమును కొంత కాలము రాజకీయ ఖైదీలను ఉంచుటకు ఉపయోగించిరి.

ఈ దుర్గమందలి మహలుల నిర్మాణము ఒక కర్రముక్క కూడా లేకుండా కమాన్లతీర్చి, నిర్మింపబడినవి. వాటి లోపలి భాగమున వేయబడిన వర్ణచిత్రములు నేటికీ రూపుమాసిపోక యున్నవి. ఆంధ్రుల శిల్పకళాశక్తికి, నిర్మాణ నైపుణ్యతకు మచ్చుతునకలుగా మిగిలిన గుత్తి కోట గోడలు, బురుజులు, ఏనుగుల, గుఱ్ఱముల శాలలు, వ్యాయామశాలలు, బోగందాని మహలు మొదలగునవి ప్రతివారు తప్పక చూడదగినవి.

గుత్తికోటతోపాటు, కోటపై ఏర్పాటు చేయబడిన వైర్‌లెస్ కేంద్రము, కోటలో ఒక భాగముగాఉన్న సయ్యద్‌పాషా దర్గా, శిల్పకళా చతురతనుచాటే నగరేశ్వరస్వామి దేవాలయము, క్రైస్తవుల చర్చి మందిరము, కన్యకాపరమేశ్వరి ఆలయము, మార్టిన్ స్మిత్ ఉన్నత పాఠశాల భవనములు, భారత స్త్రీల మానరక్షణకై ఆంగ్లేయుల నెదిరించి, అసువులర్పించిన అమరజీవి హంపన్న సమాధి, రాయలసీమ జిల్లాల కలెక్టరుగానుండి, తర్వాత మద్రాసు గవర్నరుగా పనిచేసిన మన్రో పేరిట నిర్మింపబడిన మన్రో సత్రము, భారత్ సేవక్ సమాజ్‌వారిచే నిర్మింపబడిన ఆరుబయలు రంగస్థలము గుత్తిలో ముఖ్యముగా చూడదగిన ప్రదేశములు.



PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS, HYDERABAD.
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION. AND PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD.


Regd. No. H. 81
దేశ సుస్థిరతకు ప్రమాదం వాటిల్లనున్నప్పుడు ఏ ప్రభుత్వమైనా ఎలా చూస్తూ వూరుకోగలదు? కొద్దిమంది చర్యలవల్ల అధిక సంఖ్యాకుల హక్కులకు భంగం వాటిల్లుతున్నది. దేశంలో గట్టిగా వ్యవహరించడానికి జాతీయ ప్రభుత్వానికి వుండే శక్తిసామర్థ్యాలను సన్నగిల్ల చేసే ఎటువంటి పరిస్థితి అయినా బయటినుంచి వచ్చే ప్రమాదాలకు దారితీస్తుంది.
సమైక్యతనూ, సుస్థిరతనూ కాపాడడం మన కర్తవ్యం. దేశ సమైక్యతను కాపాడాలంటే గట్టి చర్య తీసుకోపలసిందే.
—ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ